# నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో



## తురగా జానకీరాణి కథల పోటీ

ప్రథమ బహుమతి : రూ. 10,000

ద్వితీయ బహుమతి : రూ. 8,000

తృతీయ బహుమతి : రూ. 7,000

5 విశేష బహుమతులు

కథ ఒక్కొంటికి : రూ. 5,000

## తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ



ప్రథమ బహుమతి : రూ. 10,000

ద్వితీయ బహుమతి : రూ. 8,000

తృతీయ బహుమతి : రూ. 7,000

5 విశేష బహుమతులు

కథ ఒక్కొంటికి : రూ. 5,000

### కథ/హాస్యకథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితాన్ని ప్రతిబింబించేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జతపరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద **'తురగా జానకీరాణి కథల పోటీకి'** అని స్పష్టంగా పేర్కొనాలి. పోటీకి హాస్యకథ పంపుతున్నట్టయితే కవర్ మీద **'తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి'** అని పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీ పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లి' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.

### కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లి
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76
రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

## కథలు, హాస్యకథలు చేరవలసిన ఆఖరు తేది

# 30 జూన్ 2017

* నిబంధనలు వర్తిస్తాయి



60

## అందం అంటే...

అందం అంటే స్లిమ్‌గా ఉండటం అనుకుంటారు. కానీ కొన్నిచోట్ల లావుగా ఉండటమే అందానికి నిర్వచనం అని తెలుసుకుంటే మీరు ఆశ్చర్యపోతారు ! వంకరటింకర పళ్ళు, చుబుకంపై నల్లటి టాటూలు అందానికి ప్రతిరూపాలట! అదేమిటో తెలుసుకోండి.

8

### కాగితాలతో కళాకృతులు

జపాన్ జానపద కళ ఒరిగామి. అంటే కాగితంతో కళాకృతుల్ని తీర్చిదిద్దడం. ఎన్నో జంతువుల ఆకృతులను వివిధ భంగిమల్లో తయారుచేస్తున్న ఓ అమ్మడు గురించి చదవండి.

72

### ఇంటర్వ్యూ

యూత్‌ని ఒక ఊపు ఊపిన హీరోయిన్ రాశి. ఇప్పటి హీరోయిన్లు చాలా అదృష్టవంతులంటున్న ఆమె ఇంటర్వ్యూ ఈ వారం....

## సీరియల్స్


| | |
|---|---|
| వెట్టి | 16 |
| మనసుగతి ఇంతే! | 30 |
| సినీవాలి | 46 |
| సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు | 62 |


## కథలు


| | |
|---|---|
| హర్షఋతువు | 10 |
| మరో అమ్మకథ | 26 |
| కొత్త బంగారులోకం | 38 |
| సరదా కథలు | 44 |
| వేసే ప్రతి అడుగు.. | 56 |


## ఫీచర్స్


తీన్‌మార్–15, హరివంశం–22
రివ్యూ–24, సురభి–35
జీవితమే ఒక ప్రతిఘటన–36
మనమీదేనట్రోయ్–51
ఆరోగ్యమే మహాభాగ్యం–52, క్రైమ్–54
పుస్తక సమీక్ష–67, సౌభాగ్యచక్రం–68
నవ్యసినిమా–69, ఆయన మాట జవదాటను–70
ఇవన్నీ నిజాలే!, పదగారడి–74


ముఖచిత్రం: తమన్నా
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ముగ్గురు మరాఠీలు

**బా**ర్‌కి వచ్చి రెండు బీర్లు తాగాడు రాముడు. బాగా తిన్నాడు. బ్రేవ్‌మని త్రేన్చి వెళ్ళబోతుంటే సర్వర్ వచ్చి అయిదువందల రూపాయలకు బిల్ ఇచ్చాడు. బిల్లేంటి మళ్ళీ తెచ్చావు. బిల్లు ఎప్పుడో కట్టేశాను కదా? అన్నాడు రాముడు. బిల్ కట్టేశారా? అయితే ఓకే! మీరు కట్టానంటే నేనేంవంటాను, వెళ్ళి రండి అన్నాడు సర్వర్. నవ్వుకుంటూ బయటపడ్డాడు రాముడు. బార్ పక్కగా నిల్చుని మాట్లాడుకుంటున్న భీముణ్ణి, సోముణ్ణి కలిశాడు. జరిగింది చెప్పాడు. కన్‌ఫ్యూజన్ కంటిన్యూ అవుతోంది. పర్వాలేదు అనుకున్నారు. బార్‌లోకి భీముడు ప్రవేశించాడు. అతను కూడా రెండుబీర్లు తాగి, బాగా తిని త్రేన్చాడు. వెళ్ళబోతుంటే బిల్ కట్టండి సార్ అనడిగాడు సర్వర్. ఎన్నిసార్లు కట్టాలి? ఎప్పుడో కట్టేశాను, చూస్కో అని విసవిసా వెళ్ళిపోయాడు. సోముడు వచ్చాడిప్పుడు. ఎంచక్కా విస్కీ అయిదుపెగ్గులు తాగాడు. కడుపు నిండా కాజూబిర్యానీ తిన్నాడు. లేచి వెళ్ళబోయాడు. అంతలో వచ్చాడక్కడికి సర్వర్. చెప్పాడిలా.

ఇంతకు ముందు ఇద్దరు వచ్చి, బీర్లు తాగి, బిల్ చెల్లించానని అబద్ధం ఆడి వెళ్ళారు. ముగ్గురు మరాఠీలు వాళ్ళు. మూడోవాడు రావాలి. వస్తే ఉంటుందీ, పిచ్చ పిచ్చగా కొట్టి పంపిస్తాను.

నువ్వు వాణ్ణి కొట్టి పంపిస్తావో, తిట్టి పంపిస్తావో నాకు అనవసరం. నేను ఇందాక నీకు రెండు వేలరూపాయలనోటిచ్చాను. బిల్ ఏడువందలుపోను, నాకు పదమూడువందలు రావాలి. ఇస్తే నా మానాన నేను పోతాను అన్నాడు సోముడు కోపంగా.

### ఫోన్

**షా**పుకి వచ్చిన ఓ వ్యక్తి సెల్‌ఫోన్ మరచిపోయి, వెళ్ళిపోయాడు. అది గమనించి ఫోన్ జాగ్రత్త చేశాడు ఓనర్. మరచిపోయిన ఫోన్‌కోసం ఆ వ్యక్తి షాప్‌కి వస్తాడని చూసి చూసి ఇక రాడని నిర్ధారించుకున్నాక, ఫోన్ ఆన్ చేసి నెంబర్లు వెదికాడు ఓనర్. వ్యక్తి తల్లి నెంబర్ 'మామ్' అంటూ దొరికింది. ఆ నెంబర్‌కి ఫోన్ చేశాడు ఓనర్. అబ్బాయి ఫోన్ మరచిపోయిన విషయం చెప్పాడామెకు. మీరేం కంగారు పడకండి! నే చెప్తా వాడికి అన్నది తల్లి. సరేనని ఫోన్ పెట్టేశాడు ఓనర్. కాసేపటికి ఫోన్ రింగైంది. ఆనందంగా ఫోన్ రిసీవ్ చేసుకున్నాడు ఓనర్.

ప్రదీప్! నువ్వూ నీ మతిమరపు, నీతో చస్తున్నాననుకో! నీ ఫోన్‌ని నువ్వు షాపులో వదిలేశావట! వెళ్ళి తెచ్చుకో అరిచి చెబుతోంది తల్లి. ఓనర్‌కి నోట మాట లేకుండాపోయింది.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 10
10-5-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# మనుషులింతే!

జానకమ్మ అంటే గౌతమికి పడదు. పద్దెనిమిదేళ్ళ గౌతమికి అరవై ఏళ్ళు పైబడిన జానకమ్మంటే చిరాకు, కోపం, అసహ్యం. అగ్రహారంలో పెద్దలంతా జానకమ్మను దేవతగా చూస్తే, గౌతమి ఈడువారంతా ఆమెను దయ్యంలా చూస్తారు. అగ్రహారానికి పట్టిన చీడని అంటారు. పచ్చగా పసుపురాసుకుని, నుదుట రూపాయి అంత బొట్టుపెట్టుకుని, అడ్డకచ్చలో అగ్రహారంలోనే కాదు, నది గట్టున, గుళ్లో, గుడితోటలో పదేపదే కనిపించే జానకమ్మంటే గౌతమిలాంటి వారికి కాలిపోతూ ఉంటుంది. పద్దెనిమిదేళ్ళ అగ్రహారం పడుచులు పరుగెత్తకూడదు. పగలబడి నవ్వకూడదు. ఒంటరిగా తిరగకూడదు. నదిగట్టునకాని, గుడితోటలోకాని సాయంత్రాలు కనిపించకూడదు. అలాగే జూనియర్‌కాలేజీ చదువు ముగిసిన తర్వాత సైకిల్ తొక్కకూడదు. అన్నీ ఆంక్షలే! ఈ ఆంక్షలన్నీ జానకమ్మవే! వాటిని అగ్రహారం పెద్దలు అమలు చెయ్యాలి. చెయ్యలేదో జానకమ్మ వాళ్ళని నిలదీస్తుంది. వాళ్ళతో తగవులాడుతుంది.

జానకమ్మకు పెళ్ళయింది. భర్త లేడు. లేడంటే...చనిపోలేదు. పారిపోయాడు. పెళ్ళయిన కొత్తలోనే కాశీకి పారిపోయాడు. ఇన్నేళ్ళయినా తిరిగి రాలేదు. వస్తాడంటుంది జానకమ్మ. అతనికోసం ఎదురు చూస్తూ ఉంటుంది. ఆ ఎదురుచూపులోని అమాయకత్వాన్ని గ్రహించే అగ్రహారం ఆమెను ఆడపడుచును చేసుకుంది. పండగకీ, పబ్బానికీ ఆమెను అక్కున చేర్చుకుంది. ముత్తయిదుతనాన్నిచ్చి మురిసిపోయింది. అగ్రహారంలో ఆడపిల్ల పెళ్ళి అంటే హడావుడి అంతా జానకమ్మదే! పసుపుకుంకుమలు కొనడం దగ్గర నుంచి అమ్మాయిని అత్తారింటికి పంపే వరకూ బాధ్యతంతా ఆమెదే! శోభనంరాత్రి ఆ గది అలంకరణ, అక్కడి పందిరిమంచం ముస్తాబు సహా పెళ్ళికూతురికి చెప్పే జాగ్రతలన్నీ జానకమ్మే చెప్పాలి. అది అగ్రహారం ఆచారం.

గౌతమికి పెళ్ళి అయింది. ఆరోజు శోభనం. గదిలో మంచాన్ని ముస్తాబు చేసింది జానకమ్మ. గౌతమిని కూడా బంగారుబొమ్మను చేసింది. చేసి, నీతో కొంచెం మాట్లాడాలి రా అంటూ పెరట్లోనికి తీసుకొచ్చింది. బాదంచెట్టు నీడలో కూర్చోబెట్టింది. కాలిపోతోంది గౌతమికి. అన్నిటా ఈ మహాతల్లి పెత్తనం ఏమిటి? అని మండిపోతోంది. అయినా తమాయించుకుంది. నీకు కొన్ని విషయాలు చెబుతాను, జాగ్రత్తగా విను. వాటిని ఆచరించు! ఆచరించావనుకో! జీవితాంతం హాయిగా ఉంటుంది. కష్టాలూ, కన్నీళ్ళూ ఉండవు అంది జానకమ్మ. చెప్పిందిలా.



పెళ్ళికి ముందు భర్త అలా ఉండాలి ఇలా ఉండాలి అని ఆశపడతారు. ఆ ఆశ నిరాశయితే సర్దుకుపోరు సరికదా, గొడవలు పడతారు. అలా గొడవలు పడడం మంచిదికాదు. ఆ పరిస్థితి రాకుండా ఉండాలంటే... భర్తను అర్థం చేసుకోవాలి. అలాగే భర్తని ఓ స్నేహితునిగా చూడాలి. ఆ స్నేహం ఎదగడానికి కావాల్సిన జాగ్రత్తలన్నీ తీసుకోవాలి. ఒకరి అభిరుచులు ఒకరు తెలుసుకోవాలి. ఒకరిని ఒకరు పూర్తిగా నమ్మాలి. అర్థం చేసుకోవాలి. గౌరవించుకోవాలి. అటు ఇటు రెండు కుటుంబాలనూ ఒకేలా ఆదరించాలి. కుటుంబపెద్దలను గౌరవించాలి. పెళ్ళికి ముందు ఎలా ఉన్నావో పెళ్ళి తర్వాత కూడా అలాగే ఉండాలి. పెళ్ళి కాగానే నీ ఆలోచనలూ, సరదాలూ మార్చుకోనక్కరలేదు. నీ స్నేహితులతో మాట్లాడుకో! భర్తకోసమే కాదు, నీకోసం కూడా నువ్వు కొంత సమయాన్ని కేటాయించుకో! కావాల్సిన లక్షణాలన్నీ పోతపోసిన భర్త దొరకడం సాధ్యం కాదు. లోపాలు లేని వాళ్ళు ఉండరు. తప్పులు అందరూ చేస్తారు. భర్త నిన్ను బాధపెట్టాడనుకో! ఆ బాధ తీరడానికి బంధువుల ముందూ, స్నేహితుల ముందూ అతన్ని నిలదియ్యకు. ఏకాంతంగా ఉన్నప్పుడు చేసిన తప్పు చెప్పి, అతన్ని సరిదిద్దు. అవసరం అనుకుంటే కొంచెం గట్టిగా మాట్లాడు. ప్రమాదం లేదు. ఇవన్నీ ఏకాంతంలోనే జరగాలి. పదిమందిలో మాత్రం అతన్ని పొగడడమే మంచిది. ప్రేమ బంధాన్ని పెంచుతుంది. ప్రేమించడం మానుకోకు. చిన్నచిన్న కానుకలు ఇచ్చిపుచ్చుకోవాలి. కలసి ఎక్కువసేపు గడపాలి. పని ఒత్తిడి ఎంత ఉన్నా తీరిక చేసుకుని మాట్లాడాలి. మాటలే ముద్దుల మూటలు అంది జానకమ్మ. గౌతమి నుదుటన ముద్దుపెట్టింది. వెళ్ళి రా అంది. వెళ్ళలేదు గౌతమి. జానకమ్మను గట్టిగా కౌగలించుకుని ఏడుస్తూ నిల్చుంది. క్షమించమంది. ఎందుకు? ఇన్నాళ్ళూ గౌతమికి జానకమ్మ అర్థం కాలేదు. అలాగే జానకమ్మకి ఇప్పుడు గౌతమి అర్థం కావడం లేదు. మనుషులింతే! అభిమానాలూ, అపార్థాలే జీవితాలని తెలుసుకోరు.

నవ్య



## వీఆర్ సైకిల్

ఫిట్‌నెస్ కోసమో, బరువు తగ్గటానికో రోజూ సైక్లింగ్ చేస్తుంటారు కొంతమంది. రోడ్లమీద సైక్లింగ్ చేయలేనివారు జిమ్ బాట పడుతుంటారు. ఇంట్లోనే చేస్తుంటారు. అయితే ఎన్నిరోజులు? నెలా రెండు నెలలు గడవగానే బద్ధకం వల్లనో, బోర్ ఫీలవ్వడం వల్లనో, మరేకారణం వల్లనైతేనేమి సైకిల్ పక్కన పెట్టేస్తారు. ఇక ఆ ఇబ్బంది అవసరం లేదు అంటున్నారు సూరజ్, జిగ్నేశ్. ఇంట్లో కూర్చునే సరదాగా కొండల్లో, బీచ్‌లో ఇసుకతిన్నెల మీద హాయిగా సైక్లింగ్ చేయచ్చునంటున్నారు. ఇది ఎలా సాధ్యం? అని అడిగితే వర్చువల్ రియాలిటీతో ఇప్పుడు ఏదయినా సాధ్యమే అని నవ్వుతూ సమాధానమిస్తున్నారు.




హైదరాబాద్‌కి చెందిన సూరజ్, జిగ్నేశ్ కంపెనీ పేరు లూప్ రియాలిటీ! వీరిద్దరూ కలిసి ఈ వర్చువల్ రియాలిటీ(వీఆర్) సైకిల్ తయారు చేశారు. సైకిల్ ఒక చోట ఫిక్స్ చేసి ఉంటుంది. వెనక చక్రానికి లూప్ రియాలిటీ కిట్ అమర్చి, ఆ చక్రం కదలికలను కంప్యూటర్‌కి అనుసంధాని స్తారు. సైకిల్ మీద కూర్చుని వీఆర్ హెడ్‌సెట్ పెట్టుకుంటే వర్చువల్ ప్రపంచంలోకి వెళ్లి పోవచ్చు. ఇందులో రకరకాల మోడ్స్ క్రియేట్ చేసి ఉంటాయి. ఎత్తయిన కొండలు, బీచులు, సిటీ రోడ్లు, రేసింగ్ ట్రాకులు.. ఇలా కావాల్సిన లోకేషన్ ఎంపిక చేసుకోవచ్చు. సైకిల్ తొక్కుతున్నప్పుడు అచ్చం అదే లోకేషన్‌లో విహరిస్తున్నట్టు ఉంటుంది. సైకిల్ కదలికలను బట్టి రియల్ టైంలో ప్రయాణించిన అనుభూతి కలుగుతుంది. వీఆర్ సైకిల్ వెనక చక్రానికి అమర్చిన సిస్టమ్‌కు సెన్సర్లు ఉంటాయి. అవి మనిషి కదలికలను గుర్తిస్తాయి. కొండలు ఎక్కుతున్నప్పుడు సైకిల్ కుదుపులకు గురైన ఫీలింగ్ కలుగుతుంది. ఇందుకోసం హై ఎండ్ గ్రాఫిక్స్ ఉపయోగించారు. వీఆర్ సైకిల్‌తో గ్రూప్ రేసింగ్స్ కండక్ట్ చేసుకోవచ్చు. ఫిట్‌నెస్ కాపాడుకోవచ్చు. రోజుకు ఎన్ని క్యాలరీలు బర్న్ చేయాలి, ఈ రోజు ఎన్ని క్యాలరీలు కరిగించారు వంటి సమాచారమంతా కంప్యూటరే అందిస్తుంది. ఒకవేళ సైకిల్ తొక్కీ తొక్కీ మీరు డీ హైడ్రేట్ అయిపోతే ఆట ఆటోమేటిగ్గా ఆగిపోతుంది. మీరు వాటర్ తాగిన తర్వాతే మళ్లీ గేమ్ మొదలవుతుంది. ఇన్ని ఉపయోగాలున్న వీఆర్ సైకిల్‌ని మనం కూడా ఉపయోగిస్తే...? అనిపిస్తోంది కదూ!



# మెయిల్ బాక్స్

### పుస్తకం సమస్త నేస్తం

పుస్తకం సమస్త నేస్తం ఆర్టికల్ ఎంతో బాగుంది. ఒంటరితనానికీ, స్నేహానికీ చెలిమిలా పని చేస్తుంది పుస్తకం. ఏ వాదులకైనా కల్పవృక్షం పుస్తకమే. సినీవాలి సీరియల్ బాగుంది. కూపన్‌లేని సీరియల్ ఏదో వెలితిగా ఉన్నట్టనిపించింది.

—వాస్తు రామచంద్ర, నెల్లూరు

### సరికొత్తదనం

అనుష్క ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది. శ్రీ సీతారాముల కల్యాణం చూతమురారండి అనే ప్రత్యేక వ్యాసం చాలా బాగుంది. వారం వారం సరికొత్త దనంతో నవ్య వెలువడుతున్నందుకు చాలా సంతోషం.

—ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### కాంగ్రెస్‌పై చక్కటి విశ్లేషణ

రివ్యూలో కాంగ్రెస్ గురించి చక్కగా విశ్లేషించారు. నిజానికి రాహుల్ కంటే ముందు మారాల్సింది సలహాదారులు. ఈ సలహాదారులంతా నకారాత్మకంగా ఆలోచిస్తూ ప్రతిచిన్న విషయాన్నీ రచ్చచేసి పార్లమెంటులో అసలు చర్చలే జరగకుండా అడ్డుకుని ప్రజల్లో అసహ్యం కలిగించారు. ఇకనైనా బాధ్యతాయుతంగా ప్రవర్తించి చర్చలు జరగనిస్తే కాంగ్రెస్ బాగుపడుతుంది. ప్రజలకు కాంగ్రెస్‌పై విశ్వాసం కలుగుతుంది. మాధవన్ కోలీవుడ్ రాజకీయాల్లోనే చెల్లని రూపాయి. ఇక ఆంధ్రాలో ఏం చెల్లుతాడు?

—కె.ఎల్.ప్రసన్న, పేరాజుపేట

### శ్రీరాముని ఫొటో

అశాశ్వతమైన ఈ లోకంలో బతికివున్నంతవరకు జ్ఞాపకాలే తోడునీడ. ఒంటరి తండ్రిని చూసేందుకు అమెరికా నుండి రాని కొడుకు ఛాయాచిత్రం కంటే సర్వాంతర్యామి అయిన శ్రీరాముని ఫొటో చూసుకోవడమే మొదటిపేజీలో తండ్రికి తృప్తినిచ్చిందన్న అంశం మనస్సును ఒకింత నలిపేసినా, ఈ లోకంలో తరచు సంభవించే సంఘటనే. మార్నింగ్ కాఫీలోని అంశాలు చలాకీగా ఉండి చక్కని కాలక్షేపం ఇచ్చాయి. పరుగులెత్తే ప్రపంచంలో ఒత్తిడి సహజం. మనస్సును ఉత్సాహభరితంగాఉంచుకోవడం శ్రేయస్కరం. మెరుపులు మరకలు కథా కథనం చక్కగా సాగింది. బాల లీల సరదా కథ సరదాగా సాగింది. చివరి చిరునవ్వు కవితను రామఫణి రసరమ్యంగా మలిచారు.

—డాక్టర్ శివభూషణం, కర్నూలు

### ఆసాంతం ఆకట్టుకున్న కథ 'వెన్నెలతోవ'

'వెన్నెలతోవ'లో కథ మానవత్వం పరిమళించింది. దయకు ప్రతిరూపంగా ఒక బాలుడు ఒంటరిగా కటిక చీకట్లో, ప్రమాదంలో గాయపడిన వారిని కొండంత ధైర్యంతో పాలచుక్కలతో రక్షించిన వైనం ఉత్కంఠ భరితం. గోపి సాహసం మరువరానిది. కథనం ఆసాంతం ఆకట్టుకుంది. విభిన్న కథాంశంతో 'గోమాత స్వగతంతో సాగిన కథనం రంజింపజేసింది. సరదాకథ బాల లీల బాగుంది. నామధేయాలు నవ్వించాయి. సోకోర్వావాడె మనుజుడు కథ ఆలోచింపజేసింది. యువతుల లైంగిక దోపిడీ ఇతివృత్తంతో రాసిన 'మెరుపులు మరకలు' కథ ఆసాంతం బాగుంది.

రోబో–2 కోసం శాకాహారిగా మారిన అమీ జాక్సన్, లైంగిక వేధింపులు భరించానన్న అదితీరావు హైదరీ ఇంటర్వ్యూలు ఆసక్తిదాయకం. తీన్‌మార్, సరదా బాగున్నాయి. మార్నింగ్‌కాఫీ స్కిట్లు తెగ నవ్వించాయి. హరివంశంలో దేవదానవుల యుద్ధం ఉధృతి గగుర్పాటు కలిగించింది. రివ్యూలో కాంగ్రెస్ లోటుపాట్లు తెలిశాయి. సురభి వింతలు, ఒత్తిడిని తరిమేద్దాం, పుస్తక సమీక్ష ఆసక్తిదాయకం. అమ్మల పారితోషికాలు తెలిశాయి. బాలీవుడ్ గుట్టు రట్టు చేసిన ప్రదీప్‌రావత్ ఇంటర్వ్యూ వల్ల చాలా విషయాలు తెలిశాయి. ఇవన్నీ నిజాలే శీర్షిక ద్వారా పురాతన విజ్ఞాన విషయాలు తెలుస్తున్నాయి.

—కృష్ణ మాధవరపు, కాకినాడ

### చివరకు దేవుడే దిక్కు

నిరాశ, నిర్లిప్తత నిస్పృహలతో నిండిన వ్యక్తికి ప్రయాణంలో దొరికిన పర్సుపట్ల ఆశ, వ్యామోహం లేకపోవడం అతనిలోని నిజాయితీ, చిత్తశుద్ధికి నిదర్శనం. అలాగే మనీపర్సు యజమాని చెప్పిన అనుభవాలు మనసును కదిలిస్తూ కుదిపేస్తాయి. **మొదటి పేజీ** అతనికి మిగిలిన ఒంటరితనం ఎవరో వస్తారని, ఏదో చేస్తారని, ఆదుకుంటారని ఎదురుచూడటంలో కలిగిన నిరాశలో కళ్ళుచెమరింపుని మిగులుస్తుంది. ఆలోచిస్తే ఈ ప్రేమలు, బంధాలు, అనుబంధాలు, ఆప్యాయతలు, ఆత్మీయతలు, భవబంధాలు ఏదో నాటికి పలుచబడిపోతాయనిపిస్తుంది. క్రమంగా జీవితం ముగింపుదశకు చేరుకునేనాటికి దేవుడే గుర్తుకువస్తాడు. అందుకే ప్రారంభం నుండీ దేవుడి పట్ల నమ్మకం, భక్తి ఉండేవారికి ప్రతిరోజూ ఆనందంగా, హాయిగా ఉండేలాగా అదృశ్యశక్తిరూపంలో దోహదపడుతుందనడానికి నేడు చాలామందిలో కలుగుతున్న ధార్మికచింతన, భక్తిభావన, ఆధ్యాత్మిక దృష్టి కారణం. ఇది అక్షర సత్యం. మనగురించి ఎవరూ ఆలోచించరు. పట్టించుకోరు. బాధపడరు. ఈ లేనిపోని భ్రమలు, మమకారాలు, ఆలోచనలు వృధాయేమరి! దేవుణ్ణి నమ్ముకో, సేవించుకో. ఆయనే నిన్నుక్షణం క్షణం కాపాడతాడు అనే సత్యాన్ని గ్రహించవచ్చు. కంటిచెమరింపు సాక్షిగా 'ఎవరికి ఎవరు? చివరికి ఎవరు?' మొదటిపేజీ చక్కని సందేశాత్మకమైన కథ.

—భమిడి వెంకటేశ్వర్లు, హైదరాబాద్

## పట్టణాన్ని బాగుచేశాడు!

ఇప్పుడు ఎంతోమంది సెలబ్రిటీలు వారికి తోచిన గ్రామాల్ని దత్తత తీసుకుని, డబ్బులిచ్చి మరీ బాగుచేస్తున్నారు. కానీ ఓ వ్యాపారవేత్త మాత్రం తన పట్టణంలో ఉన్న ప్రజలకు రూపాయి విరాళం ఇవ్వకుండానే వారి జీవితాల్ని మార్చాడు. పైసా ఇవ్వకుండా ఎలా మార్చేశాడనుకుంటున్నారా? చదవండి మరి.

కాసే అనే పట్టణంలో బొలెన్ అనే వ్యాపారవేత్త ఉన్నాడు. అమెరికాలో సగభాగం చమురు ఉత్పత్తులు సరఫరా చేసే పైప్‌లైన్స్ నిర్వహణ బాధ్యత ఆయన సంస్థదే. ఒక్కడిగా మొదలై ఇప్పుడు వందలమంది ఉద్యోగులకు యజమాని అయ్యాడు. అయితే 2000 సంవత్సరంలో కాసే పట్టణంలో వ్యాపారాలు డీలా పడి స్థానిక ప్రజలు వ్యాపారాలు మూసివేయడం మొదలుపెట్టారు. ఆ పరిస్థితి చూసి చలించిన బొలిన్ వారికి ఏదైనా చేయాలని, వారిని సంతోషంగా ఉంచాలని నిర్ణయించుకున్నాడు. అందుకోసం పర్యాటకమే సరైనదని అనుకుని, బాగా ఆలోచించి భారీ వైండ్ చిమ్(గాలికి చప్పుడు చేసే పైపులు) నిర్మాణం మొదలుపెట్టి 2011లో పూర్తి చేశాడు. ఆ తర్వాత తన వద్ద పనిచేసే కళాకారుల సాయంతో ఇనుము, కలప వంటి ముడిసరుకులను ఉపయోగించి ఇంట్లో ఉండే సాధారణ వస్తువుల్ని అసాధారణ పరిమాణంలో భారీగా నిర్మించి వీధుల్లో అమర్చాడు. దీంతో చిన్న వస్తువులు భారీ రూపంలో మారడంతో గిన్నిస్‌బుక్‌లో చోటు సంపాదించాయి. అలా కాసే పట్టణం పర్యాటకుల్ని విశేషంగా ఆకట్టుకుంది. ఆ పట్టణాన్ని చూసేందుకు పర్యాటకులు పెద్ద సంఖ్యలో వస్తుండటంతో పట్టణంలో వ్యాపారాలు జోరు అందుకున్నాయి. స్థానిక ప్రజలంతా ఆర్థికంగా నిలదొక్కుకున్నారు. అలా స్వయంకృషితో ఎదిగిన బొలిన్ కేవలం తన పట్టణాన్ని ఆకర్షణీయంగా మార్చి స్థానిక ప్రజల్ని స్వయంకృషితో ఎదిగేలా చేశాడు.



# కాగితాలతో కళాకృతులు





**చిన్నప్పుడు కాగితాల పడవలతో ఆడుకున్నది గుర్తుంది కదూ..కాస్త పెద్దయ్యాక అదే కాగితాలతో విమానాలు చేసి గాలిలో గింగిరాలు కొట్టిస్తూ ఎంజాయ్ చేసుంటారు. ఇంకా కాలేజీ వయసు వచ్చాక కాగితం రాకెట్లు తయారు చేసి అమ్మాయి జడకుచ్చుల్లోకి గురి చూసి కొట్టడం... ఇంట్లో ఫంక్షన్లు, పార్టీలు చేసుకున్నప్పుడు కాగితాలతో డెకరేషన్ చేయడం...ఇలా ఎన్నో కాగితంతో ఎన్నో చేస్తుంటాం. అయితే ఇప్పుడవన్నీ మరుగున పడ్డాయి. స్మార్ట్ యుగం వచ్చేసరికి కాగితాల సంగతే మరిచి ఫోన్లు, కంప్యూటర్లే లోకం అయ్యాయి.**

కానీ ఆ కాగితాలతోనే ఆశ్చర్యపోయే అతిలోక కళా సౌందర్యం సృష్టించవచ్చునని నిరూపిస్తోంది ఈ చిన్నది. చిత్తుకాగితం ఆమె చేయి తగిలితే చిత్తరువుగా మారుతుంది. జీవం ఉట్టిపడే శిల్పమవుతుంది. ఆమె ఆశయానికి ప్రతిరూపకంగా నిలుస్తుంది. వెలకట్టలేని కళారూపం అవుతుంది. మనసు పెట్టి ఆలోచించాలే కానీ ఏదీ వృథాగా పోదు అని అనిపిస్తుంది ఆమె తయారు చేసిన ఆ కళాఖండాలను చూస్తే. ఆశ్చర్యపోయే ఆ కళాకృతుల గురించి మీరూ తెలుసుకోండి!

## ఓరిగామి కళాకృతులు

ఆ అమ్మాయి పేరు చీ హితోత్సుమాయా. పుట్టింది జపాన్‌లోని షిజివోకా అనే ఊర్లో. చిన్నప్పటి నుండీ కళలపై ఉన్న మక్కువతో టోక్యోలోని పాలిటెక్నిక్ యూనివర్సిటీ నుంచి డిపార్ట్‌మెంట్ ఆఫ్ డిజైన్‌లో గ్రాడ్యుయేషన్ పట్టా పొందింది. ఆ తర్వాత ఓరిగామి కళపై మక్కువతో ఆ కళను మరింత ముందుకు తీసుకెళ్ళేందుకు తనకున్న నైపుణ్యంతో ఇంకా దానిని ఎలా తీర్చిదిద్దవచ్చో ఆలోచించింది. చివరికి వాటి ద్వారా రకరకాల కళాకృతులు తయారు చేయడం నేర్చుకుంది. ఇంతకీ ఓరిగామి అంటే ఏంటి అనుకుంటున్నారా? ఒక కాగితం ముక్కను ఉపయోగించి రకరకాల కళాకృతులు తయారు చేయడమే ఓరిగామి. ఈ ఓరిగామి అనే కళ జపాన్ జానపద కళగా చెప్పుకోవచ్చు. దీన్ని ఇంతకుముందు ఓరికామి అని పిలిచేవారు. జపాన్ భాషలో 'ఒరి' అంటే మడత పెట్టడం, 'కామి' అంటే కాగితం అని అర్థం. అంటే కాగితాన్ని మడతపెట్టడమన్నమాట. కాలక్రమేణా ఓరికామి అనే పదం కాస్తా ఓరిగామిగా మారిపోయింది. అలాంటి ఆ ప్రాచీన కళకు ఆధునిక రూపాన్ని ఇస్తోంది హితోత్సుమాయా.

## కాగితంపై మక్కువ!

హితోత్సుమాయా తాతగారికి కాగితాలు తయారుచేసే పరిశ్రమ ఉండేది. అందులో పాత పడిన కాగితాలను రీసైక్లింగ్ విధానం ద్వారా పునరుత్పత్తి చేసేవారు. లాభదాయకంగా లేకపోవడంతో క్రమంగా ఆ పరిశ్రమ మూతబడింది. చిన్నప్పటి నుండీ ఆ ఫ్యాక్టరీని చూస్తున్న హితోత్సుమాయాకి కాగితం మీద ఎంతో ఆసక్తి ఉండేదట. అందు కోసమే ఓరిగామి కళపై దృష్టి పెట్టింది. ఇప్పుడు ఈ కాగితంతో చేస్తున్న ఆకృతులన్నీ కూడా ఒకప్పుడు ఆ కాగితాలను చూసి స్ఫూర్తిపొంది తయారు చేసినవే అంటోంది ఆమె. అలా వివిధ రకాల ఆకృతులు తయారు చేయడానికి హితోత్సుమాయా మరొక క్రియేటివ్ డైరెక్టర్ తొమిజీతామయితో కలిసి షిజికోవాస్ ఫుజీ అనే సిటీలో ఓ స్టూడియో ప్రారంభించింది. ఆ స్టూడియో ఒకప్పుడు ఆ అమ్మాయి తాతగారి కాగితం తయారీ పరిశ్రమకు చెందినదే. మూతపడిన ఆ పరిశ్రమనే హితోత్సుమాయా ఇప్పుడు







# రికార్డు సృష్టించిన ఏనుగు బొమ్మలు!

ఒకటి కాదు రెండు కాదు వేలాది ఏనుగులు... ఒకే చోట చేరాయి! రంగు రంగులతో కనువిందు చేయడమేకాదు, ఆ ఏనుగుల ఆకృతి రికార్డు సృష్టిస్తే..? అబ్బో ఇంతకీ ఏమిటి దాని ప్రత్యేకత అనుకుంటున్నారా? ఓరిగామి కళను ఉపయోగించి రకరకాల ఆకారాల్లో ప్రపంచవ్యాప్తంగా వేలాదిమంది కాగి



తాలతో ఏనుగు బొమ్మలు చేశారు. వాటన్నింటిని ఒక చోట చేర్చారు. అమెరికా మన్‌హట్టన్‌లోని బ్రోంక్స్ జంతుప్రదర్శనశాలలో మొత్తం 78,564 బొమ్మ ఏనుగులు తయారు చేశారు. రంగురంగుల్లో చూడముచ్చటగా ఉన్న ఈ ఓరిగామి కాగితం ఏనుగుల ఆకృతులను చూసి గిన్నిస్ రికార్డు

స్టూడియోగా తీర్చిదిద్దింది.

### అన్నీ జంతువులే!

కాగితంతో తీర్చిదిద్దే బొమ్మలన్నీ జంతువులకు సంబంధించినవే. హితోత్సుమాయాకి జంతువులు అంటే చాలా ఇష్టమట. ప్రకృతిలో అవి చేసే ప్రతి పని చాలా ఆసక్తిగా ఉంటుందని చెబుతుంది. అందుకే జంతువులు పడుకునే భంగిమల దగ్గర నుంచి అవి లేచి నిలబడడం, తినడం లాంటి దినచర్యలకు సంబంధించిన భంగిమల వరకు ఎన్నో భంగిమలను కాగితం ఆకృతుల్లో తీర్చిదిద్దుతుంది. ప్రత్యేకించి దక్షిణ కాలిఫోర్నియాకి సంబంధించిన జంతువుల రూపకల్పనపై గత నాలుగు సంవత్సరాలలో హితోత్సుమాయా తనటీమ్‌తో కలిసి ఎన్నో రకాల ఆకృతులు తీర్చిదిద్దింది.

### ఎలా తయారు చేస్తారంటే?

వీటిని తయారు చేయడానికి పాత పేపర్లు మాత్రమే వాడతారు. ఆ పేపర్లు ఇక దేనికీపనికి రావని తెలిశాక మాత్రమే వాటిని చించుతారు. ముందుగా ఏ ఆకృతి తయారు చేయాలనుకుంటున్నారో దానికి సంబంధించిన డిజైన్‌ను దగ్గర

వాళ్లు 'అతి పెద్ద ఓరిగామి ఏనుగుల ప్రదర్శన'గా దీనిని గిన్నిస్ బుక్‌లో రికార్డ్ చేశారు.

ఈ ప్రదర్శనను ఏదో సరదాకి ఏర్పాటు చేయలేదండీ దీని వెనుక ఓ మంచి కారణం ఉంది. ఫారెస్టు దొంగలు ఏనుగుదంతాల కోసం రోజుకు 96 ఏనుగుల్ని వేటాడుతున్నారట. దీంతో ఏడాదికి దాదాపు 35 వేల ఏనుగులు చనిపోతున్నాయిట. తగ్గిపోతున్న ఏనుగుల సంఖ్య పెంచాలనీ, వాటి సంరక్షణ బాధ్యతపై అందరికీ అవగాహన కల్పించాలనీ ఈ ప్రచార కార్యక్రమం నిర్వహించారు. దీని కోసం 'వన్యప్రాణి సంరక్షణ సొసైటీ' '96 ఏనుగుల ప్రచారం' అనే పేరుతో ఈ ప్రదర్శన చేసింది.

రకరకాల పరిమాణాల్లో, పెట్టుకుంటారు. అందుకు ఎన్ని పేపర్లు అవసరం అవుతాయో లిస్ట్ రాసుకుని, వాటన్నింటిని ఒక దగ్గర చేర్చిపెట్టుకుంటారు. తర్వాత పేపర్‌ను గమ్ సహాయంతో ఫోల్డింగ్ చేసి వాటిని రోల్ చేస్తారు. ఆ తర్వాత అనుకున్న ఆకృతిలో డిజైన్‌లా అమర్చుతారు. డిజైన్లకోసం కొన్నిసార్లు బ్లాక్ అండ్ వైట్ పేపర్లు వాడితే మరికొన్నిసార్లు కలర్‌ప్రింటెడ్ పేపర్లు ఉపయోగిస్తారు. ఇందులో ఎలాంటి మిషన్లను ఉపయోగించకుండా ఆ జంతువు మొత్తం ఆకృతిని కేవలం చేత్తోనే తీర్చిదిద్దుతారు. ఒక్కొక్క బొమ్మ తయారు చేయడానికి కొన్ని గంటలు సమయం తీసుకుంటే మరికొన్ని ఆకృతుల తయారీకి కొన్ని రోజులు, నెలల సమయం కూడా తీసుకున్న సందర్భాలున్నాయట. ఐతే, ఈ ఆకృతులన్నీ తయారు చేయడానికి కావలిసిన పేపర్ వీరికి ఎలా వస్తుందనేగా మీ సందేహం? లాస్‌ఏంజెల్స్ టైమ్స్ అనే పత్రిక ఇప్పటివరకు వీరి అవసరాలకోసం 1000 పౌండ్ల న్యూస్‌పేపర్‌ను సరఫరా చేసిందట. ఇంతకుముందు ఇదే ఆఫీసులో పాత పేపర్లను రీసైక్లింగ్ చేసి కొత్తవాటిలా తయారు చేసేవారు. ఇప్పుడు అదే పాత పేపర్లకు కొత్త అందాలు తీర్చిదిద్ది తయారు చేస్తున్నాం అంటోంది హితోత్సు మాయా కి.

ఆకట్టుకునే రంగుల్లో తీర్చిదిద్దిన ఈ ఏనుగు కళాకృతుల్ని ఎవరు తయారుచేశారో తెలుసా? వందలాది స్కూళ్ల విద్యార్థులు, కొంతమంది కళాకారులు.

అమెరికాలో 50 రాష్ట్రాలతో పాటు 40 దేశాల నుంచి వీరంతా పాల్గొన్నారు. ఇందులో ఇరాన్, ఈజిప్టు, కజకిస్థాన్ దేశాల దివ్యాంగుల పాఠశాలల విద్యార్థులూ ఉన్నారు. 2014లో కూడా ఓసారి బ్రిటన్‌లో ఏర్పాటు చేసిన ఓరిగామి ఏనుగుల ప్రదర్శన గిన్నిస్ రికార్డులో నమోదైంది. ఈ ప్రదర్శనలో 33,764 ఏనుగు బొమ్మల్ని తయారుచేసిపెట్టారు. ఇప్పుడా రికార్డును ఈ ప్రదర్శన బ్రేక్ చేసింది. ■





–సంతోషలక్ష్మి దహగాం



# హర్షయుతమవ్వ

సింహాప్రసాద్

**"హలో, ఆర్డర్ తీసుకోండి మేడమ్. వచ్చేనెల పదవ తారీఖున ఉదయం ఏడు గంటల నుండి రాత్రి తొమ్మిది గంటల దాకా అవసరం. ఇద్దరు మావయ్యలు, అత్తలు, ముగ్గురు బాబాయిలు చిన్నమ్మలు, అయిదుగురు కజిన్స్ భార్యలతో సహా, ఇంకా... ఓ ఇద్దరు తమ్ముళ్ళనీ మరదళ్ళనీ కూడా రాసుకోండి. తోడల్లుడూ ఉండాల్సిందే. లేకపోతే నా భార్య బాధ పడుతుంది. అంచేత ఒక తోడల్లుడూ, వదినగారూ, ఒక మరదలూ ఆమె మొగుణ్ణి కూడా కలపండి....."**

"కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్ళూ, అల్లుళ్ళూ వద్దా సార్?"

"వాళ్ళున్నార్లే... పోనీ ఓ పదిమంది మనవళ్ళనీ మనవరాళ్ళనీ పంపండి, సందడిగా ఉంటుంది."

"సందర్భం సంతోషమా విషాదమా సార్?"

"సంబరం, ఆ రోజున మా 40వ వివాహ వార్షికోత్సవం చేసుకోబోతున్నాం."

"ఓ గ్రేట్, మీకు ముందుగా మా 'అద్దెకు ఆప్తులు' సంస్థ తరఫున వివాహదిన శుభాకాంక్షలు. మీరు చెప్పిన వారంతా మీరు చెప్పిన సమయానికి మీ ఇంట్లో ఉంటారు. మీకు సేవ చేసే భాగ్యం మాకిచ్చినందుకు మీకు ధన్యవాదాలు తెలుపుతున్నాం. శుభదినము"

ఫోన్ పెట్టానో లేదో శ్రీమతి అంది "పండగ ఊరికే రాదు. బోలెడు పని పెడుతుంది. ఒకసారి ఇంటివంక చూడండి. గోడల రంగు వెలిసిపోయింది. వంటగది కప్పు అంతా మసిబారిపోయింది. కుళాయిల్లోంచి నీళ్ళు చుక్కలు చుక్కలుగా లీక్ అవుతున్నాయి."

"అర్థమైంది. ఇంటిని మేకోవర్ చెయ్యాలంటావ్. ఓకె. చేసేద్దాం!"

రిపేర్ అండ్ పెయింటింగ్ ఏజెన్సీకి ఫోన్‌చేసి వివరాలు చెప్పాను. ఎస్టిమేషన్‌కి టెక్నీషియన్ని పంపిస్తామన్నారు.

మరో గంటకి టక్ చేసుకుని టై కట్టుకున్న యువకుడు టక టక బూట్ల శబ్దం చేసుకుంటూ వచ్చాడు. అతడి భుజానికి ల్యాప్‌టాప్ బ్యాగ్ వేలాడుతోంది.

"మా ఇంటిని బయట్నుంచీ, లోపల్నుంచీ బాగా పరిశీలనగా చూడు. దీన్ని కొత్తదానిలా చేసెయ్యాలి. బాత్‌రూము సైతం అద్దంలా మెరిసిపోవాలి. ఎక్కడా లీకేజీలూ గీకేజీలూ ఉండకూడదు" అన్నాను.

"భోజనాలన్నీ బయటే ఏర్పాటుచేస్తాం గదా. వీళ్ళు పిచ్చి మొక్కలవీ పీకించి చక్కగా, సుందరంగా చేసేస్తారేమో కనుక్కోండి" అంది శ్రీమతి.

"అన్ని రకాల పనులూ చేస్తాం మేడమ్. గార్డెన్ ట్రిమ్ చేయిస్తాం. పూలమొక్కలు నాటిస్తాం. పచ్చగడ్డి పరిపిస్తాం. ఇంకేం కావాలన్నా చెప్పండి, చేసేస్తాం. పనిలో పనిగా హాలులో పెయింటింగ్స్ పెట్టి, కార్నర్ టేబుల్స్‌మీద పెద్ద పెద్ద బొమ్మలు, శిల్పాలు పెట్టి రిచ్‌గా..."

"అవొద్దులే గాని, మిగతా వాటికి ఎస్టిమేషన్ ఇవ్వు"

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోవద్దు సార్. ఇంత పెద్ద ఇంట్లో మీ ఇద్దరే ఉంటున్నారా?" అతడి గొంతు నిండా ఆశ్చర్యమే!

ముఖాముఖాలు చూసుకున్నాం. మొదటిసారి ఇంటిని వృథా చేస్తున్నామేమో అనిపించింది. "నువ్వు అడిగిన దాన్లో పాయింటు ఉంది. ఆలోచిస్తాం" అన్నాను.

అతడు అదోలా చూసి, ల్యాప్‌టాప్‌లో మునిగిపోయి, ఏవేవో లెక్కలేసి, ఒక అంకె చెప్పాడు.

"నాకు బేరమాడటం ఇష్టముండదు. సూటిగా అడుగుతున్నా. ఎంత డిస్కౌంట్ ఇస్తావ్?"

అవకాశం లేదంటూనే ఒక ఆఫర్ ఇచ్చాడు.

"డన్. వచ్చేనెల తొమ్మిదో తారీఖు సాయంత్రానికి అన్ని పనులూ అయిపోవాలి. ఇదిగో అడ్వాన్సు" చెక్కు రాసిచ్చాను.

అతను వెళ్ళిపోయాక "ఇక క్యాటరింగ్‌కి ఆర్డరివ్వాలోయ్" అన్నాను శ్రీమతితో.

"మొత్తం ఎంత మంది అవుతారని?"

"మొదట బంధుమిత్రులందరికీ ఇన్విటేషన్స్ పంపుతాను. ఎందరు వచ్చేదీ కన్ఫర్మ్ చేస్తూ రిప్లై ఇమ్మంటాను. దానిని బట్టి బుక్ చేద్దాం."

వెంటనే ఫేస్‌బుక్, వాట్సాప్, ట్విట్టర్ అన్నిటి ద్వారా ఆహ్వానాలు పంపేశాను.

అమెరికాలో ఉంటున్న మా పెద్దబ్బాయి ఫోన్ చేశాడు. "ఇప్పుడు అర్జంటుగా ధూందాంగా మ్యారేజ్ డే చేసుకోవడం అవసరమా?"

"అవసరమనే చేస్తున్నాం. మేం ఏం సంపాదించామో జనానికి తెలియాలిగా!"

"ఊరికే దుబారా చేసేస్తున్నారు. మీ పద్ధతేం బావోలేదు. ఎందుకైనా మంచిది, వీలునామా రాసెయ్యండి" గట్టిగా అన్నాడు.

"పాయింటే. బాగానే గుర్తు చేశావు. రాసేస్తాన్లే!"

"ఒక ప్లీడర్ని పంపిస్తాను, జాగ్రత్తగా రాసి రిజిస్టర్ చేయించండి. తర్వాత ప్రాబ్లమ్స్ రావు. రాసే ముందు నేను ఇంటికి పెద్ద కొడుకునని, పెద్ద పాలేరు లాంటి వాణ్ణని గుర్తు పెట్టుకుని కొంచెం అదనంగా ముట్టజెప్పండి"

"నువ్వు నాకు పాలేరుతనం ఎప్పుడు చేశావురా!"

"పోనీ, మీకు తలకొరివి పెడతానుగా, దాని గురించి ఎక్స్ట్రా ఇవ్వండి" విసుగ్గా అన్నాడు.

"నువ్వు పెట్టావో లేదో, అసలెవరైనా పెట్టారో లేదో నాకు తెలీదు కదరా!"

"మీకు చాదస్తం బాగా ముదిరింది. ఏదోఒకటనుకుని రాయండి. పెద్ద కొడుకుని. మిమ్మల్ని మొదటగా నాన్నా అని పిలిచింది నేనే. అది గుర్తు పెట్టుకోండి చాలు" ఫోన్ కట్ చేశాడు.

మరో పది నిమిషాలకి పెద్దమ్మాయి ఫోన్ చేసింది."ఇన్విటేషన్ డిజైన్ చాలా బాగుంది నాన్నా. మాకూ రావాలని ఉందిగానీ, ఆ



## నవ్యవీక్లి-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో విశేష బహుమతి రూ.5,000 పొందిన కథ

టైంలో టోర్నడో ఉందంటున్నారు. ఫ్లయిట్స్ క్యాన్సిల్ అవుతాయి."

"ఏం ఫర్లేదు తల్లీ. చాలామంది వస్తున్నార్లే!"

"వీలునామా రాస్తున్నావా నాన్నా. అన్నయ్య చెప్పాడు. అమ్మకి ఎంతో సాయంగా ఉండేదాన్నని ఎప్పుడూ అంటూ ఉంటావు కదా నాన్నా. అది గుర్తుంచుకో. నీకు అంతా సమానమే గాని నాక్కొంచెం ఎక్కువ ఫేవర్ చెయ్యి. పట్టుబట్టి మరీ నాకు నానమ్మ పేరు పెట్టావు!"

"చూద్దాంలే. ఇంకా ఏమీ అనుకోలేదు."

"ఇప్పుడనుకో నాన్నా. అన్నీ పేపర్‌మీద పెట్టేస్తే క్లియర్ కట్‌గా ఉంటుంది. రేపు రాద్ధాంతాలు రావు."

"నేను రాసినా రాయకపోయినా వచ్చేవి వస్తాయిలే తల్లీ, ఉంటాను."

లైన్ కట్ చేశానో లేదో చిన్నకూతురు నుంచి ఫోన్ వచ్చింది.

"మీకు పెళ్ళై నలభై ఏళ్ళయ్యాయా? నిజంగా గ్రేట్ డాడీ. అంటే దగ్గర దగ్గర డెబ్బై ఏళ్ళొచ్చాయా? నమ్మలేకపోతున్నాను!"

"నాకూ ఆశ్చర్యంగానే వుంది. వ్యాపారమూ, సంపాదనా, మీ చదువూ, పెంపకమూ, మీ పెళ్ళిళ్ళూ, మీకు రెక్కలు రావడమూ.... గబగబా జరిగిపోయాయి. పరుగు ఆపి చూస్తే, నేనూ నా ఎదురుగా మీ అమ్మ, మా ముందు ఖాళీగా ఉన్న ఇల్లూ మిగిలాయి! ఆ గొడవకేం గాని మీరొస్తున్నారా లేదా?"

"వెళ్దామనే పట్టుబట్టాను. ఇంతోటి దానికి పుణె నుంచి అంతదూరం వెళ్ళాలా అంటున్నారు మీ అల్లుడు గారు!"

"మీ ఇష్టం మరి"

"ఫోన్ అమ్మకివ్వండి" అంది. శ్రీమతికి ఇచ్చాను.

"నీకు తెలుసు కదమ్మా. ఆయన వెళ్ళొద్దంటే గడప దాటలేను కదా. రాలేదని ఏమీ అనుకోవద్దు. నాన్నకి నచ్చజెప్పు. అయినా ఈ నెంబర్లలెక్కలేంట్లే. ఇప్పుడు నలభై, వచ్చే ఏడాదికి నలభై ఒకటి. క్యాలెండర్‌తో బాటు మారుతూనే ఉంటాయి. విశేషం ఏముందీ!"

"ఉందనుకుంటే ఉంది, లేదనుకుంటే లేదు" ముక్తసరిగా అంది శ్రీమతి.

"ఒక్క నిమిషం అమ్మా, ఫోన్ పెట్టేయకు. నాన్నేదో వీలునామా రాస్తున్నాడని...."

"రాస్తే మంచిదనుకుంటున్నారు. నువ్వే అడుగు" ఫోన్ నా చేతికి ఇచ్చింది.



"నీది చాలా మంచి ఆలోచన డాడీ. మనిషీ, మెదడూ బాగుండగానే రాసేస్తే అందరికీ మంచిది. ఎవరేంటో నీకు ఇప్పుడే కదా తెలిసేది. అన్నయ్య అమెరికాలో, అక్క కెనడాలో, తమ్ముడు జర్మనీలో ఉంటారు. నేనొక్క దాన్నే నీకు దగ్గర్లో, పిలిస్తే పలికేంత దూరంలో ఉన్నాను. రేపు జరక్కూడనిది ఏం జరిగినా ముందొచ్చి వాలిపోయేది నేనే"

"ఓహో, ఏమీ జరగలేదనే గత మూడేళ్ళనుంచీ రాలేదా! సరేలే. జరిగాక చూద్దాంలే"

"అంతా అయిపోయాక చూసేదీ చేసేదీ ఏముంటుంది డాడీ. ఏమైనా చెయ్యాలనుకుంటే ఇప్పుడే చెయ్యాలి. నాకు ముగ్గురూ ఆడపిల్లలే. వాళ్ళకి ఘనంగా పెళ్ళిళ్ళు చెయ్యాలి. భారీగా కట్నాలివ్వాలి. తాత ఆస్తి అని వాళ్ళకీ ఆశ ఉంటుంది కదా. అందుకని నీ చిట్టి తల్లికి కొంచెం...."

"ఎక్కువివ్వమంటావ్. చూద్దాంలే."

"థాంక్యూ. నువ్వు మాటంటే మాటేనని నాకు తెలుసు డాడీ. బై డాడీ. ఆరోగ్యం జాగ్రత్త. అమ్మకి చెప్పు."

ఫోంచేద్దామని అన్నీ వడ్డించుకుని కూర్చున్నామో లేదో, చిన్నవాడు వాళ్ళమ్మకి ఫోన్ చేశాడు.

"దీంతో సర్కిల్ పూర్తయినట్టే" నవ్వాను.

శ్రీమతి మాత్రం కంగారు పడుతూ అడిగింది "ఈ టైంలో చేశావేంరా, మీకిప్పుడు అర్ధరాత్రి కదా!"

"చిన్నక్క ఏదో మెసేజ్ పెట్టిందిలే..."

"మ్యారేజ్‌డే గురించా, వీలునామా గురించా?"

"రెండింటి గురించీనూ. డాడీకి అంతా తొందరే. ఇప్పుడంత భారీగా చేసుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది చెప్పు. ఇంకో పదేళ్ళు ఆగితే గోల్డెన్ జూబిలీ అదిరిపోయే లెవెల్లో మేం చేద్దుం కదా!"

"అప్పుడూ చెయ్యండ్రా, ఎవరొద్దన్నారూ!"

"సరే, అప్పుడెంత గ్రాండ్‌గా చేస్తానో మీరే చూస్తారుగా. మీరు సుఖసంతోషాలతో ఆరోగ్య ఐశ్వర్యాలతో తులతూగుతూ ఉండాలని రోజూ నేను దేవుణ్ణి కోరుకుంటూ ఉంటాను. ఇకపోతే నీకు తెలుసుకదమ్మా. ఇల్లు నీ పేరున ఉంది. నేను చిన్నకొడుకుని. అంచేత..."

"మీ డాడీకి చెబుతాన్లే. ఆయన బుర్రని ఏ పురుగు తొలుస్తోందో మరి. ఇంక పడుకోరా, లేకపోతే ఆరోగ్యం పాడవుతుందిరా."

"అలాగే పడుకుంటానమ్మా. నువ్వు చెబితే నాన్న కాదనరు. భారం నీమీద వేసి పడుకుంటున్నాను..."

ఫోన్ పక్కన పెడుతూ, "చిన్నవాడి కన్ను ఇంటి మీద పడింది" అంది.

"అంతా విన్నాన్లే"

ఇంటి రిపేర్ పనులు చకచకా జరుగుతున్నాయి.

బంధువులూ, మిత్రులూ ఎవరొచ్చేదీ ఎందరొచ్చేదీ జవాబు ఇచ్చారు. అతిథుల సంఖ్య అంచనావేసి

> **వాళ్ళ పిల్లలు అమెరికాలో, ఇండియాలో బాగా సెటిలయ్యారు. ఆ భార్యాభర్తలిద్దరూ ఇప్పుడు 40వ వివాహ వార్షికోత్సవ వేడుకలు చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. అద్దెకు ఆప్తులు అనే సంస్థను సంప్రదించి భారీ ఖర్చుతో గ్రాండ్ ప్రోగ్రాం ప్లాన్ చేశారు. మావయ్యలూ, అత్తలూ, బాబాయిలూ...ఇలా బంధువులందరినీ అద్దెకు బుక్ చేశారు. ఆ విషయం తెలిసి కుతకుత ఉడికిపోయిన వాళ్ళ సంతానం ఎలా రియాక్టయింది?**

బ్రేక్‌ఫాస్ట్ నుంచి డిన్నర్ దాకా ఆర్డర్ ఇచ్చాను. వినోదానికి టీవీ హాస్యనటుల షో, పాటలు పాడే బృందం, మేజిక్ షోలు బుక్ చేశాను.

ఒక మిత్రుడు రహస్యంగా అడిగాడు "మందు కూడా ఉంటే మజాగా ఉంటుంది గురూ. నువ్వు తాగకపోయినా మాకు పోయించొచ్చుగా!"

"వచ్చుగాని ఆ తర్వాత మీరు తిన్నగా నిలబడలేరు. మిమ్మల్ని నేను కంట్రోల్ చెయ్యలేను. ఎందుకులే, వదిలేయ్."

ముఖం మాడ్చుకుని సణుక్కుంటూ వెళ్ళిపోయాడు. అతడు సొంత డబ్బుతో మందు తాగనని భార్యకి ప్రమాణం చేశాడు పాపం!

పక్కింటాయన వచ్చాడు. ఏర్పాట్లుచూసి కళ్ళెగరేశాడు.

"మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నట్టు, అబ్బో, భారీగా చేస్తున్నారే"

"ఇదే కాదు, ఇక ముందు ప్రతీ పండగా ఇలా అందర్నీ పిలిచి చేస్తే ఎలా ఉంటుందా అని ఆలోచిస్తున్నాను. మీకు తెలుసుగా, మాకేం బరువూ, బాధ్యతలూ లేవు. బతికినన్నాళ్ళూ హ్యాపీగా బతకడమే మా ఏకైక ఎజెండా. ఎలాంటి ఆంక్షలూ, ఒత్తిళ్ళూ మొహమాటాలూ, బంధాలూ ఏమీ లేకుండా, వేటినీ పట్టించుకోకుండా, చెయ్యాలనుకున్నదల్లా స్వేచ్ఛగా చేసేస్తాను. ఇన్నేళ్ళూ బోళ్ళు సంపాదించాను. ఇక చాలు అనుకుని బిజినెస్ అమ్మేశాను. ఇక మిగిలిందల్లా పదిమందితో కలిసి ఎంజాయ్ చేయడమే!"

"ఇదేదో పుణ్యకార్యం అయినట్టు మాట్లాడతారేంటీ! ఈ పార్టీ, గిర్టీ ఇహానికీ పనికిరావు, పరానికీ అక్కరకు రావు!"

తుళ్ళిపడి చూశాను. తల తిప్పేసరికి శ్రీమతి నా వంకే చూస్తోంది!

"ఇలా ఊరికే ఖర్చు చేసేకన్నా ఒక ప్రయోజనం కోసం, పరమార్థం కోసం చేస్తే బావుణ్ణంటావా?" బుర్రలో బుల్లి ఆలోచన నాటుకోగా అడిగాను. అవునంటూ తలాడించింది.

"ఆc అలా చెయ్యి, మంచిది" అన్నాడతడు.

"ఆ సంగతి తర్వాత చూద్దాం, ముందిది సక్సెస్ చెయ్యండి. మీరంతా బంధుమిత్ర సపరివార సమేతంగా వచ్చేయండి."

మళ్ళీ అతను సంశయిస్తూనే స్వరం తగ్గించి అన్నాడు "మీ పెద్దబ్బాయి ఫోన్ చేశాడు మీరు మతిలోనే ఉన్నారా అని అడగటానికి...."

బిగ్గరగా నవ్వుతూ శ్రీమతితో అన్నాను "విన్నావుటోయ్, వార్తలు ఎప్పటికప్పుడు అందరికీ వెళ్ళిపోతున్నాయి. ఇదీ మంచిదేలే! ఇన్నేళ్ళకి మనమీద శ్రద్ధ చూపిస్తున్నారు!"

మరో అరగంటకి పెద్ద కొడుకు ఫోన్ చేశాడు. "సంపాదించిందంతా అడ్డమైన వాటికీ తగలేస్తాను అంటున్నారంట ఏంటి? మీకేమైనా పిచ్చా వెర్రా?"

"తప్పురా అబ్బాయ్. తగలెయ్యట్లా, పదిమందితో కలిసి అనుభవిస్తున్నాం. అనుభవించడానికేగా రాత్రీ పగలూ కష్టపడి కూడబెట్టిందీ. మేం మాత్రమే తినడం లేదులే, అయిదారువందల మందికి తినిపిస్తున్నాం."

"మీ ఇష్టం వచ్చినట్టు ఖర్చు చేస్తే కాదు. మీ సంపాదన మీద మాకూ హక్కుంది" కఠినంగా అన్నాడు.

"ఉంటే నువ్వూ రారా. ఎంజాయ్ యువర్ సెల్ఫ్!"

వాడు మరి మాట్లాడలేకపోయాడుగాని, చిన్న కూతురు కాల్ చేసి అడిగింది "డబ్బంతా నాశనం చేస్తున్నావంట, మాకు చిల్లిగవ్వ ఇవ్వకూడదని కంకణం కట్టుకున్నావా డాడీ?"

"ఇదంతా నా సంపాదనేగా చిట్టీ. మీకు చెయ్యాల్సినవన్నీ చేసేశాను. మీరు కూడా రెండు చేతుల్తో సంపాదించుకుంటున్నారు. మీ విజయాల్లో నా భాగమూ ఉంది కదాని నేనేం వాటా అడగటం లేదుగా. మీ ఇష్టం వచ్చింది మీరు, నా ఇష్టం వచ్చింది నేను చేసుకునే హక్కు మనకుంది. ఏ మనిషైనా జీవితంలో అసలైన యుద్ధాలు, వయస్సులో ఉన్నప్పుడు కాదు ముసలితనంలో చేయాలి తల్లీ. ఆశయాలతో అనారోగ్యంతో అయినవాళ్ళతో కబ్జాదారులతో, అందరితోనూ!"

"నాకేం అర్థం కావట్లేదు"

"సంధి ప్రేలాపనలా ఉందా? వదిలెయ్" నవ్వాను. కన్నీళ్ళు పెట్టుకుంది.

మరి కాస్సేపటికే చిన్నకొడుకు లైన్లోకొచ్చాడు. "మా అవసరం మీకు లేదనుకుంటున్నారా... ఇష్టానుసారం ప్రవర్తిస్తున్నారు?!" అన్నాడు దూకుడుగానే.



"మీతో మాకేం సంబంధం మిగిలిందిరా. మేం ఎవరిక్కావాలి! వారానికోసారి ఫోన్లో పలకరించడానికే మీకు తీరికుండదు. ఒకప్పటి వాసనను వదులుకోలేక అయినవాళ్ళని అద్దెకు తెచ్చుకుంటున్నాం. ఈ మధ్య ఇక్కడ ఈ దందా బావుందిలే. ఎవరు కావాలంటే వాళ్ళు అద్దెకు దొరుకుతారు. ఏమాటకామాటే చెప్పు కోవాలి. అభిమానాలు ఒలకబోస్తూ అచ్చం బంధువు ల్లానే ప్రవర్తిస్తార్రా. కావాల్సింది కావాల్సినప్పుడల్లా దొరుకుతోంటే ఇక మీ అవసరం ఏవుందిరా!"

గొలుసుకట్టులోలా ఆ వెంటనే పెద్దమ్మాయి ఫోన్ చేసింది.

"మేమెవరం అక్కర్లేదన్నావంటగా. నీకెవరో మందు పెట్టారు. మీరిదివరకు ఇలా ఉండేవారు కాదు. మేం నోరుతెరిచి అడిగితే చాలు కొండమీద కోతిని కూడా తెచ్చి ఇచ్చేవారు. అమ్మ కూడా మీకు వంత పాడ టమే చిత్రంగా ఉంది."

"మీరు ఇదివరకట్లా ఉంటున్నారా! ఆ అభిమా నాలు, ఆప్యాయతలు, అనురాగాలు ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహాలు!" నా గొంతు వణికింది.

"మేమేమీ చిన్న పిల్లలం కాదు. పెద్దవాళ్ళ మయ్యాం. మాకూ పిల్లలున్నారు. మీతో ఊరేగడానికి మాకెక్కడ తీరుతుందీ! మీకీ మధ్య మైండ్ బ్యాలెన్స్ తప్పుతున్నట్టుంది. ఎందుకైనా మంచిది డాక్టరుకి చూపించుకోండి."

"అవసరం లేదు తల్లీ. ఇన్నేళ్ళూ బిడ్డల మోహంలో బతికాం. ఇప్పుడా జాలంలోంచి బయటపడ్డాం. ఎన్నాళ్ళు బతుకుతామో తెలీదు. ఎప్పుడైనా బకెట్ తన్నెయ్యొచ్చు. ఆ తర్వాత ఎవరొచ్చారో, ఎవరు ఏడ్చారో ఎవరిక్కా వాలీ! అందుకే రోజూ పండగ చేసుకోవాలనుకుం టున్నాం. పండగంటే పదిమందితో ఆనందం పంచు కోవడమేగా?!"

"పెద్ద తమ్ముడన్నది నిజమే. మీకు బుద్ధి చెప్పా ల్సిందే. లేకపోతే బూడిదే మిగులుస్తారు!" ఠక్కున లైన్ కట్ చేసింది.

"వీళ్ళా మన పిల్లలు! వాళ్ళకి చేయాల్సిందంతా చేసేసినా, మనకున్నదంతా పంచేసి పువ్వుల్లోపెట్టి వాళ్ళకి ఇచ్చెయ్యాలట. వాళ్ళకి నచ్చేవీ, ఖర్చు లేనివీ చెయ్యాలి తప్ప మనకి సంతోషం కలిగించే పనులు చేసుకోకూ డదట. చిత్రంగా లేదూ?!" శ్రీమతితో అన్నాను.

"లోకంపోకడ అలా ఉంది!" వ్యాఖ్యానించింది.

మ్యారేజ్‌డేనాడు ఉదయమే బుక్ చేసిన బంధువు లంతా బిలబిలమంటూ వచ్చేశారు.

"నేనురా మీ మావయ్యని. ఎలా ఉండేవాడివి ఎలా అయిపోయావురా!" "ఒరే అబ్బాయ్, అలా తెల్ల మొహం వేస్తావేంట్రా. నీ అత్తయ్యని! బాగున్నావుట్రా. చూసి చాన్నాళ్ళయ్యిందిరా" "నీ కన్నా పెద్దదాన్ని, నా జుట్టింకా నల్లగా నిగనిగలాడుతోంది. నీ జుట్టేవిట్రా ముగ్గుబుట్ట అయ్యిందీ!" "బావగారు అచ్చం కొత్త పెళ్లి కొడుకులా ఉన్నారు!" "మా వదినకి నా దిష్టే తగిలే ట్టుంది" "నిన్ను బామ్మగారు అననా, మామ్మగారని పిలవనా?" "మీరలా పార్వతీ పరమేశ్వరుల్లా కూర్చోండి! అన్నీ చక్కబెట్టడానికి మేమున్నాం కదా!"

ఎన్నో పలకరింపులు! పులకరింతలు! వాళ్ళని కిరాయి బంధువులని ఎవరనగలరు?

తలో పనీ భుజాన వేసుకున్నారు. ఆహూతుల్ని ఆహ్వానిస్తున్నారు. తిండి ఏర్పాట్లు చూస్తున్నారు. వినోద కార్యక్రమాలు పర్యవేక్షిస్తున్నారు.

ఇహ పిల్లల ఆటల్తో పాటల్తో నవ్వుల్తో మా ఇల్లు మార్మోగిపోతోంది!

ఇంటికి పెళ్ళికళ వచ్చింది. ఇంటినిండా జనమే. నా చిన్నప్పుడు మా ఇల్లు ఇలానే ఉండేది. పండగలకీ, పబ్బాలకీ అయితే తలాటి ఆడబడుచుల్నుంచి అంతా సకుటుం బంగా వచ్చేసేవారు. ఆ రోజులే వేరు!

కళ్ళల్లోంచి ఆనందభాష్పాలు జలజల రాలి పడుతోంటే అంది శ్రీమతి "మన పిల్లలంతా మళ్ళీ చిన్నవాళ్ళై మన కళ్ళ ముందు తిరుగుతున్న ట్టుగా ఉందండీ!"

"నాకూ అలాగే అన్పిస్తోంది" సాలోచనగా అన్నాను.

"రోజూ ఇల్లు ఇలా కళకళలాడుతూంటే ఎంత ఆనందంగా ఉంటుందో కదండీ. అలాంటి దేదైనా కుదుర్తుందేమో చూడండి. మనకీ ఈ ముదిమిలో ఉత్సాహంగా, ఆరోగ్యంగా, సంతృప్తిగా ఉంటుంది."

"చూద్దాం. బుర్రలో ఏవేవో ఆలోచనలు గింగిర్లు తిరుగుతున్నాయి" అన్నాను.

ఆర్భాటంగా పార్టీ మొదలైంది.

అంతావచ్చి మమ్మల్ని తీసుకెళ్ళి, స్టేజీ మధ్యలో ప్రత్యేకమైన కుర్చీల్లో కూర్చోబెట్టారు. మమ్మల్ని పొగి డారు. పద్యాలూ, పాటలూ పాడారు. మేమిద్దరం ఒకరికొకరం మిఠాయి తినిపించుకునే దాకా వదల్లేదు. గోలగోల చేస్తూనే ఉన్నారు.

లంచ్ అవుతూనే సంగీత కార్యక్రమం మొదలైంది.

మరో పక్క అప్పుడే డిన్నర్‌కి వంటలు మొదలు పెట్టేశారు.

'కేక్ కటింగ్ ఎన్నింటికి?' ' డిన్నర్ ఏ టైంకి రెడీ అవ్వాలి' 'ఒరేయ్ వాళ్ళకి టీ ఇవ్వండ్రా' 'ముందే చెప్తున్నా. కేక్ కట్ చేశాక అంతా కలిసి గ్రూపు డాన్సు చెయ్యాలి' 'అదయ్యాకే పాటగాళ్ళని వెళ్ళనివ్వండి' 'పిల్లల మ్యాజిక్ ప్రోగ్రాం ఎప్పుడని అడుగుతున్నారు.'

అంతా ఒకటే హడావిడిగా ఉంది.

కూడబలుక్కున్నట్టుగా మా ఇద్దరు అబ్బా యిలూ, ఇద్దరమ్మాయిలూ వచ్చేశారు.

"మనబ్బాయిలూ, అమ్మాయిలూ వచ్చారండీ. కేక్ కట్ చేసే సమయానికి తప్పకుండా వస్తారనుకున్నాను. అలాగే వచ్చారు, చూడండి. పట్టుబట్టలూ పూల దండలూ తెచ్చి ఉంటారు. ఏమైనా పేగు బంధం 'పేగు బంధమేనండీ" అంటూ సంబరంగా నన్ను తోసుకుని మరీ ఎదురెళ్ళింది శ్రీమతి.

వాళ్ళు సంకోచిస్తూనే ముఖాలు వేలాడేసుకుని లోపలికొచ్చారు.

"వెల్కం, పరాయివాళ్ళు పొద్దుటొస్తే, అయిన వాళ్ళు రాత్రికి వచ్చారన్నమాట. ఏమైతేనేం వచ్చారు. అదే సంతోషం రండి...."

కొందరు వాళ్ళకి జ్యూస్ తెచ్చిచ్చారు. మీరు త్వరగా డ్రెస్ మార్చుకోండని కొందరు వచ్చి మా ఇద్దర్నీ తొందరపెట్టారు.

"వీళ్ళెవర్రా?" అద్దె మావయ్య అడిగాడు.

"కొడుకులూ, కూతుళ్ళూనూ"

"మా కంపెనీ వాళ్ళా లేక వేరే కంపెనీ వాళ్ళా!"

## రోబో భామ వ్యాపారం

దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న సామెతను అమీ జాక్సన్ బాగానే వంటపట్టించుకున్న ట్టుంది. సినిమాలు ఎల్లకాలం ఉండవు కనుక దీని తరు వాత మరో వ్యాపకం చూసుకోవాలనుకుంది. మిగతా హీరోయిన్ల మాదిరిగా రియల్ ఎస్టేట్, బంగారం, వజ్రాల మీద పెట్టుబడి పెట్టకుండా హోటల్ బిజినెస్ మీద దృష్టి పెట్టింది. దీనికీ ఓ కారణముంది. అమీకి సినిమాల తరువాత ఎక్కువ ఇష్టమైన వ్యాపకం వంట! కొన్ని వంటలను స్వయంగా చేస్తుందట కూడా! అందుకే హోటల్ బిజినెస్ తనకు పర్ ఫెక్ట్ అనుకుందట! కాకపోతే ఇండియాలో కాకుండా తన సొంతూరు లండన్‌లో చేయ బోతోంది. తన వ్యాపారంలో మమ్మీని కూడా భాగస్వామిని చేసుకుంటోంది. కాకపోతే ఇండియా సొమ్ము లండన్‌కి తరలుతోందన్నమాట!





## ఎన్ని కోట్లు ఇచ్చినా చేయదట!

శరవణన్ స్టోర్స్ యజమాని శరవణన్‌తో కలిసి నయనతార నటించబోతోంది అన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. అసలు సంగతేమిటంటే శరవణన్ త్వరలోనే సినీరంగ ప్రవేశం చేయనున్నాడు. తను చేయబోయే మొదటి సినిమాలో నయనతార నటిస్తుందని అతగాడు మీడియా సమావేశంలో చెప్పాడు. ఈ విషయం తెలిసి నయనతార అంతెత్తున మండిపడిందట! తను డబ్బుల కోసమే సినిమాలు చేస్తున్నా కొన్ని నియమాలు పాటిస్తానని అంటోంది. హీరో ఎవరైంది పట్టించుకోను కానీ కథ నచ్చకపోతే చేయనని చెబుతోంది. ఈ విషయంలో ఎన్ని కోట్లు ఇచ్చినా నా నుంచి వచ్చే సమాధానం అదే అంటోంది. అసలు శరవణన్‌తో చేయమని తన దగ్గరకి ఎవరూ రాలేదనీ, కథ కూడా చెప్పలేదనీ, అలాంటప్పుడు తన పేరు ఎలా బయటకు చెబుతారనీ ప్రశ్నిస్తోంది.

"ఈ ఇంటి కంపెనీ వాళ్ళేలేగానీ, వీళ్ళ స్నానాలకవీ ఏర్పాట్లు చూడమని చెప్పు మావయ్యా"

"నిజం కొడుకులూ, నిజం కూతుళ్ళూ వచ్చార్రా. వారికేం కావాలో నువ్వూ నువ్వూ దగ్గరుండి చూడండి" ఇంకెవరికో పురమాయించి హడావిడి చేస్తూ వెళ్ళాడతడు.

"వీళ్ళంతా ఎవరు?" పెద్ద కొడుకు అడిగాడు.

"మన బంధువులే"

"మేమెప్పుడూ చూళ్ళేదు?"

"అద్దె బంధువులు" శ్రీమతి చెప్పింది.

నిరసనగా నవ్వింది పెద్దమ్మాయి.

"ఈ గందరగోళం అంతా ఏంటి డాడీ. ఇదంతా ఎందుకు? ఎవరికోసం?" చిన్నకొడుకు అడిగాడు.

"అన్ని రుతువులూ వెళ్ళిపోయాయి. ఇప్పుడు హర్ష ఋతువు వచ్చింది. శ్రమ, కష్టం, బాధ, నిరాశ ఇవన్నీ మింగేసిన కాలాన్ని తిరిగి చేజిక్కించుకుని హ్యాపీగా, జాలీగా గడిపెయ్యడమే ఇక మా పని. కమాన్. మీరూ కలవండి...." ఉత్సాహంగా అన్నాను.

"వీటికి ఫుల్‌స్టాప్ పెట్టించడానికే వచ్చాం" చిన్నకూతురు చెప్పింది.

"ఏం? మేం హ్యాపీగా ఉండటం మీకిష్టం లేదా?" శ్రీమతి ప్రశ్నించింది.

"ఇదేం పిచ్చి హ్యాపీనెస్? మేమెక్కడా చూడలేదు. ఇంటిమీద పడి ఊరికే మెక్కేస్తూ పొగిడే పొగడ్తలు మీకిప్పుడు కావాల్సొచ్చాయా? అవే మిమ్మల్ని ఆనందపరుస్తాయంటే 'మీరింత వారు అంత వారు' అంటూ స్తోత్రనామావళి రికార్డు చేసిస్తాం, రోజుకి మూడుసార్లు వింటూ తరించండి" అన్నాడు పెద్దవాడు.

"కృష్ణా రామా అనుకోండి. తీర్థయాత్రకు వెళ్ళండి. పుణ్యం పురుషార్థం వస్తాయి. అంతేగాని ఇలా రోడ్డున పోయే వాళ్ళందర్నీ పోగేసి పార్టీలంటూ తగలేస్తే మేం సహించం" పెద్దమ్మాయి నిక్కచ్చిగా చెప్పింది.

"మంచి పాయింటు చెప్పావు తల్లీ. సంతోషం. మా గమ్యం గురించి నాకిప్పుడు క్లారిటీ వచ్చేసింది!"

నా మాటకు నలుగురూ మిర్రి మిర్రి చూశారు. వారి చూపులు పట్టించుకోకుండా "నువ్వు కోరుకున్న ఆనంద క్షణాలు ఇక మనింట్లో ఘనీభవిస్తాయోయ్" సంబరంగా అన్నాను శ్రీమతితో.

"బాబాయ్. ఇంకా ఇలాగే కూర్చున్నారేంటి? త్వరగా డ్రెస్ ఛేంజ్ చేసుకోండి. కేక్ కటింగ్‌కి టైమై పోతోంది" అంటూ వచ్చాడో కజిన్. మా సంతానాన్ని చూసి "వీళ్ళెవరు?" అని అడిగాడు.

"ఒరిజినల్ బంధువులు. పది నిమిషాల్లో వచ్చేస్తాం. మీరు పదండ్రా అబ్బాయ్" అతన్ని పంపేనో లేదో, "కొడుకులూ, కూతుళ్ళూతప్ప అంతా ఉన్నార్రా అన్నయ్యా" అంటూ వచ్చాడు తమ్ముడు దిగులుగా.

"వాళ్ళనీ అద్దెకు తెచ్చుకోవాల్సింది!" పెద్దవాడు అన్నాడు వ్యంగ్యంగా.

"ఇష్టం లేదురా. వాళ్ళూ మీలానే ప్రవర్తిస్తే ఈ ముసలి గుండె భరించలేదురా!" బావురుమన్నాను.

తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ, బాబాయిలూ, అత్తలూ, పిల్లలూ, అంతా బిలబిల మంటూ వచ్చి ఏవయ్యిందంటూ చుట్టేశారు. వారి అభిమానానికి చలించిపోయాను. ఏమీ జరగలేదని సర్దిచెప్పాకగాని వాళ్ళు వెళ్ళలేదు.

"నాటకాలు బాగా రక్తి కట్టిస్తున్నారు" పెద్దవాడు కామెంట్ చేశాడు.

"త్వరగా రండి తాతగారూ, డాన్స్ చేస్తాం చూద్దురుగాని" అన్నారు మనవలూ, మనవరాళ్ళూ.

"ఇదిగో వీళ్ళని పంపి వచ్చేస్తాం. మీరు ఆ ఏర్పాట్ల మీద ఉండండి" అని చెప్పి పంపించేశాను.

"భోంచేద్దురుగాని లేవండ్రా, ఎప్పుడు తిన్నారో ఏమో" శ్రీమతి అంది.

వాళ్ళు కదల్లేదు. "ఉంటారా వెళ్తారా?" సూటిగా అడిగాను.

"ప్లీడర్ని తీసుకొచ్చాం. వీలునామా రాసేస్తే వెళ్ళిపోతాం."

"అందుకోసం వచ్చార్రా ముదనష్టపోళ్ళారా. ఫోండిరా ఫోండి...." బిగ్గరగా అరచి, నోట్లో చీరకొంగు కుక్కుకుని, లోపలికి పరుగెత్తింది శ్రీమతి.

"సంతోషం. ఇన్నేళ్ళూ మిమ్మల్ని వృద్ధిలోకి తేవటమే లక్ష్యంగా బ్రతికాం. ఇప్పుడు మరో గమ్యం ఏర్పరచుకోవాలనుకుంటున్నాం. ఇది మాత్రం కేవలం మాకోసమే. మా ఆనందం కోసమే. 'ఏదో ఇలా బతికి ఉన్నాం' అన్నట్టు గాక మా బ్రతుక్కి ఒక అర్థం పరమార్థం కల్పించుకోవాలని ఉంది. పదిమందికీ ఆదరవుగా, ఆధారంగా నిలవాలనుంది. మా కష్టఫలాన్ని సద్వినియోగం చేసుకోవాలనుంది. ఆ రకంగా నలుగురికీ ఆనందం పంచి, పరమానందం పోగుజేసుకోవాలని పేరాశగా ఉంది."

"కన్నప్రేమ అక్కర్లేదుగాని కొన్నప్రేమ కావాలన్న మాట!" హేళనగా అన్నాడు పెద్దకొడుకు.

"కొన్న ప్రేమలుకాదు, ఆ కొన్న ప్రేమ కావాలి"

"ఇదో కొత్త రకమా? వీటిని మార్కెట్లో అమ్ముతారా, అద్దెకిస్తారా?" చిన్నకూతురు ప్రశ్నించింది.

వారిమాట పట్టించుకోకుండా అన్నాను "మాకు దూరమైన అనుబంధాలూ, ఆత్మీయతలూ అన్నీ మాకు కావాలి. మా కడపటి శ్వాసవరకూ కావాలి. అందుకే పాతిక ముప్ఫై మంది అనాథ బాలబాలికల్ని చేరదీస్తాం. వారి నవ్వుల్తో కేరింతల్తో ఈ ఇల్లు మారుమోగేలా చేస్తాం. ఈ ఆలోచన కూడా ఇవాళే ఇదిగో వీళ్ళందర్నీ చూశాకే వచ్చింది. మీ నైజం బయటపడ్డాక బలపడింది."

"ఇంటిని అనాథ శరణాలయం చేసేస్తారన్నమాట!"

"కాదు. అనాథల్ని సనాథలుగా చేసే ఆలయంగా మారుస్తాం. మా సంపద, ఆదాయం అన్నీ వాళ్ళకోసం వినియోగిస్తాం. దాన్ని మీరెవరూ అడ్డుకోలేరు. ఇదంతా నా స్వార్జితమే. అంతా మా ఇష్ట ప్రకారమే ఖర్చు పెడతాం."

"దానర్థం మాకు ఏమీ ఇవ్వరనేగా?" చిన్నవాడు సర్రున లేచాడు.

"మీ అందరికీ ఇళ్ళున్నాయి. కార్లున్నాయి. బ్యాంకు బ్యాలెన్సులున్నాయి. మా ఆస్తిపాస్తుల్ని మీకిచ్చినా మీకు ఎంతో ఉందని తృప్తిపడడానికి తప్ప, అదనంగా మీకు ఒరిగేదేమీ ఉండదు. మీరు రెండు ఇళ్ళల్లో పడుకోలేరు. నాలుగు చేతుల్తో తినలేరు. అసలేమీ లేనివాళ్ళకి ఒక రూఫ్, ఒక ముద్ద అన్నం, ఒక చాప ఇవ్వగలిగితే వాళ్ళు నిలదొక్కుకుంటారు. వారి బతుక్కో భరోసా చిక్కుతుంది. మా జన్మలూ ధన్యం అవుతాయి. అందుకే మా సంతానమే మాకూ, మా ఆస్తికీ వారసులన్న సంప్రదాయాన్ని చెరిపేస్తాం. మా తదనంతరం మా సంపద సమాజానికి ఉపయోగపడేలా చూస్తాం. కొందరు అభాగ్యబాలలే మా వారసులు. వాళ్ళ చేతులు పట్టుకుని నడిపిస్తూ, వారి మొహాల్లో ఆనందం పూయిస్తూ మా బతుకు నందనవనం చేసుకుంటాం. ఇన్నాళ్ళూ మాకు మీరు నలుగురే. ఇక నుంచి మేం ఎందరికో. మాకిప్పుడు స్వార్థం లేదు. మీకు స్వార్థం ఉంటే మేమేం చెయ్యలేం!" అంటూ లేచాను.

అంతా కోపోద్రిక్తులై మింగేసేలా చూస్తోంటే, స్థిర స్వరంతో అన్నాను. "ఇంకో సంగతి. మేం చనిపోయాక మా శవాలను వైద్య విద్యార్థుల ప్రయోగాల కోసం ప్రభుత్వాసుపత్రికి దానమివ్వాలని నిర్ణయించుకున్నాం. అంచేత తలకొరివి పెట్టాల్సిన శ్రమా మీకు తప్పింది. మనసుంటే వచ్చి ఈ శుభసంకల్ప దినోత్సవపు కేకు తినండి. లేదా సెలవు. గుడ్ బై!"

***సెల్: 98490 61668***

## సరదాగా....

### పేరు

స్కూల్లో కొత్తగా జాయినయిందా టీచర్. క్లాసు కొచ్చి పిల్లలందరి పేర్లూ తెలుసుకుంది. ఆఖరు బెంచీలో కూర్చుని నిద్రపోతున్న బంటిగాణ్ణి లేపి, నీ పేరేంటి? అని అడిగింది. వాడు నీలేశ్ టీచర్, కానీ అందరు ముద్దుగా బంటి అని పిలుస్తారు అన్నాడు. టీచర్ కోపంగా చూస్తూ, నా క్లాసులో తెలుగులో మాట్లాడవద్దు. ఇంగ్లీష్‌లోనే మాట్లాడాలి. తెలిసిందా? అన్నది. తిరిగి వాటీజ్ యువర్ ఫాదర్స్ నేమ్? అని అడిగింది. దానికి బంటి రైస్ పీస్ కింగ్ టీచర్ అన్నాడు. టీచర్‌కి అర్థం కాక, అదేం పేరు? అనడిగితే, మీరే కదా ఇంగ్లీష్‌లో చెప్పమన్నారు. మా నాన్న పేరు నూకరాజు... ఇంగ్లీష్‌లో రైస్ పీస్ కింగే కదా! అన్నాడు బంటి.

### ఒక ప్రశ్న?

మరకతమనే రాజ్యాన్ని భీమసేనుడు పరిపాలిస్తుండేవాడు. అతడి పాలనలో ప్రజలందరూ సుఖ సంతోషాలతో, ఆయురారోగ్యాలతో, సిరిసంపదలతో ఆనందంగా గడుపుతున్నారు. విక్రముడు అనే ధీశాలి కూడా ఆ రాజ్య పౌరుడే. అతడు దేశదిమ్మరి. ఎన్నో ప్రాంతాలు, దేశాలు, రాజ్యాలు తిరిగి అమూల్యమైన వస్తువులెన్నింటినో సేకరిస్తూ ఉంటాడు. వాటన్నింటినీ ప్రతి మూడు మాసాలకొకసారి రాజధాని నగరంలో జరిగే సంతలో విక్రయిస్తుండేవాడు. ఈసారి కూడా తాను సేకరించుకు వచ్చిన వస్తువులను అమ్మకానికి పెట్టాడు. వింతగా, కొత్తగా కనబడుతుండటంతో దాదాపు వస్తువులన్నీ అమ్ముడై, అతడి ఊహకందని వరహాలు చేతికి అందాయి. ఇక ఏవో చిన్న చిన్న వస్తువులు మాత్రమే మిగిలాయి. వాటిల్లో ధగధగా మెరుస్తున్న, వజ్రాలేమో అనిపించేట్టుగా ఉన్న రాళ్ళు కుప్పగా పోసి ఉన్నాయి. ఓ కొనుగోలుదారుడు విక్రముడి అంగడి ముందుకొచ్చి, వస్తువులన్నీ పరిశీలించాడు. ఆ రాళ్ళ కుప్ప అతణ్ణి విపరీతంగా ఆకర్షించింది. వాటిని కొనదలిచాడు. వాటి ధర ఎంతో అడిగాడు విక్రముడిని. విక్రముడు వాటివంక చూసి, ఒక్కొక్క రాయి తీసి, వాటి విశేషాన్ని వివరిస్తూ వాటి ధరలెంతో చెప్పాడు. మొదటి రాయి తీసి దీని వెల 50 వరహాలు అని, రెండో రాయి వెల 100 వరహాలు, మూడోరాయి వెల 150 వరహాలు, నాలుగో రాయి వెల 200 వరహాలు, అయిదో రాయి వెల 250 వరహాలు అని చెప్పుకుంటూ పోతున్నాడు. పైన చెప్పిన అయిదురాళ్ళ వెల లెక్కిస్తే, మొత్తం 750 వరహాలు. ఇక్కడ ప్రశ్న ఏంటంటే, కొనుగోలుదారుడి దగ్గర 10,000 వరహాలు ఉన్నాయి. వాటితో అతడు ఎన్ని రాళ్ళు కొనగలడు? లెక్కలు వేసి మీరు కూడా ప్రయత్నించండి మరి.
















**ఎం దుకనో తెలియదు అంత టెన్షన్లో కూడా అదో రకమైన ఫీలింగ్ వెట్టిని ఒక ఊపు ఊపి వదిలింది.**
**'హల్లో.... హల్లో ఎవరు? ఎవరు ఫోన్ చేసింది?' అసహనంగా వినవచ్చింది, ప్రత్యూష కంఠం.**
**'అక్కడ సంపంగి ఉన్నదా?' తనను తాను కంట్రోల్ చేసుకుంటూ అడిగాడు.**
**చటుక్కున గుర్తు పట్టేసింది ఆమె. 'నువ్వు.. నువ్వేనా? ఎక్కడినుంచి?' ఆత్రుతగా అడిగింది.**

అప్పటికి పూర్తిగా నార్మల్ అయిపోయాడు వెట్టి. 'అడిగిన దానికి సమాధానం చెప్పు. సంపంగి అక్కడ ఉన్నదా?' రెట్టించాడు.

'లేదు.. ఇంటికిపోయి వస్తానని చెప్పి ఇందాకే బయటికి పోయింది. ఇక్కడి విశేషాలు రిపోర్టు చేయటానికి బహుశా బాజిరెడ్డి దగ్గరికి పోయి ఉండవచ్చని ప్రణవికి అనుమానం' అన్నది ప్రత్యూష.

'ఓకే. నేను అక్కడికి రావటానికి అభ్యంతరాలు ఏమైనా ఉన్నాయా?' అడిగాడు.

'ఒక్క నిమిషం... ఒకే ఒక్క నిమిషం' అంటూ మాటల్ని ఆపింది ఆమె.

ఫోన్ని అలాగే పట్టుకుని పరుగులాంటి నడకతో ఎక్కడికో పోతున్న సవ్వడి వెట్టి చెవులకు చేరింది.

'గేటు బయట పదిమంది జనం మాత్రమే ఉన్నారు. మిగిలిన వాళ్ళందరూ నీ కోసం సిటీ అంతా తిరుగుతున్నట్టుగా అనిపిస్తోంది' ముఖద్వారం దగ్గర నిలబడి కాబోలు చెప్పింది ఆమె.

గ్రానైట్మైన్స్ జనం ఎవరైనా గేటుదగ్గర వాళ్ళల్లో కలిసిపోయి ఉన్నారేమో అడగాలని అనిపించినా, ఆ పని చేయలేదు వెట్టి. బాజిరెడ్డి జనానికి, మైన్స్నుంచి వచ్చినవాళ్ళకి మధ్య ఉన్న డిఫరెన్స్ దూరం నుంచి చూస్తే తెలియదు. దగ్గరికిపోయి మాట్లాడితే తెలుస్తుంది.

'విఠల్బాబూ.. నువ్వు ఎక్కడినుంచి?' మళ్ళీ ప్రత్యూష క్వశ్చన్ చేయటానికి రెడీ అవటంతో, ఆలస్యం చేయలేదు అతను.

'నేను అక్కడికి వస్తున్నాను. అవసరం అయితే ఇంకోసారి మెయిన్ ఆఫ్ చేయటానికి సిద్ధంగా ఉండు' అంటూ ఫోన్ పెట్టేశాడు.

'హల్లో... హల్లో' అంటూ ఉండగానే లైన్ డిస్కనెక్ట్ అయిపోవటంతో కొంచెం హర్ట్ అయింది ప్రత్యూష. పెదవులు బిగించి పెద్దపెద్ద అడుగులు వేస్తూ డైనింగ్ రూమ్లోకి పోయింది.

నిద్రలు లేవు ఎవరికీ. బాజిరెడ్డి పథకాలను గురించి ఆలోచించిన కొద్దీ అతన్ని ఉన్నపళాన ఉద్యోగంలో నుంచి తొలగించి రోడ్డుమీదికి నెట్టేయాలన్నంత కచ్చ వారిని నిద్రకు దూరం చేస్తోంది.

'మనం నిద్రపోయినా పోకపోయినా ఏమీ కాదు. అబ్బాయి మాత్రం ఖచ్చితంగా రెస్ట్ తీసుకోవాల్సిందే. నువ్వు వెళ్ళి వాడి దగ్గర కూర్చో' అంటున్నది పిచ్చమ్మి – శివారెడ్డి భార్యతో.

'నేను దగ్గర ఉంటే ఆయన ఇంకా ఇంకా బాధ పడుతున్నారు అత్తమ్మా. దూరంగా ఉండటమే బాగుంటుంది' కన్నీటి పర్యంతం అవుతూ చెపుతున్నది ఆమె.

అంతకుముందే డాక్టరుగారు ఇచ్చివెళ్ళిన మాత్రను బలవంతంగా పిచ్చమ్మి చేత మింగించింది ప్రణవి. గొంతు దిగిన మరుక్షణం తన ప్రభావాన్ని చూపించింది అది, అంతకుముందు రోజు. ఇప్పుడు మాత్రం ఎందుకూ పనికిరాకుండా పోయింది. కనీసం కునికిపాట్లు కూడా పడటం లేదు పిచ్చమ్మి.

'అవసరం అయిన సమయంలో దగ్గర లేకుండా పోయాడు. తెల్లవారిన వెంటనే ఆ త్రాష్టుడు ఎటువంటి పెటకం పెడతాడో తెలియదు. పెళ్ళిళ్ళ రిజిస్ట్రార్ని వెంటబెట్టుకువచ్చి ఇప్పటికిప్పుడు పెళ్ళి చేసేయమని అన్నాకూడా మనం ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు' కుర్చీవెనక్కి చేరగిలబడి కూర్చుంటూ అంటున్నది ఆమె.

'మీకు కూడా రెస్టు అవసరమే అత్తమ్మా.. పోయి కాస్సేపు నిద్రపోవాలి. లేకపోతే ఆ మాత్రలు పనిచేయవు' అని శివారెడ్డి భార్య అంటున్న సమయంలో డైనింగ్ రూమ్లోకి ఎంటర్ అయింది ప్రత్యూష.

'ఎవరే ఫోను? ఎక్కడికి పోయి వస్తున్నావు?' చికాకుగా అడిగింది శివారెడ్డి భార్య.

ప్రశ్నార్థకంగా తనవైపు చూసిన ప్రణవికి చిన్నగా కన్నుగీటింది ప్రత్యూష.

'విఠల్బాబు చేశాడు కదా?' ఉన్నట్లుండి ఒక విధమైన సంతోషానికి గురి అవుతూ అడిగింది ప్రణవి.

'తను ఇక్కడికి వస్తున్నట్టు... రోడ్డు మీద జనం ఉన్నారో లేదో చూసి చెప్పమని అడిగాడు' అన్నది ప్రత్యూష.

ఒక్కసారిగా తెరిపిన పడ్డాయి దిగులుగా ఉన్న అక్కడి వారందరి ముఖాలు. 'నేను పోయి గుమ్మంలో నిలబడతాను' అంటూ లేచాడు శంకరయ్య.

'గుమ్మం దగ్గర కాదు... గేటు దగ్గరికి పోదాం' అంటూ తను కూడా రెడీ అయినాడు రమణయ్యపంతులుగారు.





## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. చౌడేశ్వరి గుడి దగ్గర తనను అంత మొందించాలనుకున్న బాజిరెడ్డి మనుషుల నుంచి తప్పించుకుని రాయుడి పల్లి వెళతాడు. అక్కడ చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు. తిరిగి కదిరికి బయలుదేరిన వెట్టికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. కడప నుంచి హైమారెడ్డి డైరెక్ట్‌గా శివారెడ్డికే ఫోన్ చేసి, తనదగ్గర తీసుకున్న మొత్తాన్ని చెల్లించకుంటే ఎస్టేట్ మొత్తాన్ని స్వాధీన పరుచుకుంటానని హెచ్చరిస్తాడు. సమస్యలన్నీ తాను సాల్వ్ చేస్తానని మాటిస్తాడు వెట్టి. పఠాన్ ఎస్టేటు లోపలికి రావడంతో వెట్టే విఠల్‌రెడ్డి అని తెలిసిపోతుంది బాజిరెడ్డికి. దాంతో అక్కడినుంచి బయటపడతాడు వెట్టి. హాస్పిటల్ దగ్గర, హైమారెడ్డి, అతని మనుషులు కనిపిస్తారతడికి. హైమారెడ్డి కొడుకు రాకేష్ ప్రణవిని ప్రేమిస్తున్నట్టు, పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్టు చెబుతాడు. ప్రణవి ఒప్పుకుంటే అతడితోనే పెళ్ళిజరిపిస్తానని మాటిస్తాడు వెట్టి. ప్రత్యూషకు ఫోన్ చేస్తాడు.

**ఆ తర్వాత...**

తల విదిలించి వారిద్దరినీ ఆపేసింది పిచ్చమ్మి. ‘రాదలుచుకున్న వాడికి ఎలారావాలో బాగా తెలుసు. మీరెవ్వరూ కంగారుపడకండి’ అంటూ ప్రత్యూష వైపు చూసి నొసలు ఎగరవేసింది.

‘అడుగుదామని అనుకునే లోపల ఫోను కట్ చేసేశాడు. తన మాటలే తప్ప ఎదుటివాళ్ళ మాటల్ని వినిపించుకునే రకం కాదు. చిరాకేస్తోంది’ మూతి విరుస్తూ విసురుగా చెప్పింది ఆమె.

నవ్వింది పిచ్చమ్మి. నవ్వుతూనే టేబుల్ మీద తల ఆనించింది. అందరూ చూస్తూ చూస్తూ ఉండ గానే గాఢమైన నిద్రలోకి జారిపోయింది.

***

‘నువ్వు ఒంటరిగా వెళ్ళవలసిన అవసరం లేదు అబ్బయ్యా. మనవాళ్ళని నీ వెంట తీసుకువెళ్ళు’ హోటల్ వెలుపలికి వచ్చిన వెంటనే వెట్టికి చెప్పాడు హైమారెడ్డి తమ్ముడు.

హోటల్ ముందుభాగంలో అందమైన లాన్ ఉంది. హోటల్‌లో విడిదిచేసిన అతిథులు కూర్చోవ టానికి, సాయంత్ర సమయాల్లో సేద తీరటానికి చక్కటి అరేంజ్‌మెంట్లు చేయబడి ఉన్నాయి. ఒక పక్కగా ఉన్న చిన్న టేబుల్ ముందు కూర్చొని తమ అనుచరులు అంది స్తున్న ఖరీదైన విస్కీ చప్పరిస్తు న్నాడు అతను.

హైమారెడ్డి జనాన్ని తను వెంటబెట్టుకుని బయలుదేరితే, చిటికెలో తన గుట్టు రట్టు అవుతుందని వెట్టికి తెలుసు. ‘మీ జనం ఎవరూ నా వెంట రావాల్సిన అవసరం లేదు. ఏదైనా వెహికల్‌ని ఇప్పించండి’ క్షణం పాటు ఆలోచించి చెప్పాడు.

మాట అతని నోటివెంట వెలువడిన రెండో నిమి షంలో, నిశ్శబ్దంగావచ్చి రోడ్డుమీద నిలబడింది ఖరీ దైన వారి వాహనం.

ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయకుండా స్టీరింగ్ ముందుకు చేరుకున్నాడు అతను. యాక్సిలేటర్‌ని బలంగా అదిమి వేగంగా ముందుకు పోనిచ్చాడు.

***

వెట్టి ఫోన్ చేశాక, అతనితో మాట్లాడిన తర్వాత కూడా చేతిలోని ఫోన్‌ని కిందపెట్టలేదు ప్రత్యూష. అలాగే పట్టుకుని డైనింగ్ హాల్ ద్వారంలో నిల బడింది.

‘ఎందుకే అలా నిలువుకాళ్ళ ఉద్యోగం? కూర్చోలేవా?’ అడగనే అడిగింది శివారెడ్డి భార్య.

‘కూర్చోబుద్ధి కావటం లేదు వదినమ్మా’ అన్నది ఆమె.

వెంటనే వచ్చేసింది అనుమానం శివారెడ్డి భార్యకి. ‘పిచ్చివేషాలు వేయ కుండా విషయం ఏమిటో చెప్పు’ అంటూ నిగ్గతీసి అడిగింది.

సంపంగిని గురించి వెట్టి అడిగిన మాటను అప్పుడు ఆమెకు చెప్పింది ప్రత్యూష. ‘నిజమే. అది గనక ఇక్కడ ఉంటే ఆ అబ్బయ్య వచ్చిన సంగతి చిటికెలో బాజిరెడ్డికి తెలిసిపోతుంది. అది ఏ క్షణం లోనైనా తిరిగిరావచ్చు. ఏం చేద్దాం?’ సాలోచనగా అడిగింది.

‘కట్టి పడేద్దాం వదినమ్మా. నెత్తి పగలగొట్టి ఏదయినా గదిలోకి నెట్టేద్దాం..’ వెంటనే చెప్పింది ప్రణవి.



'ఏడ్చినట్టుంది నీ ఆలోచన. దానిమీద చెయ్యి పడిన మరుక్షణం దానికి తెలియకుండా ఉండటానికి మనం ఏదో చేస్తున్నామని అందరికీ అర్థం అయిపోతుంది. అలాంటి పనులు వద్దు' అన్నది శివారెడ్డి భార్య.

'తల్లీ.. మేము అవుట్‌హౌస్ దగ్గరికిపోయి అది అంటూ ఒక కుర్చీలో కూలబడ్డాడు వెట్టి.

'బాగా అలసిపోయినట్టు కనిపిస్తున్నావు అబ్బయ్యా. కాస్సేపు నడుము వాలుస్తావా?' అడిగాడు శంకరయ్య.

'అలిసిపోయిన మాట నిజమేకాని, నడుము వాల్చేందుకు ఇది టైము కాదు. మనం అందరము మాట్లాడుకోవాల్సిన మాటలు చాలా ఉన్నాయ్' వెట్టి వైపు చూసింది పిచ్చమ్మి.

'కొంపలు అంటుకుపోయింది ఏమీ లేదు. ఆ పఠాన్‌గాడిని ఇందాక ఊరికే రెండు దెబ్బలు వేశాను. రేపు వాడి ముక్కెలు విరగేసి మంచం ఎక్కించేస్తాను' అన్నాడు వెట్టి.

'ఇన్నిరోజుల నుంచీ అదిగో ఇదిగో అంటూనే ఉన్నావు. వాడు పెళ్ళికి అన్ని ఏర్పాట్లు చేసుకుంటూనే ఉన్నాడు. నీ మాటలు నమ్మటం ఎలా?' మొదలు పెట్టటం సీరియస్‌గానే మొదలు పెట్టినా, ఆఖరిలో కంఠం గద్గదమైపోయింది ప్రణవికి. దుఃఖం అధికం అవడంతో ప్రత్యూషను కౌగలించుకుని బావురుమన్నది ఒక్కసారిగా.

ప్రత్యూష కళ్ళు కూడా తడి అవటం చూసి మళ్ళీ నవ్వాడు వెట్టి.

**బాజిరెడ్డి కారు దిగి, హోటల్ లాబీలోకి వెళ్ళాడు. వెతకండిరా వాణ్ణి, ఏ గదీ వదలద్దు, బయటకు లాక్కురండి అని ఒకటే అరుస్తున్నాడు. వెర్రెక్కిపోతున్నాడు. ఇంతలో లాబీలో హైమారెడ్డి కనిపించాడతనికి. ఉలికిపడ్డాడు. హైమారెడ్డి అక్కడ కనిపిస్తాడని ఊహించలేదతడు. దాంతో తడబడ్డాడు. నోట మాటరాక అలా నిలుచుండిపోయాడు. ఆ తర్వాత ఏం జరిగింది?**

గేటుదగ్గర కనిపించగానే మిమ్మల్ని హెచ్చరిస్తాం. వెట్టి దానికి కనిపించకుండా ఉంటే ఏ గొడవా ఉండదు' అన్నాడు శంకరయ్య వెంటనే.

'నువ్వు సిద్ధంగా ఉండు... ఇంకోసారి మెయిన్ ఆఫ్ చెయ్యవలసి రావచ్చు' ప్రత్యూషకి చెప్పింది ప్రణవి.

తల అడ్డం తిప్పింది ప్రత్యూష. 'ఈ విషయం కూడా సంపంగి బయటికి చేరవేసి ఉంటుంది. కరెంటు పోయిన వెంటనే వాళ్ళకి అనుమానం రావచ్చు' అంటూ ఆ భవనం పక్కభాగంలో ఉన్న ఒక ద్వారం దగ్గరికి పోయి తలుపుల్ని బార్లా తెరిచింది.

హైమారెడ్డి తనకు హేండోవర్ చేసిన వాహనాన్ని శివారెడ్డి బిల్డింగ్‌కి దూరంగా నిలబెట్టి, నిశ్శబ్దంగా నడుస్తూ, అంతకుముందు తను ఎటునుంచి బయటికి వచ్చాడో, ఆ ప్రదేశం చేరుకున్నాడు వెట్టి. ప్రహరీ గోడ మీది నించి ఆవరణలోకి దూకుతూ ఉండగానే కనిపించింది పక్కభాగంలో ఉన్న తలుపుల్ని తెరుస్తున్న ప్రత్యూష.

ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు. వింటి నుంచి వెలువడిన బాణం మాదిరి వేగంగా పోయి, ఒక్క దుముకుతో లోపల పడ్డాడు.

పోయిన జన్మలో నువ్వు కుక్కవో నక్కవో అయి ఉంటావు. అందరి మాదిరి కుదురుగా నడవటం, నిలబడటం నీకు చేతకాదు. అన్నీ ఆ లక్షణాలే.. చిరుకోపంతో అంటూ తెరిచిన తలుపుల్ని మూసివేసింది ఆమె.

చిన్న చిన్న అడుగులతో శివారెడ్డి గది దగ్గరికి పోయి లోపలికి తొంగిచూశాడు వెట్టి. నిద్ర పోతున్నాడు శివారెడ్డి. ఒక పక్కగా ఉన్న కుర్చీల్లో కునికిపాట్లు పడుతున్నారు డాక్టరు, నర్సు.

'అమ్మగారు కూడా ఇందాకే నిద్రకు ఉపక్రమించారు. మాత్రవేసిన తర్వాత చాలాసేపు అసలు ఆవులింతలు కూడా రాలేదు. మాకు భయమేసింది' అతని వెనుకే డైనింగ్‌హాలు వైపు నడుస్తూ చెప్పింది ప్రత్యూష.

వెట్టిని చూడగానే చటుక్కున కుర్చీలో నుంచి లేచింది శివారెడ్డి భార్య. అవుట్‌హౌస్ దగ్గరికి బయలుదేరబోతున్న శంకరయ్య, రమణయ్యపంతులుగారు ఇద్దరూ ఆగిపోయారు.

'అమ్మా... కడప నుంచి ఎవరో వచ్చి ఏదో గొడవ చేస్తారని, శివారెడ్డి సారు టెన్షన్ ఫీల్ అవుతారని కూడా అనుకోవద్దు. ఎవ్రీథింగ్ విల్ బి సెటిల్డ్ అంటూ కిచెన్‌వైపు చూశాడు వెట్టి.

'సంపంగి లేదు. ఇంకా రాలేదు' అన్నది వెంటనే ప్రణవి.

'అమ్మా... ఒక్కసారి లేచి కూర్చోండి' పిచ్చమ్మికేసి చూస్తూ పిలిచాడు వెట్టి.

'వద్దు... ఇప్పుడే పడుకుంది' అంటూ అబ్జెక్ట్ చేయబోయిన ప్రత్యూష, అతను సీరియస్‌గా చూడటంతో, తల పక్కకు తిప్పుకున్నది.

'అమ్మా.. అమ్మా..' అంటూ తల్లి భుజాన్ని తట్టింది ప్రణవి.

నాలుగుసార్లు తట్టిన తర్వాత అతి బలవంతంగా కళ్ళు తెరిచింది పిచ్చమ్మి. కూతురువైపు కోపంగా చూడబోయి తన ఎదురుగా వెట్టి కనిపించడంతో, అంత మగతలోను చిన్నగా నవ్వి, 'వచ్చావా?' అన్నది.

తన జేబులో ఉన్న ఫోన్ తీసి డైనింగ్ టేబుల్ మీద పెట్టాడు వెట్టి. అది ఎంత ఖరీదైనదో తెలిసిపోయింది ప్రణవికి. వెడల్పు అయ్యాయి ఆమె కనులు.

'ప్రస్తుతం మనం ఫేస్ చేస్తున్న సమస్యలకు సంబంధించిన మాట కాకపోయినా, తొందరపడి ఒక నిర్ణయానికి మీరెవరూ రావద్దు. పూర్తిగా వినండి' అంటూ గొంతు సవరించుకుని పిచ్చమ్మి వైపు చూశాడు వెట్టి.

'ప్రణవమ్మకు పఠాన్‌ని పెళ్ళి చేసుకోవటం ఇష్టం లేదు. అతనంటే పరమ అసహ్యం. అవునా?' అడిగాడు.

పఠాన్ పేరు అతని నోటినుంచి బయటకి వచ్చిన వెంటనే మిన్నాగు మాదిరి చివ్వున తల ఎత్తబోయిన ప్రణవివైపు చేయి ఊపి, 'అవును' అన్నది పిచ్చమ్మి.

'ఓకే... పఠాన్ అంటే అసహ్యం కాబట్టి అతనితో పెళ్ళి జరగదు. బాగానే ఉంది. మంచి సంబంధం ఏదయినా ఇంకోటి వస్తే చేసుకుంటుందా?' నవ్వుతూ అడిగాడు అతను.

'నీకు మతిపోయింది. తెల్లారిన వెంటనే ఆ బాజిరెడ్డి...' అనబోతున్న ప్రణవిని మళ్ళీ చేయెత్తి ఆపేసింది పిచ్చమ్మి.

'నా మనిషి నోటివెంట అర్థం పర్థం లేని మాటలు బయటికిరావు. అతను అడిగింది నిజమే. వేరే సంబంధం ఏదయినావస్తే, అది నీకు నచ్చితే పెళ్ళి చేసుకుంటావా చేసుకోవా?' అడిగింది.

'చేసుకోను అంటే?' అగ్రెసివ్‌గా అడిగింది ప్రణవి.

'పఠాన్ సంగతి మర్చిపో. వాడి పని అయిపోయింది. ఇప్పుడు నా ప్రశ్నకు సమాధానం చెప్పు' అంటూ టేబుల్‌మీద పెట్టిన ఫోన్ ఆన్ చేశాడు.

అప్పటివరకూ మౌనంగా నిలబడి ఉన్న శివారెడ్డి భార్య చూసింది మొదటగా స్క్రీన్ మీద ప్రత్యక్షమైన ఫొటోల్ని.

'ఎవరు? ఎవరు విఠల్‌బాబూ ఇతను?' ఆశ్చర్యంగా అడిగింది.

'మీ అంతస్తుకు తగినవాడు. చదువుకుంటున్నవాడు... ముఖ్యంగా మన ప్రణవమ్మను చూసి మనసు పడినవాడు' కవిత్వం చెపుతున్నట్టు రాగయుక్తంగా చెప్పాడు వెట్టి.

అధికం అయిపోయింది అందరికీ కుతూహలం. శంకరయ్య చూశాడు. రమణయ్యపంతులుగారు చూశాడు. పిచ్చమ్మి చూసింది. ప్రత్యూష చూసింది. ఆఖరిలో అయిష్టంగానే చూసి, వెంటనే తల తిప్పుకోబోయి ఆగిపోయింది ప్రణవి.




**సార్థకత**

పుస్తకాన్ని ఒళ్ళో కూర్చుండబెట్టుకోవడంలో
ఆత్మీయత ఉంది.
పుస్తకాన్ని గుండెకు
హత్తుకోవడంలో
వాత్సల్యముంది.
పుస్తకాన్ని హృదయంలో
ముద్రించుకోవడంలో
తాదాత్మ్యత ఉంది.
మనిషే పుస్తకం కావడంలో
సార్థకత ఉంది.



—పక్కి. రవీంద్రనాథ్.
సెల్: 94403 64486

అధికంగా మాట్లాడలేదు వెట్టి. 'ఇష్టమా కాదా?' అడిగాడు మళ్ళీ.

'విఠల్‌బాబూ... నువ్వు పీకలమీద కత్తిపెట్టి మాట్లాడుతున్నావు. తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం

## ఆ అమ్మకు ఆరు కోట్లు?

సాధారణంగా హీరోయిన్లు పెళ్ళి చేసుకుంటే అవకాశాలు తగ్గుతాయంటారు. ఇక తల్లి అయితే తెరమరుగు కావలసిందే! ఇప్పటికే వెండితెర మీద ఐష్ తన సత్తా చాటుతుండగా, ఆ కోవలోకే వచ్చి చేరింది కరీనా కపూర్. ఇటీవలే ఓ పండంటి బాబుకు జన్మనిచ్చిన కరీనా ప్రసవం అయిన కొన్ని నెలలకే ముఖానికి రంగు వేసుకోవడానికి సిద్ధమైపోయింది. ఓ బిడ్డకు తల్లి అయినా మునుపటి అందాలను అలాగే మెయిన్‌టెయిన్ చేస్తుండడంతో దర్శకనిర్మాతలు కూడా ఆమె ఇంటి ముందు క్యూ కడుతున్నారట! తాజాగా ఆరు కోట్ల రెమ్యునరేషన్‌తో ఓ సినిమా చేయబోతోందనే వార్త బాగా హల్‌చల్ చేస్తోంది.



లేదా? శివారెడ్డిసారు ఒప్పుకోవాలి. అసలు ఈ బాధలన్నీ...' అంటూ మరీ అధికంగా మాట్లాడుతున్నట్టు అనిపించి చటుక్కున మాటల్ని ఆపేశాడు శంకరయ్య.

'శివారెడ్డి సారును ఒప్పించే బాధ్యత నాది' అన్నాడు వెట్టి.

అందరూ మళ్ళీ తనవైపే చూడటంతో, 'అన్నయ్యకి ఇష్టం అయితే నాకు కూడా ఇష్టమే' అన్నది ప్రణవి.

పఠాన్‌ని తప్ప మరెవ్వరినైనా చేసుకోవటానికి ఆమె సిద్ధపడుతోందేమో అనిపించింది వెట్టికి. 'సరిగ్గా చెప్పు ప్రణవీ. బలవంతం లేదు. ఇది నాకు వచ్చిన ఆలోచన మాత్రమే. ఈ పిల్లగాడు నాకు బాగా తెలుసు. చేసుకుంటే నువ్వు సుఖపడతావని అనిపించింది' అన్నాడు.

అప్పుడు అతను ఆ మాటలు చెప్పినప్పుడు తల ఎత్తి సూటిగా చెప్పింది ప్రణవి. 'వట్టొట్టి మాటలు వద్దు. ముందు అన్నయ్యని ఒప్పించి అప్పుడు నన్ను క్వశ్చన్ చేయి' కరాఖండిగా చెప్పింది.

'నిజమే విఠల్‌బాబూ... శివారెడ్డి తల ఊపితే అసలు బాధలు బరువులు ఏవీ ఉండవు' అన్నాడు రమణయ్యపంతులుగారు.

కుర్చీలో నుంచి లేచాడు వెట్టి. శివారెడ్డి గది దగ్గరికి పోయాడు. 'సారును డిస్టర్బ్ చేయటం మంచిది కాదు' అతని రాకను గమనించి ఒక్కసారిగా మెలకువ తెచ్చుకున్న డాక్టర్ వెంటనే అలర్ట్ చేశాడు.

ఎంత నమ్మకంగా డైనింగ్ రూమ్‌లోనుంచి వెళ్ళాడో, అంతకు రెట్టింపు నిరాశతో వెనక్కి వచ్చాడు వెట్టి.

'నాకు తెలుసు. నా జాతకం మంచిది కాదు. నాకు మంచి చేయాలని ఎవరు అనుకున్నా ఏదో ఒక అడ్డంకి వస్తూనే ఉంటుంది. అది నా తలరాత' ముఖాన్ని మళ్ళీ చేతులతో కప్పుకుంటూ ఏడ్వటం మొదలుపెట్టింది ప్రణవి.

డైనింగ్ టేబుల్ దగ్గర ఉన్న కుర్చీల్లో ఒక దానిమీద చతికిలపడుతూ ముఖం మీద ప్రత్యక్షం అయిన చెమట బిందువుల్ని అరచేత్తో అద్దుకున్నాడు వెట్టి.

బాజిరెడ్డిని ఎదుర్కోవటానికి, అతని ప్లానుల్ని భగ్నం చేయటానికి ఎన్నెన్నో ఉపాయాలు ఆలోచించాడు తను. పని చేస్తున్నట్టే చేసి, అంతలోనే ఎందుకూ పనికి రాకుండా పోతున్నాయి అవి. ఎన్ని అవాంతరాలు సృష్టించినా ఆ బాజిరెడ్డి మాత్రం ముక్కుకు సూటిగానే వచ్చేస్తున్నాడు. ఎందుకు ఇలా జరుగుతోంది?

'అబ్బయ్యా... సంపంగి వస్తోంది' ఎందుకో ముఖద్వారం వైపు చూసిన శంకరయ్య ఉన్నట్లుండి హెచ్చరించేసరికి అదిరిపడ్డాడు అతను. చటుక్కున కుర్చీలోనుంచి లేచి, డైనింగ్ రూమ్‌కి ఆనుకుని ఉన్న ఒక గదిలోకి వేగంగా వెళ్ళిపోయాడు.

'ఇప్పుడే వస్తానని చెప్పి ఎక్కడికి పోయావు సంపంగి?' లోపలికి వచ్చిన సంపంగిని విసురుగా శివారెడ్డి భార్య అడగటం వినిపించింది అతనికి.

'ఇంటికి పోతుంటే బాజిరెడ్డిసారు నా కోసం కబురుపెట్టాడు. అక్కడికిపోయి వస్తున్నా' తడుముకోకుండా చెప్పింది సంపంగి.

నివ్వెరపోయారు అందరూ. 'ఎందుకే?' అడిగింది శివారెడ్డి భార్య.

'పఠాన్‌బాబుతో ప్రణవమ్మ పెళ్ళి రేపేనంట' అంటూ బాజిరెడ్డి దగ్గర తను విన్న మాటల్ని చాలా ధైర్యంగా బయటపెట్టింది సంపంగి.

'రేపా? రేపు పెళ్ళి ఎలాచేస్తారు? రేపు మంచి రోజు కూడా కాదు' ఆశ్చర్యంగా అన్నాడు రమణయ్య పంతులు.

అతనో పెద్ద అమాయకుడు అన్నట్లు నవ్వు ముఖంతో చూసింది సంపంగి.

'తాళి కట్టేటప్పుడు మేళాలు మోగించే పెళ్ళికి మంచిరోజులు, ముహూర్తాలు చూస్తారు. పెళ్ళి రిజిస్ట్రారు గారు ఇంటికే వస్తారట. ఆయనే చేయించేస్తాట్ట' అంటూ వారెవరి సమాధానం కోసం ఎదురు చూడకుండా కిచెన్‌వైపు వెళ్ళిపోయింది.

తెల్లగా పాలిపోయాయి డైనింగ్‌రూమ్‌లో ఉన్న వారందరి ముఖాలు. ప్రణవి, ప్రత్యూషలే కాదు శివారెడ్డి భార్య, శంకరయ్య కూడా కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు.

చివాలున కుర్చీలో నుంచి లేచింది పిచ్చమ్మి. నిద్రపోయిన మనిషి బలవంతంగా మేల్కొనటం వల్ల, అటూ ఇటూ తూలింది.

'అమ్మా జాగ్రత్త' అంటూ పట్టుకోబోయిన ప్రత్యూష చేతిని విదిలించి కొట్టి, సూటిగా వెట్టి ఎంటరైన గదిలోకి పోయింది.

గది మధ్యలో కూర్చుని ఉన్నాడు వెట్టి. 'అమ్మ... నాకు వినబడింది. నేను ఆలోచిస్తున్నాను' అన్నాడు ఆమెను చూడగానే.

'మాటలు వద్దు. చేతలు చూపించు' అన్నది పిచ్చమ్మి.

చటుక్కున లేచి డైనింగ్ రూమ్‌లోకి వచ్చాడు అతను. 'మీరెవరూ కంగారు పడకండి. బాజిరెడ్డి నా ఎత్తులన్నిటినీ సర్వనాశనం చేస్తూ ఉండటానికి కారణం తెలిసింది' అంటూ వేగంగా బిల్డింగ్ బయటికి పోయాడు.

'అయ్యయ్యో... అటు పోవద్దు. గేటు దగ్గరే ఉన్నారు జనం.' ఆందోళనగా అంటూ అతన్ని ఆపటానికి ప్రయత్నించాడు శంకరయ్య.

వినిపించుకోలేదు వెట్టి. వేగంగా పోయాడు గేటు దగ్గరికి. గేటు దాటి రోడ్డు మీదికి అడుగు పెట్టగానే పరుగు అందుకున్నాడు.

పదిక్షణాలు పట్టింది అక్కడ ఉన్న బాజిరెడ్డి జనానికి అతన్ని గమనించటానికి. 'పట్టుకోండి.. పట్టుకోండి' అని అరుస్తూ వెంటపడ్డారు.

పట్టుబడే ఆలోచన లేదు వెట్టికి. మరింత వేగంగా పరిగెత్తి తను రోడ్డు పక్కన పార్క్ చేసి వచ్చిన వెహికల్‌ను చేరుకున్నాడు. చిటికెలో స్టార్ట్ చేసి మహావేగంగా వెనక్కి పోనిచ్చాడు.

***

'పిలవండీ.. మన వాళ్ళందర్నీ పిలవండి. ఆ కారు ఎక్కడికి పోతోందో చూడండి' కలత నిద్రలో నుంచి లేచాడు బాజిరెడ్డి. గొంతు చించుకు పోయేటట్టు అరుస్తూ ఆజ్ఞలు ఇచ్చాడు.

అంతకుముందే ఇంటికి తిరిగివచ్చిన పఠాన్ కూడా నిమిషాల్లో మళ్ళీ డ్రసప్ అయ్యాడు. 'ఇవాళ వాడి నెత్తురు కళ్ళ చూస్తాను. వాడు అయిపోయినట్టే' అంటూ వీధిలోకి వచ్చి నిలుచున్నాడు.

తూర్పుదిక్కు ఇంకో రెండు గంటలకు తెల్లబడుతుందనగా, బాజిరెడ్డి ఇంటిముందు గుమికూడారు అతని జనం అందరూ.

'ఫోన్ చేశారా ఎవరైనా హాస్పిటల్‌కి? అక్కడ ఉన్న గ్రానైట్‌మైన్స్ వాళ్ళని రమ్మని కబురు అందించారా?' తను కూడా ఫ్రెషప్ అయివస్తూ అడిగాడు బాజిరెడ్డి.

అతను ఆ మాట మాట్లాడుతూ ఉండగానే మోతలుచేస్తూ దూసుకు వచ్చాయి మూడు వెహికల్స్.

ముందున్న దాంట్లోనుంచి దిగిన వారు బాజిరెడ్డికి తెలుసు. వెనుక ఆగిన వాహనాలలోని వారెవరూ అతనికి తెలియదు.

'మా వాళ్ళు అవసరం పడుతుందని పిలిపించాము' అన్నాడు వారి లీడర్.

యుద్ధానికి బయలుదేరిన సైన్యం మాదిరి వీధినంతా ఆక్రమించుకున్న తనవారిని, ఆ గ్రానైట్ మైన్స్ జనాన్ని ఒకసారి తేరిపార చూసిన బాజిరెడ్డి ఛాతి రెండింతలు అయింది.

'పదింటికల్లా మీకందరికీ విందు భోజనాలు. మా వాడు శివారెడ్డి చెల్లెలిని పెళ్ళి చేసుకోబోతున్నాడు. ఆ చవటను పట్టుకోగానే పెళ్ళి తతంగం మొదలు...' అంటూ పఠాన్‌వైపు చూశాడు.

గంయ్ గంయ్‌మని మోతలు చేస్తోంది పఠాన్ ఫోను. 'హల్లో' అంటున్నాడు అతను చెవిదగ్గర పెట్టుకుని. అవతలి నుంచి వినవచ్చిన మాటల్ని ఆలకించగానే వింతగా ప్రకాశించింది అతని ముఖం.

'వాడు గుడిబజార్లో ఉన్న హోటల్ దగ్గరికి పోయాట్ట. వాడు ఆపిన కారు అక్కడే ఉందిట' అంటూ తమ కారు దగ్గరికి పరిగెత్తాడు.

ఒకదాని తర్వాత ఒకటిగా కదిలాయి వెహికల్స్ అన్నీ. తమ కోసం సిద్ధం చేసిన లారీలో నిలుచున్నారు బాజిరెడ్డి జనం.




***

'ఇప్పుడు నువ్వు మమ్మల్ని ఏం చేయమంటావ్ అబ్బయ్యా?'

వెట్టిని అడిగాడు నిద్ర కళ్ళను నులుముకుంటూ హోటల్ లాబీలోకి వచ్చిన హైమారెడ్డి.

'నేను తిరిగి వచ్చేసరికి సాయం సమయం అవవచ్చు. వెళ్ళిన పని త్వరగా పూర్తికాకపోతే ఇంకా ఆలస్యం కావచ్చు. నేను తిరిగి వచ్చేంతవరకూ మీరు బాజిరెడ్డిని అష్టదిగ్బంధనం చేయాలి. వాడు, వాడి కొడుక్కి శివారెడ్డి చెల్లెల్ని ఇచ్చి ఇప్పటికిప్పుడు రిజిస్టర్ మ్యారేజి జరిపిస్తానంటున్నాడు. ఎట్టి పరిస్థితిలోను అది జరగకూడదు' అన్నాడు వెట్టి.

'పెళ్ళిళ్ళు చేయటానికి కష్టపడాలి గాని, ఆపటానికి హైరాన పడవలసిన అవసరం ఏముంది? అలాగే చేద్దాం. నువ్వు ఎక్కడికి పోతున్నట్టు?' అడిగాడు హైమారెడ్డి.

'నేను తిరిగి వచ్చిన తర్వాత చెపుతాను' అంటూ మాటలు ఆపాడు వెట్టి.

అతను ఏదో చెప్పటానికి సంకోచిస్తున్నట్టు అర్థమై... 'చెప్పు అబ్బయ్యా.. నా దగ్గర మొఖమాటం దేనికి? డబ్బేమైనా అవసరమా?' అడిగాడు హైమారెడ్డి.

తల అడ్డం తిప్పుతూ నవ్వేశాడు వెట్టి. 'డబ్బుతో పని కాదు. వేరే కారణం ఉంది. మీరు పెళ్ళి ఆపటాన్ని శివారెడ్డి సహించకపోవచ్చు. బాజిరెడ్డి మాటనే బలపరచవచ్చు. అయినాసరే... ఆ పెళ్ళి జరగకూడదు' అన్నాడు.

నుదురు రుద్దుకుంటూ తన తమ్ముడివైపు చూశాడు హైమారెడ్డి. 'దానిదేముంది అబ్బయ్యా. మాట సాయమేగా. అలాగే చేద్దాం. అంతగా పట్టుబడితే ఆ పెళ్ళి ఏదో నువ్వు తిరిగి వచ్చిన తర్వాత ఇంకా కాస్త ఘనంగా చేసుకోమందాం' అన్నాడు అతను.

అంతవరకూ పెదవి కదిలించకుండా మౌనంగా నిలబడిన రాకేష్ ముఖంలో రంగులు మారటాన్ని చూసి, చనువుగా అతని భుజం తట్టాడు వెట్టి. 'మరేం పరవాలేదు. నేను నీకు మాట ఇచ్చాను కదా. నిలబెట్టుకోవటానికే ఈ ప్రయత్నం' అన్నాడు.

తన బిడ్డడికి అతను ఇచ్చిన మాట ఏమిటో హైమారెడ్డికి అంతుబట్టలేదు. అతని తమ్ముడికి కూడా తెలియలేదు.

'మీరు ఇందాక ఇచ్చిన వెహికల్‌ని మళ్ళీ తీసుకుపోతున్నా' వారిద్దరికీ వినిపించేటట్టు చెప్పి వీధిలోకి పరిగెత్తాడు వెట్టి. స్టీరింగ్ ముందు కూర్చుని ముందుకు కదిలించబోతుండగా పని చేయకుండా మొరాయిస్తున్న మోకాళ్ళను బలవంతంగా పని చేయిస్తూ వచ్చి అతని పక్కనే సెటిల్ అయ్యాడు రాకేష్.

'నువ్వు ఎందుకు? నువ్వు మీ డాడీతోపాటు –' అంటూ మాట మధ్యలో ఆపి, వెహికల్‌ని వేగంగా హోటల్ పక్కనే ఉన్న ఇంకో వీధిలోకి తీసుకుపోయాడు వెట్టి.

ఆ వెహికల్ వదిలిన పొగ గాలిలో కలిసిపోతున్న సమయంలోనే హోటల్ ముందుకు వచ్చి ఆగింది బాజిరెడ్డి కారు. అతని వెనుకే గ్రానైట్‌మైన్స్ వారి వెహికల్స్. వాటిని అనుసరించి బాజిరెడ్డి జనం పొలోమంటూ వచ్చేశారు.

'ఏడి వాడు? ఎక్కడ? బయటికి లాగండి. లాక్కురండి' బిగ్గరగా కేకలుపెడుతూ హోటల్ లాబీలోకి ఎంటర్ అయి, అదిరిపడ్డాడు బాజిరెడ్డి.

'వెళ్ళండిరా. వెళ్ళి గదులన్నిటినీ వెతకండి' అంటూ తమ అనుచరులకు చెప్పబోతున్న పఠాన్ ఉలిక్కిపడి తన తండ్రి వైపు చూశాడు.

'ఏమప్పా బాజిరెడ్డి... మరీ మనిసివి నల్లపూస అయిపోతివే. ఫోన్లుచేసినా కూడా మాట్లాడ కుండా తప్పించుకు తిరుగుతుంటివే' లాబీలోనే నిలబడి ఉన్న హైమారెడ్డి నవ్వుతూ పలకరించాడు బాజిరెడ్డిని.

'సారూ... మీరు ఇక్కడ కనిపిస్తారని అనుకోనేలేదు' బలవంతంగా ముఖం మీదికి నవ్వు రప్పించుకుంటూ అన్నాడు అతను.

'నిజమేనప్పా! నీకు డబ్బుతో పని పడినప్పుడే మేము ఎక్కడ ఉన్నా ఇట్టే కనిపిస్తూ ఉంటాము. పని లేనప్పుడు మాత్రం కనిపించము' నవ్వుతూనే అన్నాడు హైమారెడ్డి.

బాజిరెడ్డి డైలమా అతని జనానికి అర్థం అయిందిగాని, గ్రానైట్‌మైన్స్ వాళ్ళకి అంతుబట్ట లేదు.

'కుశల ప్రశ్నలు తర్వాత వేసుకుందాం. ముందు పైకిపోయి, ఆ చవటని కిందికి లాక్కు రావాలి. ఆలస్యం దేనికి? ఖంగుమంటున్న కంఠంతో అడిగాడు వారి లీడర్.

'ఎవరప్పా వాళ్ళు? గ్రానైట్‌మైన్స్ వాళ్ళేనా?' అమాయకంగా అడిగాడు హైమారెడ్డి.

తడబడుతూనే తల ఊపాడు బాజిరెడ్డి.

'ఈళ్ళు ఈడ ఏంజేస్తున్నారు? మళ్ళీ ఎవరినైనా ఎత్తుకుపోయి మైన్స్‌లో పడేయటానికి చూస్తున్నారా?' మళ్ళీ అడిగాడు ఆయన.

ఈసారి తెల్లబోయి చూడటం గ్రానైట్‌మైన్స్ వాళ్ళ వంతు అయింది.

'వాళ్ళతో మనకి పరాచికాలు దేనికన్నా? మనం ఇక్కడ ఉండగా ఎవరూ ఎవరినీ ఎత్తుకు పోవటం జరగదు. వెళ్ళిపొమ్మని చెప్పు. మనం ఇక్కడినించి అవతలికి పోయిన తర్వాత వాళ్ళ ఏడుపులు ఏవో ఏడ్చుకోవచ్చు' ఉన్నట్లుండి కల్పించుకుంటూ చెప్పాడు హైమారెడ్డి తమ్ముడు.

తటపటాయించాడు బాజిరెడ్డి. గ్రానైట్‌మైన్స్ జనం మాత్రం వెనుకంజ వేయలేదు. 'మాకు కావాల్సిన ఒక మనిషి ఈ హోటల్లో కొచ్చాడు. వాడిని మేము పట్టుకు తీరాలి. అంతే' అంటూ ముందుకు అడుగువేయబోయాడు వారి లీడర్.

హైమారెడ్డి కంటే ముందుగా కదిలాడు అతని తమ్ముడు. పిడికిలి బిగించి బలంగా ముఖం మీద కొట్టాడు.

బిగ్గరగా అరిచే వ్యవధి కూడా లేకపోయింది. మూరెడు ఎత్తున ఎగిరి వెనక్కిపడిపోయాడు ఆ మనిషి.

'మీరు ఎవరో, ఏం చేస్తూ ఉంటారో, ఇప్పుడు ఎవరికోసం వచ్చారో మాకు తెలుసు. మర్యాదగా వచ్చినదారినే వెనక్కి వెళ్ళిపోండి. కాదు కూడదని మారాం చేస్తే మీ శవాలు వెనక్కి పోతాయ్. ఆలోచించుకోండి' రెండు అడుగులు ముందుకు వేస్తూ అన్నాడు హైమారెడ్డి తమ్ముడు.

పడిపోయిన తమ లీడర్ వంకా, అతనివంకా మార్చిమార్చి చూశారు ఆ జనం. తమ దుస్తుల్ని తడుముకున్నారు వారిలో చాలామంది.

'మీరు మాట్లాడుతోంది కడప హైమారెడ్డితో... బాగా గుర్తు పెట్టుకోండి..' మరోసారి వారిని హెచ్చరించాడు రాకేష్ బాబయ్య.

ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ బొమ్మల మాదిరి నిలుచుండిపోయారు వారందరూ. 'బాజిరెడ్డి సారూ' అంటూ అతన్ని పలుకరించాడు హైమారెడ్డి.

ఉలికిపాటు కప్పిపెట్టుకుంటూ ఆయన కేసి చూశాడు బాజిరెడ్డి.

**(ఇంకావుంది)**

# హెపటైటిస్‌ను అడ్డుకోవడం సాధ్యమే

ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం ప్రతి ఏటా 6 నుంచి 10 లక్షల మంది హెపటైటిస్ బీ, సీ వ్యాధుల వల్ల మృత్యువాత పడుతున్నారు. హె పటైటిస్ బీ, సీ వ్యాధులు చాలా ప్రమాదకరమైనవి. ఇవి ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తాయో అప్పుడు తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంది. అంతవరకు ఈ వ్యాధులు సోకాయో లేదో అన్న విషయం రోగికి కూడా తెలియదు. రక్తపరీక్ష చేసినపుడో లేదా శస్త్ర చికిత్స చేసే ముందో ఈ వ్యాధులు సోకినట్లు హఠాత్తుగా బయటపడుతుంది.

**లక్షణాలు :** హెపటైటిస్ బీ వ్యాధి బయటపడటం చాలా ఆలస్యంగా జరుగుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత కూడా వ్యాధి బయటపడవచ్చు. వాంతి వచ్చినట్లుగా వికారంగా ఉండటం, వాంతులు రావడం. ఆకలి వేయక పోవడం, ఆహారం సహించకపోవడం. మూత్రం పసుపు రంగుతో, కళ్లు పచ్చగా ఉండటం ఉండటం.స్వల్పంగా జ్వరం, వొళ్లు నొప్పులు ఉండటం.తాలింపు వేసినప్పుడు వాంతి వచ్చినట్లు గా ఉంటుంది. అయితే దీన్ని బట్టి కామెర్లు అని మాత్రం భావించకూడదు. ఆర్టరీస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లెట్స్ కౌంట్ పడిపోవడం, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగు తుంది. కొన్ని సార్లు లివర్ కేన్సర్‌కు కూడా దారితీస్తుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బీ, సీ వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోమందుల ద్వారా అడ్డుకోవచ్చు. పెరిగిన వైరల్ లోడ్‌ను మన రోగనిరోధక వ్యవస్థ ద్వారా సమర్థంగా అడ్డుకోవడంలో సహకరిస్తుంది.

# హెర్పిస్ మళ్లీ తిరిగి రాదు

లైంగిక వ్యాధులను దాయడం, చికిత్సకు దూరంగా ఉండిపోవడం వల్ల జరిగే నష్టం అంతా ఇంతా కాదు. దాంపత్యజీవితంపై దాని ప్రభావం ప డటమే కాకుండా మానసికంగా కోలుకోలేని విధంగా చేస్తుంది. అటువంటి వాటి లైంగిక వ్యాధుల్లో ముఖ్యమైనది హెర్పిస్. చాలా మంది ఈ వ్యాధి గురించి చెప్పుకోవడానికి వెనకంజ వేస్తారు. ఈ వ్యాధికి పూర్తికాలం చికి త్స తీసుకోకపోతే మళ్లీ తిరగబెడుతుంది. ఇతర చికిత్సలతో పెద్దగా ప్రయోజనం కూడా ఉండదు. అయితే హోమియో చికిత్స మాత్రం హెర్పి స్‌ను సమూలంగా దూరం చేసి సుఖమయ జీవితాన్ని తిరిగి అందిస్తుం ది. పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. లైంగిక కలయిక ద్వారా వచ్చే హెర్పిస్ వ్యాధి తగ్గినట్లే తగ్గి రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపించవచ్చు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**హోమియో చికిత్స**

హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

# ఎయిడ్స్‌ను అణిచే వైద్యం

హెచ్‌ఐవి పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి. హెచ్‌ఐవి అంటే రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీయడం ద్వారా అవకాశవాద వ్యాధులు వచ్చేలా చేస్తుంది. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్‌ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

**లక్షణాలు కనిపించడానికి :** హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభవవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి.

**హోమియో చికిత్స**

హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హోమియో మందులు సక్రమంగా తీసుకుంటే హెచ్‌ఐవి ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారదు.

# శృంగారంలో విఫలమవుతున్నారా?

**శీఘ్రస్ఖలనం :** పురుషులు ఎదుర్కొనే సమస్యలలో అతి ముఖ్యమైనది శీఘ్రస్ఖలన సమస్య. ఇది మానసికంగా కుంగదీస్తుంది. శృంగారంలో ఆనందం అంచులు చూడకముందే స్ఖలనం జరగడం అనేది చాలా మంది పురుషుల్లో కనిపిస్తుంది. ఎక్కువ మంది రెండు నిమిషాలలో స్ఖలనం జరిగిపోతోందని చెబుతుంటారు. ఈ సమస్య చాలా మంది దంపతుల మధ్య అగాధాన్ని, ఆందోళనలను పెంచుతుంది.

**అంగస్తంభన సమస్య :** పడకగదిలో ప్రవేశించగానే తెలియని భయం. ఈ రోజు కూడా విఫలమవుతానేమోనన్న ఆందోళన, వెరసి శృంగారం జీవితంలో అసంతృప్తి. పెళ్లయిన మూడు రోజులకే విడిపోయే పరిస్థితి. భార్యను సుఖపెట్టలేకపోతున్నానని తన మీద తనకే అసహ్యం. ఈ పరిస్థితి చాలా మంది శృంగార జీవితాల్లో కనిపిస్తుంది. అయితే ఇలాంటి సమస్యలన్నీ హోమియో చికిత్సతో దూరమవుతాయి.

**నపుంసకత్వం :** శృంగారానికి తగినంత విధంగా అంగం స్తంభించకపోవడం లేదా స్తంభించినా మధ్యలో మెత్తబడటం జరుగుతుంటుంది. దీనినే ఇంపోటెన్సీ అంటారు. ఎప్పుడైనా ఒకటి రెండు సార్లు ఈ సమస్య ఎదురయితే సీరియస్‌గా తీసుకోవలసిన అవసరం లేదు. శృంగార జీవితంలో 50 శాతం పైగా ఇలాంటి ఇబ్బందులు ఏర్పడినపుడు సమస్య ఉందని భావించాలి.

**హోమియో చికిత్స :** మూలకారణాన్ని తెలుసుకుని చికిత్స ఇస్తే మంచి ఫలితం ఉంటుంది. మానసిక కారణాలున్నాయా? శారీరక కారణాలు న్నాయా? ముందుగా తెలుసుకోవాలి. కారణమేదైనా హోమియో మందులు సమస్యను తొలగించి శృంగార జీవితం సాఫీగా జరిగేలా చేస్తాయి. బాధపడుతూ కూర్చోకుండా హోమియో వైద్యులను కలిసి చికిత్స తీసుకుంటే ఫలితం ఉంటుంది.




# కంసుడుగా కాలనేమి:వసుదేవుడుగా కశ్యపుడు

**బ్రహ్మదేవుడు వినిపించిన కథనానికి దేవతలంతా ఆనందించారు. అతన్ని అనేక విధాల ప్రశంసించి, అభినందించారు. అంతలో అక్కడకి నారదుడు వచ్చాడు. అతని రాకకు ఆశ్చర్యపోయారు దేవతలు. రాదగిన సమయంలోనే వచ్చాడని నమస్కరించారతనికి. సకలలోక సదాహితైషి నారదుడు వస్తూనే విష్ణుదేవునికి నమస్కరించాడు. అతని సమీపంలో కూర్చున్నాడు. తన మనోజ్ఞమైన వీణాగానంతో సభాసదులందరినీ ఆనందింపజేశాడు. విష్ణుదేవుడు కూడా ఆ వీణాగానానికి మైమరచి కళ్ళు మూసుకున్నాడు. కాస్సేపటికి వీణాగానాన్ని ఆపి, విష్ణుదేవుణ్ణి ఉద్దేశించి అన్నాడిలా నారదుడు.**

లోకాధినాయకా!

కళ్ళు తెరచి చూశాడు విష్ణుదేవుడు.

మతిమంతులలోనూ, మహాశక్తిమంతుల్లోనూ నువ్వు ప్రథముడివి! మహాధైర్యశాలివి! ఈ లోకం అంతా నీ లీలావిలాసం. నువ్వు తక్షణం నీ అంశతో భూలోకంలో అవతరించాలి. అవతరించని పక్షంలో ఈ దేవతలంతా అక్కడ అవతరించడం అనవసరం. దివ్యాంశతో నువ్వు భూమిపై అవతరించినప్పుడే ఈ దేవతలకు కూడా రక్షణ దొరుకుతుంది. దుష్టశిక్షణ నీ వల్లే జరగాలి. నువ్వే అందుకు సమర్థుడివి!

సన్నగా నవ్వుతూ చూడసాగాడు విష్ణువు.

విష్ణుదేవా! ఈ సందర్భంలో నీకొక విషయం చెప్పాల్సి ఉన్నది. భూలోకంలో క్షత్రియవినాశనమే కాదు, మీరంతా మరొక కార్యం కూడా చేయాల్సి ఉన్నది. ఆ కార్యం నీవు లేకుండా ఈ దేవతలు చేయలేరక్కడ. ఆ విషయం చెప్పేందుకే నేను ఇక్కడకు వచ్చాను. దయచేసి నా విజ్ఞప్తి విను.

చెప్పు అన్నట్టుగా కళ్ళెగరేశాడు విష్ణువు. చెప్పసాగాడిలా నారదుడు.

తారకామయుని సంగ్రామంలో నువ్వు సంహరించిన దానవులందరూ తిరిగి మర్త్యలోకంలో జన్మించారు. జన్మించి, యజ్ఞయాగాదులకు అంతరాయాలు కలిగిస్తున్నారు. రామావతారంలో రావణవధానంతరం అతని మేనల్లుడు లవణాసురుడు యమునాతీరంలో ఓ అరణ్యంలో దాగున్నాడు. అక్కడ మునులందరినీ అనేక విధాల హింసించాడు. వాడు మధురాక్షసుని కుమారుడు. బలపరాక్రమశాలి. లవణాసురుని బాధలు భరించలేక, అక్కడి మునులంతా రాముణ్ణి ఆశ్రయించారు. రక్షించమని వేడుకున్నారు. రాముడు అప్పుడు లవణాసురుణ్ణి వధించమని శత్రుఘ్నుణ్ణి ఆదేశించాడు.

అన్న ఆజ్ఞ శిరసావహించి లవణాసురునిపై దాడి చేశాడు శత్రుఘ్నుడు. వధించాడతన్ని. అక్కడి అరణ్యాన్ని నిర్మూలించాడు. ఆ స్థానంలో మనోహరనగరాన్ని నిర్మించాడు. మధుదైత్యుని వనం నిర్మూలించి నిర్మించిన కారణంగా ఆ నగరాన్ని అంతా 'మధుర' అని వ్యవహరించారు. ఆ నగరం ఇప్పుడు ఉద్యానవనాలతో, తటాకాలతో, గోపురాలతో, ప్రజాసమూహాలతో కళకళలాడుతోంది. తారకామయసంగ్రామంలో ముఖ్యుడైన రాక్షసుడు కాలనేమి, ఇప్పుడు భోజవంశీయుడైన ఉగ్రసేనునికి కుమారుడై జన్మించాడు. కంసుడు అతనిపేరు. పూర్వజన్మ దుష్టప్రవృత్తి ఇప్పుడు అతనిలో రెట్టింపు అయింది. రాజుగా జన్మించినా రాచగుణం ఒక్కటికూడా లేదు. పూజార్హులైనా బంధువులను దరి చేరనీయడం లేదు. ప్రత్యక్షకాలాంతకునిలా ప్రవర్తిస్తున్నాడు. ప్రజలను భయభ్రాంతుల్ని చేస్తున్నాడు. అతని రాక్షసకృత్యాలకు ముల్లోకాలూ అట్టుడుకుతున్నాయి. కన్నతండ్రినే కారాగారంలో బంధించాడతను.

ఇక హయగ్రీవుడు అన్న రాక్షసుడు, గుర్రం రూపుతో తిరిగి 'కేశి' అనే దానవునిగా జన్మించి, భూలోకాన్ని అతలాకుతలం చేస్తున్నాడు. అలాగే బలిపుత్రుడు అరిష్టుడు తిరిగి, వృషభాకారంలో అరిష్టరాక్షసుడై జన్మించాడు. శంబరాసురుడు గాడిదరూపుతో ధేనుకుడై జన్మించాడు. లంబాసురుడు ప్రలంబకుడై జన్మించాడు. నిశుంభుడు కువలయాపీడం అన్న దుష్టమత్తేభంగా జన్మించాడు. వరాహ కిశోరులిద్దరూ చాణూర ముష్టికులు అన్న మల్లులుగా జన్మించారు. ఆనాడు కాలనేమి సహచరులైన వీరంతా నేడు కంసునికి సహచరులైనారు. యమునానదీతీరంలో అడ్డూ అదుపులేక సంచరిస్తున్నారు.

యముడు, తారుడు అన్న రాక్షసులిద్దరూ ప్రాగ్జ్యోతిషపురంలో మురాసురునికి కుమారులై జన్మించారు. వారు నరకాసురునికి తోడునీడగా ఉన్నారు.

ఏ ఏ రాక్షసులు మళ్ళీ ఎలా ఎలా జన్మించిందీ తెలుసుకుని దేవతలంతా భయభ్రాంతులైనారు. గుండెలమీద చేతులుంచుకుని, ఒకరినొకరు చూసుకున్నారు.

విష్ణుదేవా! ఆ రాక్షసులంతా నీ పేరు ఉచ్చరించగానే భగ్గున మండిపడుతున్నారు. నీ మహిమలూ, నీ గుణగణాలూ విన్నంతనే పట్టరాని కోపంతో ఊగిపోతున్నారు. నీ భక్తుల్ని అనేక విధాల హింసిస్తున్నారు. కాబట్టి ఇక ఆలస్యం చెయ్యకు, అత్యవసరంగా భూతలిమీద అవతరించు. అవతరించి, ఈ భూదేవిబాధను తొలగించు ప్రార్థించాడు నారదుడు. సరేనన్నట్టుగా తలూపి అన్నాడిలా విష్ణుదేవుడు.

నారదా! నువ్వు చెప్పిన ఆ రాక్షసులందరినీ నేను ఓ కంట కనిపెడుతూనే ఉన్నాను. వారే కాదు, వారికన్నా క్రూరాత్ములు మరికొందరు ఉన్నారు. వారిలో కాలయవనుడు, జరాసంధుడు, శిశుపాలుడు ముఖ్యులు. వారంతా సాధుజనుల్ని అనేక విధాల హింసిస్తున్నారు. ఆ దుర్మార్గుల అంతు నేను చూడక తప్పదు. అందుకే భరతవంశంలో ప్రళయంవంటి కలహం పుట్టించి, అందరినీ సంహరించి, ఈ భూదేవి బరువు తొలగిస్తాను.

విష్ణుదేవుని మాటలకు జేజేలు పలికారు దేవతలు.

లోకపితామహుడు ఈ బ్రహ్మదేవుడు, జీవుల జననాల నిర్ణాయకుడు. నేను ఏ రీతిలో అవతరించాలో ఈతడు చెబితే నేను అలాగే భూలోకంలో జన్మిస్తాను అన్నాడు విష్ణుదేవుడు. అతని మాటలకు ఓ క్షణం మౌనం వహించాడు బ్రహ్మదేవుడు. తర్వాత అన్నాడిలా.

విష్ణుదేవా! ఒకప్పుడు అవసరం అని సముద్రుని గోవులు చాలా వాటిని తీసుకున్నాడు కశ్యపముని. తిరిగి ఇవ్వలేదతనికి. అప్పుడు సముద్రుడు నన్ను సమీపించాడు. బ్రహ్మదేవా! కశ్యపముని నా గోవులను తీసుకున్నాడు. ఇవ్వలేదు. వెళ్ళి అడిగితే ఇస్తానిస్తానంటూ నీళ్ళు నములుతున్నాడు. అతని పత్నులు అదితి, సురభి కల్పించుకుని, ఇవ్వలేమని తెగేసి చెప్పారు. యజ్ఞయాగాలకు నాకు ఆ గోవులు అత్యవసరం. పైగా అవి మామూలు గోవులు కావు. చాలా ప్రభావం కలవి. ఆ ప్రభావంతో అవి నా తరంగాలలో స్వేచ్ఛగా సంచరిస్తూ నాకు శుభాలు కలిగిస్తున్నాయి. అటువంటి గోవులు నాకు అందకుండాపోయాయి. తపస్సంపన్నుడైన కశ్యపమునికేగాని, ఇంకెవరికీ ఆ గోవులు చిక్కేరకం కాదు. ఆఖరికి అతనికే చిక్కి, నాకు దూరమైనాయి అంటూ బాధపడ్డాడు. ధర్మాన్ని సంరక్షించమని వేడుకున్నాడు. అప్పుడు నాకు కశ్యపునిపై చాలా కోపం వచ్చింది. ఆపై ఆ గోవులతో దేవకార్యం నెరవేరగలదని కూడా అనుకున్నాను.

ఏ బుద్ధితోనైతే కశ్యపముని నీ గోవులను అపహరించాడో అదే బుద్ధితో భూలోకంలో అతను త్వరలోనే అవతరిస్తాడు. అలాగే అతని భార్యలు కూడా అవతరిస్తారు. తగినశిక్ష అనుభవిస్తారన్నాను. ఆనం

**కంసమహారాజు సభకు వెళ్ళాడు నారదుడు. అతణ్ణి రత్నసింహాసనంపై కూర్చోబెట్టి సత్కరించాడు కంసుడు. ఆనందించిన నారదుడు, మహారాజా! మేరుపర్వతం మీద బ్రహ్మ సహా వేలుపులంతా కూడి సమాలోచనలు చేస్తున్నారు. ఆ సంభాషణంతా నేను జాగ్రత్తగా విన్నానని చెప్పాడు. మేరు పర్వతంమీద జరిగిన ఆ సంభాషణ ఏమిటి? కంసుడికి నారదుడు ఇంకా ఏం చెప్పాడు?**



దించాడు సముద్రుడు. వెళ్ళిపోయాడు.

నాటి నా శాపఫలితంగా కశ్యపుడు ఇప్పుడు వసుదేవుడుగా వసుధపై అవతరించాడు. అధీశ్వరుడై కంసుని గోసంపదను పాలిస్తున్నాడు. అతని పత్నులిద్దరూ దేవకి, రోహిణిగా జన్మించారు అని ఆగాడు బ్రహ్మ. విష్ణుదేవుణ్ణీ, దేవతలనీ మార్చి మార్చి చూశాడు.

కొంత అర్థమై, అర్థంకానట్టుగా ఉంది కథనం. ఉత్సుకతగా ఉంది. బ్రహ్మ చెప్పబోయేది వినేందుకు ఉత్కంఠగా ఉన్నారు దేవతలంతా. అప్పుడు మళ్ళీ చెప్పాడిలా బ్రహ్మదేవుడు.

విష్ణుదేవా! ఇక నీ దివ్యాంశాన్ని రెండు భాగాలుగా విభజించు. ఆ రెండు భాగాలతో వేరువేరుగా అవతరించి, యాదవకులవంశానికి శోభకలిగించు. సముద్రుడి గోవులన్నీ నీకోసం మధురలో ధేనువులై జన్మిస్తాయి. నువ్వు వాటికి పరిపాలకుడవై, గోపాలక చూడామణివై విహరించు. నీ ముగ్ధమోహన బాలగోపాల స్వరూపం అబాలగోపాలనికీ ఆనందదాయకం అవుతుంది.

సరేనన్నట్టుగా సన్నగా నవ్వుతూ తలూపాడు విష్ణుదేవుడు. దేవతలందరినీ వీడ్కొన్నాడు. పాలకడలిని చేరుకున్నాడు.

నారదుడు మధురానగరంలో ప్రవేశించాడు. కంసుని సభాభవనం సింహద్వారం దగ్గర నిలిచాడు. ద్వారపాలకులు నారదుణ్ణి గమనించి, పరుగున కంసుణ్ణి సమీపించారు. నారదుని రాక తెలియజేశారతనికి. కంసుడు ఆనందంగా నారదునికి ఎదురేగాడు. అతనిని సభాభవనంలోనికి ఆహ్వానించాడు. తోడుకుని వచ్చి రత్నసింహాసనంపై కూర్చోబెట్టాడు. అర్ఘ్యపాద్యాదులు సమర్పించాడు. నమస్కరించి నిలిచాడు. ఆనందించాడు నారదుడు. చెప్పాడిలా.

కంసమహారాజా! పుణ్యతీర్థాలు సేవించి, మేరుగిరి చేరుకున్నప్పుడు అక్కడ నేనొక వింత గమనించాను. బ్రహ్మసహా వేలుపులంతా అక్కడ కూర్చుని ఏకాగ్రంగా దేని గురించో ఆలోచిస్తున్నారు. చర్చిస్తున్నారు. నేను జాగ్రత్తగా ఆ మాటలు విన్నాను. నీ సంహారానికి వారంతా సిద్ధమవుతున్నారు.

మహామునీ అంటూ ఆగ్రహాందోళనలు చెందాడు కంసుడు.

ఆగు అన్నట్టుగా చేసైగ చేసి, మళ్ళీ ఇలా చెప్పాడు నారదుడు.

నీ పెదతండ్రి కుమార్తె దేవకీదేవి ఎనిమిదవ గర్భం నీకు దారుణమృత్యుహేతువు అవుతుంది. ఇందులో ఇసుమంత అనుమానం కూడా లేదు. దేవకీదేవి గర్భవాసం నుండి అవతరించే మహనీయుడు దేవతలకు ఆప్తుడు. అఖిలాధారుడు. సమస్తలోక స్వరూపుడు. అతడెవ్వడన్నది నేను నీకిప్పుడు చెప్పలేను. త్వరలోనే అన్నీ నువ్వే తెలుసుకుంటావు.

కసిగా, కోపంగా చేతులు నలుచుకోసాగాడు కంసుడు.

ఈ క్షణం నుంచి నిన్ను నువ్వు కాపాడుకో! అలాగే నీ ఐశ్వర్యాన్నంతా దానధర్మాలకోసం, యధేచ్ఛా భోగాలకోసం ఖర్చు చెయ్యి. ఇప్పుడిదే నీ కర్తవ్యం. నీ మీది ప్రేమతోనే నీకిదంతా చెప్పాను. అన్యధా భావించకు అన్నాడు నారదుడు. అక్కణ్ణుంచి నిష్క్రమించాడు.

నారదుడు అక్కణ్ణుంచి నిష్క్రమించే వరకూ ఊరుకున్నాడు కంసుడు. అతడటు నిష్క్రమించగానే కంసుడు ఇటు సభాసదుల్ని చూసి, వికటాట్టహాసం చేశాడు. గొంతెత్తి గర్జించాడిలా.

పదిమందితో పరిచయం ఉన్నదని, చాకచక్యం కలవాడని ఈ నారదుణ్ణి చేరదీస్తే ఇలా మాట్లాడతాడేంటి? నా బలపరాక్రమాలు తెలియక మాట్లాడాడు. తెలిస్తే ఇలా మాట్లాడేవాడు కాదు. ఆ బ్రహ్మాది దేవతల్ని నేను గడ్డిపోచకన్నా హీనంగా చూస్తానన్నది ఈ నారదునికి తెలియదేమో! ముల్లోకాల్లోని వారూ నా వైపు కన్నెత్తి చూడగలరా? చూసి జీవించగలరా? నాకు కోపం రాకూడదు. వచ్చిందంటే ఈ భూతలిని నా కర్కశపాదఘాతాలతో పిండిపిండి చేస్తాను. స్వర్లోకాన్నీ, దిక్కుల్నీ నా పిడికిటిపోట్లతో తుత్తునియలు చేస్తాను. గట్టిగా కేకేస్తే చాలు, సూర్యచంద్రులూ, వాయుదేవుడూ వజవజావణికిపోతారు. కొండలు పగిలినా, సముద్రాలు ఇంకినా నా పరాక్రమం ఆగదు.

ఆగదుగాక ఆగదు అన్నారు సభాసదులు. అంతా కంసునికి జేజేలు పలికారు. కాస్సేపు మౌనం వహించాడు కంసుడు. తర్వాత మళ్ళీ సభలోని ప్రముఖుల్ని ఉద్దేశించి మాట్లాడాడిలా.

నారదుడు కలహాశీలుడు. అతని కాలూ నోరూ నిలవదు. అక్కడా ఇక్కడా తిరుగుతూ నోటికి వచ్చినట్లల్లా మాట్లాడి, విరోధాలు కల్పిస్తాడు. యుద్ధాలు రేకెత్తిస్తాడు. అది ఆ బక్కతాపసికి వినోదం అని ఆగాడు కంసుడు. ఆలోచనలో పడ్డాడు. కాసేపు ఆలోచించి, చెప్పాడిలా.

ఏదేమైనా నారదుడు మాటల్ని కొట్టిపారేయలేం. జాగ్రత్తపడక తప్పదు. మన అరిష్టకేశి, ప్రలంబుడు, ధేనుకుడు, పూతన, కాళియుడు మొదలైనవారందరినీ హెచ్చరించండిలా.

యాదవవంశం వల్ల మనకు ఆపాయం రానున్నదని నారదుడు చెప్పాడు. ఆ వంశవిరోధులు మనకు తారసిల్లితే అక్కడకక్కడే మట్టుబెట్టమనండి! అలాగే నారదుని మాటలు పట్టుకుని మీరంతా భయపడనక్కరలేదు. ఎప్పటిలాగే భోగాలపారవశ్యంతో ఖైమరచి సుఖించండి! నన్ను నమ్ముకున్నవారికి ఎలాంటి ఆపదా రాదు, రానివ్వను.

సభ చాలించాడు కంసుడు. అంతఃపురానికి చేరుకున్నాడు. అక్కడ ఆప్తులందరినీ చేరదీశాడు. చెప్పాడిలా వారికి.

ఈ రోజు నుంచి మీరంతా దేవకీదేవిని ఓ కంటకనిపెట్టండి! అలాగే ఆ వసుదేవుని ఆనుపానులు కూడా కనిపెట్టండి. దేవకి గర్భం దాల్చిందని తెలిస్తే వెంటనే నాకు తెలియజెయ్యండి. నెలలు లెక్కపెట్టి మరీ చెప్పండి. నా హితం కోరినవారైతే క్షణక్షణం అప్రమత్తంగా ఉండండి. ఈ విషయం రెండోకంటికి తెలియకూడదు. మంత్రతంత్రాలతో, రకరకాల ఔషధాలతో, ఉపాయాలతో, గట్టి పట్టుదలతో తలపెట్టిన పని ఏదైనా నెరవేరకుండాపోదు. ఆ భగవంతుడు కూడా దాన్ని అడ్డుకోలేడు.

అవునవునన్నారు ఆప్తులు. చెప్పిందానికి అలాగే నన్నట్టుగా తలలూపారు.

దేవకీగర్భ విధ్వంసం తప్పదు. తనని ఎదిరించేవాడు పుట్టడు, పుట్టబోడు అనుకున్నాడు కంసుడు. ఆ ధైర్యంతో గుండెల మీద చేయి వేసుకుని ఆ రాత్రి హాయిగా నిద్రపోయాడు.

—అరణి






# ఏ గాలి ఎటు వీస్తోంది!

- రాజశుక

**తమిళనాడులో అన్నాడీఎంకేతో స్నేహానికి శతవిధాలా ప్రయత్నిస్తున్న బీజేపీ ప్రస్తుతానికి పన్నీర్ సెల్వంను గట్టిగా నమ్ముకుని ఉంది.**

తమిళనాడులో అన్నాడీఎంకే వర్గాల మధ్య విభేదాలను తనకు అనుకూలంగా మార్చుకుని లబ్ధి పొందాలని బీజేపీ విశ్వ ప్రయత్నం చేస్తున్నట్టు కనిపిస్తోంది. రెండు వర్గాలుగా చీలి, వీధులకెక్కి పోరాడుతున్న అన్నాడీఎంకే వర్గాలను ఏదో ఒక వ్యూహం ద్వారా కలిపేసి, అంటే విలీనం చేసి నయానో, భయానో లేక ఇతర సామ దాన భేద దండోపాయాల ద్వారానో తన గుప్పిట్లో పావులాగా మార్చుకోవడానికి బీజేపీకి ఇంతకన్నా మంచి సమయం దొరికేలా లేదు. నిజానికి చాలా ఏళ్ళ నుంచీ అనేక సందర్భాలలో అన్నాడీఎంకేతో చెలిమి కోసం బీజేపీ ఎన్నో ప్రయత్నాలు చేసింది. అయితే, తమిళనాడులో బీజేపీకి ఉన్న అపఖ్యాతి అది మత తత్వ పార్టీ. ఆ కారణంగా బీజేపీతో చేతులు కలప డానికి డీఎంకేనే కాకుండా అన్నాడీఎంకే సైతం వెనుకాడుతూ వస్తోంది. ఎప్పుడు చెలిమి చేసినా అది ఎన్నికల నాటికి తెగిపోతూ వస్తోంది.

నిజానికి 2009 తర్వాత నుంచి అన్నాడీఎంకేతో స్నేహానికి బీజేపీ చేయని ప్రయత్నం లేదు. 2014 ఎన్నికల తర్వాత నరేంద్ర మోదీ అధికారంలోకి వచ్చిన తరువాత బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా, మోదీ కలిసి ఆ పార్టీని తమవైపు తిప్పుకోవడానికి శతవిధాలా ప్రయత్నిస్తూనే ఉన్నారు. కానీ ఎంత చేసినా ఈ రాజకీయ ప్రేమ ఫలించలేదు. ఏకపక్షం గానే మిగిలిపోతూ వచ్చింది. ఈ ప్రేమ వ్యవహారం అనేక మలుపులు తిరుగుతూ వస్తోంది. 2014 సెప్టెంబర్ 27న బెంగళూరు కోర్టు అప్పట్లో అన్నాడీ ఎంకే ప్రధాన కార్యదర్శి, ముఖ్యమంత్రి అయిన జయలలితకు 'ఆదాయాన్ని మించిన ఆస్తుల కేసులో శిక్ష విధించినప్పుడు, బీజేపీ ఓ తప్పటడుగు వేసింది. కోర్టు తీర్పు ఆమెకు ప్రతికూలంగా వచ్చినప్పుడు కొద్దిగా అయినా విచారం, సానుభూతి ప్రకటించాల్సింది పోయి, బీజేపీ నాయకులు హర్షం వ్యక్తం చేస్తూ ప్రకటనలు గుప్పించారు. అంతవరకూ తాము ఆమె కటాక్ష వీక్షణాలకు పాకులాడిన విషయం బీజేపీ నాయకులు మరచిపోయినట్టు కనిపించింది. ఆ తర్వాత నుంచి బీజేపీ నాయకుల బాణీ మారింది!

తీరా జయలలితకు శిక్ష పడింది. ఆమె ముఖ్య మంత్రి పదవికి రాజీనామా చేసి, తన స్థానంలో తాత్కాలికంగా తన నమ్మినబంటు ఓ. పన్నీరు సెల్వంను ముఖ్యమంత్రిగా నియమించారు. ఆమె జైల్లో ఉండడంతో తమిళనాడు రాజకీయాలలో ఏదో శూన్యం ఏర్పడిందనీ, ఈ శూన్యాన్ని తామే భర్తీ చేయగలమనీ బీజేపీ భావించింది. దీని కోసం ఆ పార్టీ పడిన ఆత్రం, హడావిడి అంతా ఇంతా కాదు. ఆమె పరమ అవినీతిపరురాలని వ్యాఖ్యానించింది. ఆమె ప్రభుత్వంలోని లొసుగులు, లోపాలను ఒక్క టొక్కటిగా బయటికి తీసి విమర్శలు, ఆరోపణలు చేయడం ప్రారంభించింది. బీజేపీలోనే కొందరు నాయకులు ఆమె మీద విమర్శనాస్త్రాలు సంధిస్తుం డగా, మరికొందరు నాయకులు ఆమెకు ఆగ్రహం తెప్పించకూడదన్న ఉద్దేశంతో, సానుభూతి కూడా వ్యక్తం చేయడం మొదలుపెట్టారు. ఈ వ్యవహారం చాలా కాలం పాటు కొనసాగింది.

అయితే, 2015 మే 11న కర్ణాటక హైకోర్టు తమ కింది కోర్టు తీర్పును కొట్టేసింది. ఆమె నిర్దోషి అని ప్రకటించి విడుదల చేసింది. దాంతో స్థానిక బీజేపీ నాయకులు మళ్ళీ తమ పాటను మార్చక తప్ప లేదు. ఆమె ముఖ్యమంత్రిగా మళ్ళీ అధికారంలోకి వచ్చిన తరువాత ప్రధాని నరేంద్ర మోదీ ఆమెను అభినందిస్తూ సందేశం పంపించారు. ఈ విషయంలో తానేమీ వెనుకబడి ఉండలేదన్నట్టు, తమిళనాడు రాష్ట్ర బీజేపీ అధ్యక్షుడు తమిళిసై సౌందర్రాజన్ కూడా ఆమెను అభినందిస్తూ సందేశం జారీ చేశారు. "ఆమె గత చరిత్ర ఎలా ఉన్నప్పటికీ, ప్రజల ముఖ్య మంత్రికి కోర్టు ఎంతో ఉపశమనం కలిగించింది" అని ఆయన తన సందేశంలో పేర్కొన్నారు. ఆ తరు వాత నుంచీ పలువురు రాష్ట్ర బీజేపీ నాయకులు ఆమెకు అనుకూలంగా మాట్లాడడం ప్రారంభించారు.

## బీజేపీని నమ్మని జయ

జయలలిత నాయకత్వంలోని అన్నాడీఎంకే పార్టీ మొదటిసారి 1998లో బీజేపీతో చేతులు కలి పింది. కానీ, చివరికి నాటకీయంగా ఆమె తన మద్దతు ఉపసంహరించుకోవడంతో వాజ్‌పేయి ప్రభుత్వం కుప్పకూలిపోయింది. 1999లో కాంగ్రెస్ తోనూ, ఇతర పార్టీలతోనూ చేతులు కలిపిన జయ లలిత ఆ తర్వాత 2004లో మళ్ళీ బీజేపీకి స్నేహ హస్తం అందించింది. 2009లో తృతీయ ఫ్రంట్‌కు ఆమె తన మద్దతు ప్రకటించింది. 2014లో ఆమె పార్టీ దాదాపు ఒంటరిగానే ఎన్నికల్లో పాల్గొంది. విచిత్రమేమిటంటే, తమిళనాడులో ఆర్ఎస్ఎస్ గణ నీయంగా విస్తరిస్తుండగా, అందుకు తగ్గట్టుగా బీజేపీ రాష్ట్రంలో ఎదగలేకపోతోంది. 1998లో కోయంబ త్తూరు పేలుళ్ళు, ఆ తర్వాత ఎల్‌కే అద్వాణీ యాత్ర వంటి కారణాల వల్ల ఆర్ఎస్ఎస్ శ్రేణుల సంఖ్య విపరీతంగా పెరిగింది. 2014 ఎన్నికల్లో అన్నాడీఎం కేకి లోక్‌సభ సీట్లన్నీ దాదాపు గంప గుత్తగా వెళ్ళి పోవడం బీజేపీకి మింగుడు పడలేదు. ఆమె దేశ వ్యాప్తంగా వీస్తున్న మోదీ హవాను తట్టుకుని తన పార్టీకి 39 స్థానాల్లో 37 స్థానాలు సంపాదించి పెట్టారు. మిగిలిన రెండు స్థానాల్లో ఒకటి బీజేపీకి, మరొకటి పీఎంకేకి దక్కాయి.

విచిత్రమేమిటంటే, 2014 ఎన్నికల్లో జయలలిత పూర్తిగా మోదీ పంథానే అనుసరించి విజయం సాధించారనే సంగతి అటు అన్నాడీఎంకే నాయకు లకూ తెలుసు, ఇటు బీజేపీ నాయకులకూ తెలుసు. అభివృద్ధి నినాదం, హిందూ ఓట్లు అనే లక్ష్యంతో బీజేపీ కేంద్రంలో విజయం సాధించినట్టే రాష్ట్రంలో జయలలిత పార్టీ విజయం సాధించింది. ద్రవిడ పార్టీలన్నీ హేతువాదం మీదే ఆధారపడి పైకి వచ్చి





నప్పటికీ, తనకు దేవుడిపట్ల ఉన్న నమ్మకాన్ని జయలలిత ఏనాడూ దాచిపెట్టలేదు. దేవుడు, హిందూ మతం, మూఢనమ్మకాలు ఆమెను మొదటి నుంచీ అంటిపెట్టుకునే ఉన్నాయి. హిందూమతం పట్ల ఆమెకు ఉన్న విశ్వాసాన్ని దృష్టిలో పెట్టుకునే గౌండర్లు, దేవర్లు ఆమెకు ఓటు వేశారు. పశ్చిమ, దక్షిణ తమిళనాడుల్లో ఈ రెండు కులాలవారు అధిక సంఖ్యలో ఉన్నారు. ఎన్నికల్లో జయలలిత కూడా మోదీ వ్యూహాన్నే అనుసరిస్తున్నారన్న సంగతి బీజేపీ నాయకులకు క్రమక్రమంగా అవగతమయ్యే సరికి ఎన్నికలు కాస్తా ముగిశాయి.

మోదీకీ ఈ సంగతి తెలుసు. అయితే, ఆయన ఇందుకు ఎంతో సంతోషించి, ఎన్నికల ముందు నుంచే జయలలితతో స్నేహంగా ఉంటూ వచ్చారు. 2011లో ఆమె ప్రమాణ స్వీకారోత్సవంలో పాల్గొనడానికి మోదీ అహ్మదాబాద్ నుంచి ప్రత్యేక విమానంలో చెన్నై వచ్చిన సంగతి గుర్తుండే ఉంటుంది. ఇక 2014 ఎన్నికల తర్వాత బీజేపీకి జయలలిత నాయకత్వంలోని అన్నాడీఎంకేతో చేతులు కలపడం తప్ప మరో మార్గం లేకుండా పోయింది. మోదీ ప్రధాని అయిన తరువాత జయలలితను ఆకట్టుకునే ప్రయత్నం మరీ తీవ్రతరమైపోయింది. ఆమెతో చెలిమికి బీజేపీ ప్రయత్నిస్తున్న కొద్దీ జయలలిత ఆ పార్టీని దూరంగా పెడుతూ వచ్చారు. బీజేపీని గనుక దరి చేరిస్తే తన ఓటు బ్యాంకుకు ఎక్కడ ముప్పు వస్తుందోనని ఆమె భయపడ్డారు. అయినప్పటికీ, బీజేపీ మాత్రం తన ప్రయత్నం విరమించుకోలేదు. జయతో స్నేహానికి వీలైనన్ని ప్రయత్నాలు చేస్తూనే వచ్చింది.

### శశికళతోనూ కష్టమే!

గత ఏడాది డిసెంబర్ 5న ఆమె కన్నుమూసిన తర్వాత నుంచీ ఈ ప్రయత్నాలు మరింత ముమ్మరమైపోయాయి. ఆమెకు అనివార్యంగా శశికళ వారసురాలు అవుతుందనే ఉద్దేశంతో ఆ పార్టీ చివరికి శశికళను కూడా ఆకట్టుకోవడానికి ప్రయత్నించింది. డిసెంబర్ 6న మోదీ చెన్నై వచ్చి శశికళను ఓదార్చారు. పన్నీరు సెల్వం తిరుగుబాటుతో అన్నాడీఎంకే చీలిపోవడం బీజేపీలో కొద్దిగా ఆశలు పెంచింది కానీ, ఎడప్పాడి పళనిస్వామి ముఖ్యమంత్రిగా గద్దెనెక్కడం ఆ పార్టీని ఎంతగానో నిరుత్సాహపరిచింది. తాము స్నేహం కోసం తపించిపోతున్న పార్టీ నిట్టనిలువునా చీలిపోవడం కూడా ఆ పార్టీని నిర్ఘాంతపరిచింది. జయలలితకు సహజ వారసురాలనుకున్న శశికళ విషయంలో కూడా బీజేపీ తన అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అగత్యం ఏర్పడింది. అన్నాడీఎంకేకి వారసురాలనుకున్న శశికళ క్రమంగా ఆ పార్టీకి గుదిబండగా మారడం బీజేపీకి ఆందోళన కలిగించింది.

ఆదాయాన్ని మించిన ఆస్తుల కేసులో బెంగళూరు జైలులో మగ్గుతున్న శశికళ చివరికి ఆర్‌కే నగర్ ఉప ఎన్నిక ప్రచారంలో ఆమె వర్గం డబ్బులు పంచిన కేసులో కూడా కళంకం తెచ్చుకున్నారు. ఆమెకు పార్టీలో ఉన్నంత ఆదరణ ప్రజల్లో లేదని బీజేపీ గ్రహించుకోవాల్సి వచ్చింది. శశికళ సమీప బంధువు టీటీవీ దినకరన్‌కు సన్నిహితుడైన ఓ మంత్రి ఇంటిపై ఆదాయ పన్ను శాఖాధికారులు దాడులు చేయడం, ఎన్నికల సంఘం అధికారులకు దినకరన్ రెండాకుల గుర్తు కోసం అరవై కోట్ల రూపాయలు ఇవ్వజూపినట్లు ఆరోపణలు రావడం శశికళ ప్రతిష్ఠను, ఆమె పార్టీ ప్రతిష్ఠను మరీ దెబ్బతీసింది. శశికళ, దినకరన్, వాళ్ళ బంధువర్గం అన్నాడీఎంకే నుంచి నిష్క్రమించాల్సి రావడంతో పళనిస్వామి, పన్నీర్ సెల్వం వర్గాల మధ్య పెద్దయెత్తున విలీనం ప్రయత్నాలు మొదలయ్యాయి. నిజానికి విలీనానికి గానీ, అధికార పంపకానికి గానీ ఈ రెండు వర్గాలు ఏమంత తొందరపడడం లేదనిపిస్తోంది. కానీ, బీజేపీలో మాత్రం తొందర మొదలైంది.

**తమిళనాడులో బలపడాలని బీజేపీ విశ్వ ప్రయత్నాలు చేస్తోంది. కానీ ఎప్పటికప్పుడు ఆ ప్రయత్నాలు బెడిసికొడుతూనే ఉన్నాయి. అన్నాడీఎంకేతో చెలిమికి యత్నిస్తున్నప్పటికీ బీజేపీని జయలలిత ఎప్పటికప్పుడు దూరంగానే ఉంచుతూ వచ్చారు. జయ అనంతరం కూడా బీజేపీ అంచనాలు తలకిందులయ్యాయి. పళనిస్వామి గద్దెనెక్కడం ఆ పార్టీకి నిరుత్సాహం కలిగించింది. మరి బీజేపీకి ఏది దిక్కు?**

బీజేపీ వైపు నుంచి ఆలోచిస్తే, శశికళ బంధువులు లేని అన్నాడీఎంకేతో స్నేహం నెరపడం అన్ని విధాలా మంచిది. రాష్ట్రపతి ఎన్నికలకు కావాల్సిన ఓట్లు లభించడమే కాకుండా, 2019 లోక్‌సభ ఎన్నికల్లో ఎలాగో కష్టపడి 10 స్థానాలు సీట్ల పంపకంలో సంపాదించడం సాధ్యమవుతుంది. దీనివల్ల తమ 2014 సీట్ల సంఖ్యను మరికొంత పెంచుకోవడానికి కూడా వీలవుతుంది. కాగా, ఈ పళనిస్వామి, పన్నీర్ సెల్వం వర్గాల తగాదాలో బీజేపీ సెల్వం వైపే మొగ్గు చూపుతోంది. జయలలితకు సహజ వారసుడు పన్నీరు సెల్వమేనని అది ఇప్పుడు భావిస్తోంది. జయలలిత రెండు మూడు సార్లు సెల్వంనే ముఖ్యమంత్రిగా నియమించడం ఆ నమ్మకానికి కారణంగా బీజేపీ చెబుతోంది.

రాష్ట్రంలో బీజేపీకి అనుకూలమైన నాయకుడు సెల్వమేనని పార్టీ వర్గాలు అభిప్రాయపడుతున్నాయి. ప్రజల దృష్టిలో శశికళ వంటి మోసకారి బలవంతంగా రాష్ట్రంపై రుద్దిన వ్యక్తి పళనిస్వామి అని బీజేపీ అంచనా వేస్తోంది. శశికళ జయ వారసత్వాన్ని చేజిక్కించుకోవడానికి కుట్రపూరితంగా ప్రయత్నాలు చేశారనీ, చివరికి ఆమె నియమించిన ముఖ్యమంత్రే ఆమెను ముంచడానికి ప్రయత్నించారనీ ప్రజలు భావిస్తున్నట్లు పార్టీ అభిప్రాయపడుతోంది. పళనిస్వామి, పన్నీరు సెల్వం విషయంలో బీజేపీకి ఇప్పుడు నిశ్చితాభిప్రాయాలు ఏర్పడి ఉన్నాయి. కానీ, రకరకాల కులాలు, వర్గాలు, చిన్న పార్టీల సమ్మేళనంగా ఉన్న తమిళనాడు రాజకీయ రంగంలో పన్నీర్ సెల్వం వర్గాన్ని భవిష్యత్తులో ఎంతవరకూ నమ్మవచ్చన్నది మాత్రం ఆ పార్టీకి ఇదమిత్థంగా తేలడం లేదు. ప్రస్తుతానికి మాత్రం బీజేపీ సెల్వం నాయకత్వంలోని అన్నాడీఎంకే వర్గం మీద గంపెడాశలు పెట్టుకుని ఉంది.



# మరో అమ్మ కథ

కె. మీరాబాయి



**ప్రసూతివార్డు పురిటికంపు కొడుతోంది. అవును మరి అది కార్పొరేట్ అయిదు నక్షత్రాల ఆస్పత్రి కాదు. ప్రభుత్వ సర్వజన వైద్యశాల. పురిటి వాసనకు తోడు మనిషన్న వాడు ముక్కు మూసుకోకుండా లోపలికి అడుగు పెట్టలేని మరుగుదొడ్ల వాసన కూడా కలిసి బ్రతుకంటేనే రోత పుట్టించే వాతావరణం ఉందక్కడ.**

జన్మం దుఃఖం జాయా దుఃఖం అని తెలిసినా చచ్చేదాకా బ్రతుకుమీద తీపి చావని జీవి 'పునరపి జననం పునరపి మరణం' అనే చక్రంలో భాగంగా తల్లి కడుపులో చీకటి గర్భకుహరంలో తలక్రిందులుగా తొమ్మిది నెలలు శిక్ష అనుభవించి మరణంతో పోరాడి భూమిమీద పడి, మొదటిసారి ఊపిరి పీల్చుకుని, కెవ్వుమని ఏడుస్తూ బ్రతుకుజీవుడా అని బయట పడుతుంది.

తొమ్మిది నెలలు మోసి, మరణయాతన పడి బిడ్డను కనేది తల్లి అయినా ఆ బిడ్డ ఆడో మగో నిర్ణయించేది తండ్రి క్రోమోజోము అని సైన్సు చెప్తోంది. అయినా పున్నామ నరకం నుండి రక్షించేవాడు, తనకు అపర కర్మలు జరిపి సద్గతులు కలిగించేవాడు, వంశాన్ని ఉద్ధరించే వారసుడు మగ బిడ్డే కావాలని కాబోయే తల్లిదండ్రుల కోరిక. భార్య వీధిగుమ్మం దాకా, బంధువులు వీధి చివరి దాకా, కొడుకు కాటిదాకా మాత్రమే అని తెలిసినా బంధాలకోసం జీవి తపన పుట్టినప్పటినుండీ మొదలవుతుంది.

చిరిగిపోయిన పరుపులలో నుండి అట్టగట్టిన పత్తి బయటకు వస్తుంటే, మాసిపోయి మరకలు పడిన దుప్పట్ల మాటున దాచేస్తూ, డాక్టరమ్మ వస్తోందని బాలింతలను హెచ్చరిస్తూ, చూడడానికి వచ్చిన వాళ్ళను బయటకు తరిమేస్తూ హడావుడి చేస్తోంది నర్సమ్మ. పైసా చేతిలో పడితేతప్ప బెడ్‌పాన్ పెట్టని ఆయాలు, డబ్బులిస్తేగానీ మురికి కడగని తోటీలు పైపైన పనులు చేసి తప్పుకుంటున్నారు.

పట్టీలు ఊడిపోయి లోతుగా గుంతపడి వేలాడుతున్న మంచాలమీదే గాక కొంతమంది తల్లులు క్రింద నేలమీదనే వేసిన మురికి పరుపులమీద పడుకుని పసి ప్రాణానికి స్తన్యం కుడుపుతున్నారు.

ముందురోజు రాత్రి పదిగంటలకు నొప్పులు పడుతూ ఆస్పత్రికి వచ్చింది ప్రమీల. తోడుగా రావాల్సిన మగడు మగవాడు గనుక ఆ వేళకే తాగినమత్తులో పడి ఉండడంవలన పెద్దపిల్లకి చిన్నదాన్ని అప్పగించి రిక్షా కట్టించుకుని ఒంటరిగానే వచ్చి ఆస్పత్రిలో చేరింది ప్రమీల. ఆస్పత్రిలోనే పురుడు పోసుకోవాలని ఒక అమ్మగారు చెప్పింది ప్రమీలకు.

పేరు నాజూకుగా ఉన్నట్లే మనిషీ అందంగా ఉంది. మసి పాత్రలో మాణిక్యంలా పాత చీరలో ఆ సౌందర్యం మరుగున పడింది. మూడో కానుపు కావడంవల్ల తెల్లవారు జామునే ఏ సమస్యా లేకుండా కాన్పు అయింది. ఆయాను బ్రతిమాలి

పదిరూపాయలు సమర్పించి నర్సమ్మను పిలిపించు కుంది ప్రమీల. వంద కాగితం చేతిలో పడ్డాక బొడ్డు కోసింది ఆమె. 'అయ్యో ఆడపిల్ల' అంది పెదవి విరుస్తూ.

భూమి మీద పడగానే కెవ్వుమని ఏడ్చిన బిడ్డను చూసి 'ఎందుకేడుస్తావే వెర్రిమొగమా.... ఎదర బతుకంతా ఏడుపే' అనుకుంటూ కళ్ళనీళ్ళు నింపుకుంది ప్రమీల.

మూడోసారీ ఆడపిల్లే. కానీకి టికాణా లేక పోయినా, చేసేది కూలిపనే అయినా వంశం పేరు నిలిపే వారసుడు కావాలంటూ మూడోసారి పెళ్ళాన్ని తల్లిని చేశాడు వీరాసామి. కొడుకు పుట్టేది ఖాయ మని, తన తెరవేలుపు పవన్‌కల్యాణ్ పేరు పెట్టు కుంటాననీ మత్తులో చిందులు వేసి చింతమానులా పడి నిద్రపోయాడు ముందురోజు రాత్రి. మళ్ళీ ఆడ పిల్లే పుట్టిందని తెలిస్తే ఏం వీరంగం ఆడతాడో అని గుండెలు అదురుతున్నాయి ప్రమీలకు.

పెద్ద పిల్లలిద్దరికీ మురిపెంగా మల్లిక, మాధురి అని పేర్లు పెట్టింది ప్రమీల. అయిదిళ్ళలో అంట్లు తోమి, కసువులు చిమ్మి, బండలు తుడిచే పని చేస్తుందామె. ఆరేళ్ళ పెద్దదాన్ని, నాలుగేళ్ళ చిన్న దాన్ని కూడా తీసుకుపోతుంది ఒక్కోసారి. ఆరేళ్ళ వయసులోనే తల్లిచేతిలో పని అందుకుని ఇంటి బయట ఊడ్చి నీళ్ళు జల్లుతుంది పెద్దది.

తన కూతుళ్ళ పేర్లు వినగానే తను పనిచేసే ఇళ్ళలోని అమ్మగార్లు నొసలు విరిచి, వెక్కిరింతగా నవ్వడం ప్రమీలకు అనుభవమే.

"అబ్బో ఏం నాజూకు నేర్చారే... సినిమా తారల్ని చేస్తావా ఏం నీ కూతుళ్ళనీ" అంటూ సాగదీసే

**కానికి టికాణా లేకపోయినా వంశోద్ధార కుడు కావాలంటూ మంకుపట్టు పట్టాడు వీరాస్వామి. మళ్ళీ భార్యను తల్లిని చేశాడు. ఈసారీ ఆడపిల్లనే కన్నావా లం.... నువ్వు ఛస్తేగానీ నా శని వదలదు, దాన్ని ఇంటికి తెచ్చావో మీ ఇద్దర్నీ చంపి పారేస్తాను జాగ్రత్త అంటూ చిందులు తొక్కి ఆస్పత్రి నుంచి వెళ్ళిపోయాడు మొగుడు. నిజంగా అలాంటోడే ఏం చెయ్యాలి అని ఆలోచించి చెత్తకుప్ప దగ్గర బిడ్డను వదిలేసింది ప్రమీల. తర్వాత ఏం జరిగింది?**

వారు. "మంచిపేర్లు పెద్దింటి వాళ్ళు, డబ్బున్న వాళ్ళు మాత్రమే పెట్టుకోవాలా? మేం మనుషులం కామా?" అన్న ఉక్రోషం కలిగినా పైకి ఏమనేది కాదు. ఎనిమిది దాకా చదువుకున్న ప్రమీల అంటే నిశానీ మొగుడికి వెక్కిరింతే.. పిల్లల్ని స్కూలుకు పంపుతు న్నందుకు వారంలో మూడుసార్లైనా వీరాసామి చేతిలో దెబ్బలు తింటుంది ప్రమీల.

డాక్టరమ్మ వచ్చి చూసి ఎవరిని ఇళ్ళకు పంపిం చేయాలో చెప్పి వెళ్ళిపోయింది. గుప్పెట్లో గుండె పెట్టుకుని వీరాసామి కోసం చూస్తోంది ప్రమీల. 'అసలు వస్తాడా? లేకుంటే బిడ్డను తీసుకుని ఇంటికి వస్తుందిలే అని సారా కొట్టుకు పోయి ఉంటాడా? ఈ పిల్లని చూసి ఆగ మాగం చేస్తాడేమో? "ఆడపిల్ల అంటే ఖర్చులని ఏడుస్తాడేగానీ ఈ మనిషిని కన్నది ఆడది కాదా?" అనుకుంటూ పక్క నున్న పసిదానివైపు చూసింది. చిన్ని చిన్ని గుప్పిళ్ళు గట్టిగా మూసివున్నాయి. కళ్ళు తెర వకుండానే పాలపీక చీకినట్టు పెదవులు లోప లికి లాక్కుని చీకుతోంది. ఆకలేస్తోందేమో! తన లాగే ఎర్రగా, పొడుగ్గా వుంది. పిల్లను చూస్తోంటే గుండెల్లో పాలు పొంగాయి. పసిదాన్ని దగ్గరగా జరుపుకుని రొమ్ము అందించింది. ఆత్రంగా పాలు తాగుతోంది బిడ్డ. ఎవరు నేర్పారో బిడ్డకు పాలు తాగడం? అనుకుంటూ బిడ్డ వీపు మీద నిమురు తోంది ప్రమీల.

అప్పుడే లోపలికి వస్తూ కనబడ్డాడు మొగుడు. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అడుగులు ఇంకా తూలు తున్నాయి.. పిల్లలిద్దరినీ చెరో చేత్తో లాక్కుంటూ అటూ ఇటూ వెదుకుతూ దగ్గరికి వచ్చాడు.

"పెద్ద పిల్లలిద్దరూ ఆడకూతుళ్ళేనా? మళ్ళీ మూడోదీ ఆడపిల్లే పాపం..." పక్కమంచంమీది తల్లి జాలిగా అంది. ఆమెకు మూడో కాన్పులో మగబిడ్డ. మొగుడు నూనెమిఠాయి కొని తెచ్చాడు నర్సమ్మకు.

ఆమె మాటలు వీరాసామి చెవుల్లో పడనే పడ్డాయి. "లం.........డా! మళ్ళీ ఆడ... డనే కన్నావా? నువ్వు చస్తేగానీ నాకు శని వదలదు. దాన్ని ఇంటికి తెచ్చావో మీ ఇద్దర్నీ చంపేస్తాను..." ప్రమీల ఎదురు చూస్తున్న వీరంగం ముగిసింది. పక్కన బల్లమీదున్న బ్రెడ్ ముక్క అందు కుని నోట్లో కుక్కుకుని, పిల్లల్ని ఈడ్చు కుంటూ బయటకు వెళ్ళిపోయాడు వీరాసామి.

ప్రమీల ఏడుస్తోంది.
గుండె పగిలి దుఃఖం
బయట పడుతోంది.
గుండెలు ఎగిరి పడుతున్నాయి.
పక్కనున్న పసిది కెవ్వుమని
ఏడుపు లంకించుకుంది.

నర్సమ్మ దబదబ వచ్చింది.. "బాలిం తపు పచ్చిఒళ్ళు.. ఏడ్వమాకు. జరమొస్తది..." అంది చికాకూ, జాలీ మిళితం చేసి.

ప్రమీల నోట్లో చీర చెంగు కుక్కుకుంది. "అన్నంత పని చేస్తాడు మొగుడు. తనమీద కోపంతో ఆ పిల్ల లిద్దర్నీ ఏ పురుగుల మందో తాగించి చంపేస్తాడు.. దేవుడా ఏం దారి?" పసిగుడ్డు మళ్ళీ నిద్రలో పడింది.

"ఈసారీ ఆడపిల్ల పుడితే ఏం పేరు పెడతావే? మనీషా అని పెట్టు.. సినిమా స్టారు పేరు.." అంది ఒక అమ్మగారు ఎగతాళిగా.

"అట్లనబోకమ్మా.. మగబిడ్డను కనకపోతే నన్ను ఇంటినుండి తరిమేస్తాడు నా మొగుడు...." ప్రమీల

## కెమెరా అంటే భయం అట!

ఈ మాట కొత్తగా వచ్చిన హీరోయిన్ చెబితే నిజ మేనేమో అనుకోవచ్చు కానీ, ఫైర్ బ్రాండ్‌గా ముద్రపడిన రాధికా ఆప్టే చెబుతుంటే కామెడీగా ఉంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. బయట ఎంత బోల్డ్‌గా మాట్లాడు తుందో, తెర మీద కూడా అంతే బోల్డ్‌గా నటిస్తుంది. అలాంటి రాధికాకు ఇప్పటికీ కెమెరాను ఫేస్ చేయడం అంటే ముందు కొద్దిగా భయంగా ఉంటుందట! తరు వాత తరువాత అలవాటైపోయి మామూలైపోతాను అంటూ చెప్పుకొచ్చింది. ఫామ్‌లో ఉన్నప్పుడు ఏం చెప్పినా బాగానే ఉంటుంది కనుక, రాధికా ఆప్టే మాటలు కూడా చాలామంది నమ్ముతున్నారట!



భయంగా అంది.

"వాడు తరిమేసేదేంది? నీకు పెట్టి పోషిస్తు న్నాడా? నువ్వే నీ కష్టంతో వాణ్ణి సాకుతున్నావు. కూలి డబ్బుతో తాగేసి వచ్చి నీ దగ్గర దాచుకున్న రూపాయి అర్థా లాక్కుపోతున్నాడు గదా!" అన్నదామె.

సొమ్మసిల్లినట్లుగా నిద్రపోయింది ప్రమీల. పక్క మంచంమీది మగబిడ్డ తల్లి తను తాగగా మిగిలిన జావ ప్రమీలతో తాగించింది మధ్యాహ్నం.

చీకటి పడింది. ప్రమీలకు గుండెల్లో గుబులు లేస్తోంది. ఇంటికి పొద్దున్నే పోవాలి. బిడ్డను ఎత్తు కుని ఇంటికి పోతే పెద్దింటి మారాణులకు జరిగి నట్టు తనకు ఎర్రనీళ్ళు దిష్టి తీసి లోపలికి పిల్చుకు పోయేదెవరు? మూడో ఆడబిడ్డను తెచ్చినావని కాలితో తన్ని బయటకు తోసేస్తాడేమో. ఆ ఇద్దరు పసిపిల్ల లను గొంతు పిసికి బాయిలో వేస్తడేమో..భయంగా కళ్ళు ముసుకుంది.

మగత నిద్రలో మాటలు వినిపించి కళ్ళు తెరి చింది ప్రమీల. "అయ్యో! ఆడపిల్ల పుట్టిందని పురిటి పోయింది మళ్ళీ.

"పొద్దున్నే డాక్టరు వచ్చి చూసినాక డిశ్చార్జ్ చేస్తాం. మీ ఆయనొచ్చి పిల్చుకుపోతడా? నువ్వే పోతవా?" నర్సు వచ్చి అడిగింది.

"నేనే పోతా" రొంటినున్న సంచీ తడుముకుని చెప్పింది. డబ్బులీయందే పోనీయరని తెల్సు. కాన్పు వచ్చే ముందు దినం దాక పనిచేసి అమ్మగార్నడిగి నెల జీతం తెచ్చుకుంది. పేరుకి ఉచితవైద్యం. అంద రికీ చేయి తడపాల్సిందే. నర్సు వెళ్ళిపోయింది. ప్రమీ లకు మాగన్నుగా నిదురపట్టింది.

"ఎర్రగా కళ్ళతో వీరాసామి చిందులేస్తున్నాడు. చేతిలో మందుసీసా.. మల్లి, మాధురి నోట్లో నుర గలు కక్కుతా కింద నేలమీద దొర్లుతున్నారు. మల్లీ, మాధురీ అంటూ ఉలికిపడి లేచి కూర్చుంది. ఈ పిల్లని ఇంటికి తీసుకపోతే మొగుడు పెద్ద పిల్లలి ద్దర్నీ చంపేస్తాడు. వార్డులో గడియారం పదకొండు గంటలయిందని చూపుతోంది. అందరూ నిద్రలో ఉన్నారు. బయటనుండి కుక్కల అరుపులు..




కందును చెత్తకుండీలో పడేసి పోయిందంట తల్లి.. ఎట్ల మనసొప్పిందో? ఏం చావు బిడ్డకు? పోలీసులు చూసినారంట. ఎస్సై సారు శవానికి అంత్యక్రియలు చేయించినాడంట" పేపర్లో వార్త పైకి చదువుతోంది నర్సమ్మ.

ప్రమీల గుండె ఝల్లుమంది. నీరసం, నిస్త్రా ణతో బాటు గుండెల్లో దిగులు.. నర్సమ్మ బ్రెడ్డు తెచ్చి ఇస్తే బలవంతంగా తిన్నది. తనకు జావ తెచ్చి ఇచ్చేవారెవరు?

బయట చీకటి ముసురుకుంది. కుక్క ఒకటి ఉండీ ఉండీ భీకరంగా మొరుగుతోంది.

"మొన్న హైదరాబాద్‌లో అదేదో పెద్ద ఆస్పత్రి లోనే కాన్పుల వార్డులోకి కుక్కవచ్చి బిడ్డను ఈడ్చుకు పోయిందట, భద్రంగా చూసుకోవాల..." పక్క మంచం మీద మగబిడ్డను కన్న తల్లి పక్కనున్న అక్కతో అంటోంది.

ప్రమీల ఉలికిపడి పక్కన తడిమి చూసుకుంది. నిద్రపోతున్న బిడ్డ కదిలి 'కేరు' మంది. తల్లి చేయి వెచ్చగా వీపు నిమురుతుంటే నిర్భయంగా నిద్ర

అక్కడెక్కడో జరిగినట్టు కుక్కవచ్చి ఈ పసి కందును ఈడ్చుకుపోకూడదూ? గండం గడుస్తుంది.. ఆరేళ్ళు, నాలుగేళ్ళు పిల్లల్ని పెంచిన మమకారం కొత్త ఆలోచన నిచ్చింది.

నెమ్మదిగా లేచి నిలబడింది ప్రమీల. నిద్ర పోతున్న పసిగుడ్డును ఎత్తుకుని గుండెలకు హత్తు కుని పైట చెంగు కప్పింది. ఎవరైనా చూసినా చేతిలో ఏదో ఉందని తెలీదు. నెమ్మదిగా నడిచి దగ్గరగా వేసి ఉన్న తలుపు ముందుకు తోసి ముందుకు నడిచింది.

బయట చీకటిగా ఉంది. దీపాలు గుడ్డి వెలు తురు నిస్తున్నాయి. చలిగాలి ఈడ్చికొట్టినట్టు ముఖా నికి తగిలింది. బిడ్డమీద కొంగును మరింత గట్టిగా చుట్టింది.

వరండా మెట్లు దిగి నాలుగడుగులు నడవ గానే పక్కనే చెత్తకుప్ప చీకట్లోనూ కనపడింది. పురిటి నెత్తుటితో తడిసిన గుడ్డలు, ఇంజక్షను బాటిళ్ళు, బాండేజి పత్తి నానారకాల చెత్త కుప్పగా ..ముక్కు బ్రద్దలయ్యేవాసన కొడుతూ.

కాస్త ముందుకు పోతే చెత్తకుండీ ఉండాలి.. వచ్చేటప్పుడు చూసింది.. ముందుకు నడిచింది. ఆమె రెండడుగులు వేయకముందే ముందునుండి పంది ఒకటి కుండీ వెనక్కి పోయింది. ఆ వెనకాల ఎక్క డుందో భీకరంగా అరుస్తూ పందిమీదకు దూకిందో కుక్క. పంది 'గీ' పెడుతూ పరుగెత్తింది. కుక్క కుండీ వెనక్కి పోయింది. అటు పక్క నుండి పసిబిడ్డలు ఏడ్చినట్టు చిన్న కుక్కపిల్లల అరుపు వినబడింది. కుక్క నిన్ననో ఈ రోజో ఈనినట్టుంది. ఆ పక్కకి ఎవరైనా మనిషిగానీ జంతువుగానీ వచ్చిన అలికిడి అయితే అరుస్తూ ముందుకు దూకుతోంది.

గుండెల్లో దాచుకున్న బిడ్డను కొంగుచాటు నుండి తీసి గుడ్డల్లో చుట్టి చెత్తకుండీకి కాస్త దూరంలో కింద పడుకోబెట్టి వెనక్కి తిరిగింది ప్రమీల. మనిషి చప్పుడు విని భయంకరంగా అరుస్తూ కుండీ వెన కనుండి ముందుకు దూకింది కుక్క. ప్రమీల కళ్ళు గట్టిగా మూసుకుని ముందుకుపోయింది. కాళ్ళు వణుకుతున్నాయి. కడుపులో పేగులు లుంగ చుట్టు కున్నాయి. కుక్క అరుపు ఆగింది. కుక్క పిల్లల మూలుగులు వినిపిస్తున్నాయి. కుండీ పక్కన పడు కున్న తల్లిమీదకి ఎగబడి పాలకోసం కలబడుతు న్నాయి నాలుగు పిల్లలు.

పొత్తిళ్ళలో వున్న పాపను వాసన చూసి పక్కనే పడుకున్న తల్లి కుక్క గుర్రుమంటోంది.

ప్రమీల గొంతు తడారిపోయింది. గుండె చప్పుడు చెవుల్లోకి వినబడుతోంది. కాలు పీకేసిందా? చెయ్యి లాక్కుపోయిందా? అయ్యో నా బిడ్డా.. దుఃఖం ఎగ దన్నింది. భయం ఎక్కడికి పోయిందో వెనక్కి పరి గెత్తింది.

పొత్తిళ్ళలో పాప కదుల్తోంది. పక్కనే తల్లి కుక్క స్తన్యాన్ని గుడుస్తున్నాయి కుక్క పిల్లలు.

ఒక్క ఉదుటున పాపను చేతిలోకి తీసుకుంది ప్రమీల. 'మనీషా! మనీషా! నా బిడ్డా' గుండెకు హత్తుకుంది. ముఖాన ముద్దులు పెట్టింది. పాపను వాసన చూసిన తల్లి కుక్క పాపతల్లి వాసనను పసి గట్టినట్టు మొరగకుండా ఊరుకుంది.

బిడ్డను గుండెకు హత్తుకుని కాళ్ళు చేతులు తడిమి చూసుకుని వార్డులోకి నడిచింది ప్రమీల.

'నాలుగు పిల్లల్నిపెట్టిన కుక్క మరో జంతువును గానీ, మగ కుక్కను గానీ, మనిషిని గానీ వాటి దగ్గరకు రాకుండా కాపాడుకుంటోంది. పెద్ద పిల్లలి ద్దరినీ మొగుడు చంపేస్తాడేమో, తనని ఇంట్లోంచి తరిమేస్తాడేమో అని భయపడి కళ్ళు తెరవని పసి గుడ్డును కుప్పతొట్టిలో వేయబోయింది తను.. దాని కున్న ప్రేమ, ధైర్యం తనకి లేకపోయిందా?

"ఆ అమ్మగారన్నట్టు వాడు తనని పోషించడం లేదు. తన రెక్కల కష్టం తెచ్చి తనే వాడికి పెడు తోంది. నీ ఇల్లూ వద్దు, ఈ కాపురం వద్దు అని తన పిల్లల్ని తాను సాకలేదా?"

ప్రమీల నిశ్చింతగా నిద్రపోతున్న పాపను దగ్గ రగా పొదువుకుని కళ్ళు మూసుకుంది. కాబోయే మరో అమ్మకు ప్రాణభిక్ష దొరికింది.

*సెల్: 94908 83299*

# అంగస్తంభన సమస్యకు ఆయుర్వేదమే బెస్ట్


డాక్టర్ ఎం. నరసింహ
ఎం.డి (ఆయుర్వేద), సెక్సాలజిస్ట్
యస్.బి. స్పెషాలిటీ క్లినిక్
అమీర్‌పేట్, హైదరాబాద్,
బ్రాంచీలు : విజయవాడ,తిరుపతి
ఫోన్స్ : 924656 4433,
939656 4433




పురుషుల్లో ఎక్కువ మందిని ఇబ్బంది పెడుతున్న సమస్య అంగస్తంభనం. దీనిని ఆయుర్వేదంలో నపుంసికత, క్లైబ్యంగా అని పేర్కొంటారు. శృంగారంలో పాల్గొన్నపుడు లేక హస్తప్రయోగం చేస్తున్నపుడు అంగం తగితనంతగా స్తంభించక పోవడం, లేక ఒక వేళ స్తంభించినా చివరి వరకు తగినంతగా స్తంభించి ఉండక పోవడాన్ని అంగస్తంభన సమస్యగా చెప్పవచ్చు. ఈ సమస్యతో బాధపడే వారిలో సెక్స్ కోరికలు మామూలుగానే ఉంటాయి. ఈ సమస్యతో బాధపడే వారు మానసిక ఒత్తిడికి లోనుకావడం, వారిలో ఆత్మవిశ్వాసం తగ్గడం వల్ల డిప్రెషన్‌తో బాధ పడుతుంటారు.

**కారణాలు :** అంగంలోనికి రక్తప్రసరణ జరగక పోవడం అన్నది అంగస్తంభన సమస్యకు ముఖ్యమైన కారణం. ఈ సమస్య శారీరక, మానసిక కారణాల వల్ల ఏర్పడుతుంది. వీటిలో కూడా 60 శాతం మందికి శారీరక కారణాలు 40 శాతం మానసిక కారణాలుగా చెప్పవచ్చు. మానసిక ఆందోళన, ఒత్తిడి, భయం, డిప్రెషన్, ఫెర్ఫామెన్స్ యాంగ్జైటీ మొదలగు మానసిక కారణాల వల్ల అంగస్తంభన సమస్య ఏర్పడుతుంది. డిప్రెషన్, ఫెర్ఫామెన్స్ యాంగ్జైటీతో బాధపడుతున్న వారికి వారి సెక్స్ సామర్థ్యంపైన నమ్మకం లేనందున వారికి అంగస్తంభన సమస్య ఏర్పడుతుంది. మద్యం తీసుకోవడం, పొగతాగడం, గుట్కాలు నమలడం వల్ల కూడా ఈ సమస్య ఏర్పడుతుంది. హార్మోన్‌ల లోపాల వల్ల ముఖ్యంగా టెస్టోస్టిరాన్ హార్మోన్‌లోపం వల్ల అంగస్తంభన సమస్యకు దారితీస్తుంది. అధిక బరువు, కొలెస్ట్రాల్ ఎక్కువగా ఉన్న వారిలో కూడా ఈ సమస్య రావచ్చు. మధుమేహ వ్యాధిగ్రస్థుల్లో ఎక్కువగా నాడులు, రక్తనాళాలు వికృతి చెందడం వల్ల అంగస్తంభన సమస్య ఎక్కువగా వచ్చే అవకాశముంది. నాడీ సంబంధ వ్యాధులు, సుఖవ్యాధులు, కిడ్నీ సంబంధిత వ్యాధుల వల్ల కూడా ఈ సమస్య ఏర్పడవచ్చు. ఎక్కువ కాలం ఇతర వ్యాధులకు వాడిన మందుల వల్ల కూడా ఒక శాతం మందిలో అంగస్తంభన సమస్య వచ్చే ప్రమాదముంది. అధిక రక్తపోటు, గుండెజబ్బులు, డిప్రెషన్,అల్సర్, కేన్సర్ సంబంధిత వ్యాధులకు నొప్పి, వాపు తగ్గించే మందుల వల్ల కూడా ఈ సమస్య ఏర్పడవచ్చు.

### వ్యాధి నిర్ధారణ

నిపుణులైన ఆయుర్వేద వైద్యులను సంప్రదిస్తే, హార్మోన్‌ల పరీక్ష, పినైల్ డాప్లర్ వంటి పరీక్షలు చేయించి, వ్యాధిని నిర్ధారిస్తారు.

### ఆయుర్వేద వాజీకరణ చికిత్స

అంగస్తంబన సమస్యకు ఆయుర్వేదంలో ఎన్నో రకాల మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. ఈ ఆయుర్వేద మందులు ఎలాంటి సైడ్ ఎఫెక్టులు లేకుండా సెక్స్ సమస్యలకు శాశ్వత పరిష్కారాన్ని ఇస్తాయి. ఆయుర్వేదంలో కొన్ని వేల సంవత్సరాల క్రితమే శృంగార సమస్యలు, సంతానలేమి సమస్యల కోసం ప్రత్యేకంగా ఒక విభాగాన్నే ఏర్పాటు చేశారు. ఆ ఆయుర్వేద విభాగానికి 'వాజీకరణ చికిత్స'గా పేర్కొన్నారు. వాజీకరణ ఔషధాలు వాడినట్లయితే పరుషుల్లో అంగస్తంభన సమస్యతో పాటు, శృంగార, సంతానలేమి సమస్యలు కూడా పూర్తిగా తొలగిపోతాయి.

# మీ మోకాళ్లనొప్పులు మీ ఇష్టం.. అంతేనా?


డాక్టర్ టి. ఎల్. శ్రీనివాసరావు
సహజ ఆయుర్వేదిక్ హాస్పిటల్
అండ్ రీసెర్చ్ సెంటర్
హైదరాబాద్: మలక్‌పేట్ ,విజయనగర్‌కాలనీ
బ్రాంచీలు : హన్మకొండ, రాజమండ్రి విజయవాడ
అనంతపూర్, జోగిపేట్, తిరుపతి, నెల్లూరు
ఫోన్స్ : 9160994455, 9160994456




శరీరం ఎంత దృఢమైనదో... అంత సున్నితమైంది కూడా. ఆ దృఢత్వాన్నీ, సున్నితత్వాన్నీ నిలబెట్టుకోవడంలో మీరు ఏ మాత్రం శ్రద్ధ వహిస్తున్నారు? ఈ విషయంలో ఏ మాత్రం నిర్లక్ష్యం చేసినా, మొత్తం శరీర వ్యవస్థ అంతా కుప్ప కూలిపోతుంది. ఈ విషయంలో వ్యక్తిగత జాగ్రత్తల పరంగా ఎంత శ్రద్ధ వహించినా, బయటినుంచి వచ్చిపడే వాతావరణ కాలుష్యాలు, ఆహార పానీయాల్లోని విషపదార్థాల విషయంలో ఎవరికి వారుగా ఏం చేయగలరు? అదొక నిస్సహాయ పరిస్థితి. అందుకే నిస్సహాయంగానే మనం వాటికి బలి కావలసివస్తోంది. .

### సంధివాతం చావు దెబ్బ

ఈ సంధి వాతం విషయానికొస్తే, చల సంధులనీ, స్థిర సంధి అనీ కీళ్లను రెండు భాగాలుగా విడదీయవచ్చు. కదిలే కీళ్లను చల సంధులనీ కదలని కీళ్లను స్థిర సంధులనీ అంటారు. సంధిగత వాతమనేది ఈ కదిలే చల సంధుల్లోనే వస్తుంది. చల సంధుల్లోనే కీళ్ల వాతం రావడానికి శరీర భాగాలన్నింటినీ ఆవరించుకుని, కొన్ని మెంబ్రేన్ పొరలు ఉంటాయి. వాటిలో శ్లేష్మధరా కల అనే ఒక పొర ఉంటుంది. దీన్నే సైనోవియల్ సైనోవియల్ మెంబ్రేన్ అంటారు. మొత్తంగా అష్టాధర కలలు అంటే ఎనిమిది పొరలు ఉంటాయి. ఈ సైనోవియల్ ఫ్లూయిడ్ కీళ్లు కదలడానికి తోడ్పడుతూ ఉంటుంది. కదిలే కీళ్లు సహజంగా శ్లేష్మము, సిరలు, కండరాలతో కూడుకుని ఉంటాయి. ఈ శ్లేష్మధరా కల ఎప్పుడైతే, వాత ప్రకోపంతో దూషింపబడినప్పుడు అది తన నార్మల్ కండీషన్‌ను కోల్పోయి కొన్ని సమస్యలు తలెత్తుతాయి. మౌలికంగా ఆమాశయ ధరా కల దూషితమైనప్పుడే శ్లేష్మధరా కల దూషితమవుతుంది. ఆమాశయ ధరాకల దూషితమైనప్పుడు శరీరంలో ఆమం ఏర్పడుతుంది. సంధివాతానికి ఆమమే ప్రధాన కారణం. ఆమం ఏర్పడటానికి జఠరాగ్ని క్షీణించడం ఒక ప్రధాన కారణం. జఠరాగ్ని కుంటుపడినప్పుడు అష్టాధర కలలు దెబ్బ తింటాయి. ఆ క్రమంలోనే శ్లేష్మాధర కల దెబ్బ తింటుది. అలా దెబ్బతిన్నప్పుడు దీనితో ముడివడిన కండరాలు, వాటి కదలికలు స్థంభించి వాటి మధ్య వాపు ఏర్పడుతుంది. అప్పుడే కీళ్లల్లో నొప్పి ఏర్పడుతుంది. కీళ్లల్లో వాపు, నొప్పి ఉన్నప్పుడే ఆర్థరైటిస్ అంటారు.

### ఆయుర్వేద చికిత్స

సంధివాతానికి వాత హర చికిత్సలు చేయడం ద్వారా, అరిగిపోయిన భాగాన్ని తిరిగి వృద్ధి చేయడం సాధ్యమవుతుంది. కొన్ని ప్రత్యేకమైన ఔషధ యుక్త తైలాలతో, మోకాళ్లకు జానువస్తి చికిత్స చేస్తున్నాం. దీనివల్ల అరిగిపోయిన భాగాల్లో పోషమైన వృద్ధి ఏర్పడుతుంది. ఈ తైలాల ద్వారా, కొన్ని రకాల మాత్రల ద్వారా అరిగిపోయిన కార్టిలేజ్‌ను తిరిగి ఉద్ధరించే అవకాశం ఏర్పడుతుంది. వాస్తవానికి కార్టిలేజ్‌ను పునరుద్ధరించే శక్తి ఆయుర్వేద తైలాలకు మాత్రమే ఉంది. జానువస్తి చికిత్సలు ఎవరైనా చేయవచ్చు. కానీ ఆ సమయంలో కీళ్లలోకి పంపించే తైలం పాత్రే ఇక్కడ కీలకం. వ్యాధి మూలాలు, కీత్సా వి శేషాల గురించిన తెలిసిన అపార అనుభవం మీ మోకాళ్ల నొప్పుల సమస్యనుంచి శాశ్వతంగా విముక్తం చేస్తుంది.



③

# మనసుగతి ఇంతే!

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లోంచి వస్తున్న డాక్టర్ శివానీని చూస్తూ, వినయ్, ఆనందరావూ, సుమిత్రా, శ్రీనాథరావూ, శాంతమ్మా, సుధా ఒక్కసారిగా లేచి నిలబడ్డారు. దగ్గరగా వచ్చిన డాక్టర్ని ఆరు జతల కళ్ళు ఒకే ప్రశ్న వేస్తున్నాయి. 'సంధ్యకు ఎలా ఉంది?'**

**"బీపీ నార్మల్‌గా ఉంది. బ్రెయిన్‌కి ఆక్సిజన్ సప్లై కూడా దాదాపుగా నార్మల్‌గానే ఉంది. అయితే ఇంకా స్పృహలోకి రాలేదు. పరిస్థితి నిలకడగానే ఉంది కాబట్టి కంగారేం లేదు అంటున్నారు సీనియర్ డాక్టర్ మోహన్‌రావుగారు. సంధ్య ఈ రాత్రికి ఇక్కడే ఉండడం మంచిది.."**

"బీపీ, ఆక్సిజన్ సప్లై నార్మల్‌గానే ఉన్నాయి అంటున్నారు. వేరేప్రాబ్లం ఇంకేమైనా ఉందా డాక్టర్?" వినయ్ ప్రశ్నించాడు.

"డాక్టర్ మోహన్‌రావుగారు అబ్జర్వ్ చేస్తున్నారు. బ్లడ్‌శాంపిల్స్ కూడా తీసుకుంటున్నారు. సంధ్యకు ప్రాణభయం లేదు. అధికమైన స్ట్రెస్ వల్ల కూడా ఒక్కోసారి ఇలా అవుతూ ఉంటుంది. నిర్భయంగా ఉండండి. మీరిక్కడుండి చేసేదేమీ లేదు. ఇళ్ళకు వెళ్ళండి.."

"నేనిక్కడే ఉంటాను. మీరందరూ వెళ్ళండి." వినయ్ తల్లిదండ్రుల్నీ, అత్తమామల్నీ చూస్తూ అన్నాడు.

"అన్నయ్యతో పాటు నేనిక్కడే ఉంటాను. మీరు నలుగురూ వెళ్ళిపోండి" సుధ అంది.

"సరే...మీ ఇష్టం. అలాగే చేయండి. నేనొస్తాను" డాక్టర్ శివాని అందర్నీ ఉద్దేశించి అని, ఐసీయూ వైపు వేగంగా నడిచింది.

***

మరునాటి సాయంత్రం శ్రీనాథరావు, శాంతమ్మ, ఆనందరావు, సుమిత్ర, సుధ, వినయ్, సంధ్య అందరూ ఆనందరావు ఇంట్లో హాల్లో కూర్చున్నారు. సంధ్యా, వినయ్ ఒక సోఫాలో కూచున్నారు. సంధ్య పక్కన సుధ కూచుంది. సంధ్య తల వెనక్కివాలి ఉంది. ఆమె ముఖంలో నీరసం కనిపిస్తోంది.

సుమిత్ర లేచి, వంటగది గుమ్మం దాకా వెళ్ళి, వెనుదిరిగి శాంతమ్మ వైపు చూసింది. "వదిన గారూ, మాట.." అంది.

శాంతమ్మ వంటగదివైపు నడిచింది. ఆమె చేతిని పట్టుకుని సుమిత్ర వంటగదిలోకి తీసుకెళ్ళింది.

"డాక్టర్ శివానీతో చర్చించాను. మానసికమైన ఒత్తిడి కారణంగానే సంధ్యకు అలా అయిందనీ, రెండు మూడు రోజులు పూర్తిగా విశ్రాంతి ఇవ్వడం మంచిదనీ అన్నారు. కార్యం గురించి అడిగాను. రెండు మూడు రోజులు ఆ ఆలోచనే వద్దంది. సంధ్యకు శారీరక విశ్రాంతి కన్నా మానసిక విశ్రాంతి చాలా అవసరం అందామె...ఏం చేద్దాం?"

శాంతమ్మ చప్పుడు చేస్తూ బరువుగా నిట్టూర్చింది. "హూ...ఏంచేద్దాం...రెండు మూడు రోజులు ఓపిక పట్టాల్సిందేగా?"

"మళ్ళీ ఒత్తిడితో స్పృహ తప్పడం లాంటిది జరిగితే, శారీరకమైన ఆరోగ్యం కూడా దెబ్బతినే అవకాశం ఉంటుందన్నారు డాక్టర్లు... ఆగితే మంచిదనిపిస్తోంది. మీరూ, అబ్బాయీ సహకరించాలి.."

"సహకరించక చేసేదేముంది? అలాగే కానివ్వండి" శాంతమ్మ కంఠంలో నిరాశ పలికింది.

"పిల్లల ముందు మాట్లాడ్డం దేనికని...ఇలా రమ్మన్నాను. పదండి, వెళ్దాం" సుమిత్ర గుమ్మం వైపు తిరుగుతూ అంది.

ఇద్దరూ వచ్చి, సోఫాల మీద కూర్చున్నారు. సుమిత్ర భర్తవైపు సాభిప్రాయంగా చూసింది.

ఆనందరావు చిన్నగా దగ్గి, గొంతు సవరించుకున్నాడు. "బావగారూ, శుక్రవారం నాటికి తరవాతి శుభకార్యం ఏర్పాటుచేస్తాం. మీరూ అల్లుడుగారూ మీ ఇంటికి వెళ్ళండి. శుక్రవారం ఉదయం మీ ఇంటికి వచ్చి, లాంఛనంగా మిమ్మల్ని ఆహ్వానిస్తాం.."

"అమ్మాయికి ఆ మాత్రం విశ్రాంతి అవసరం అన్నారు డాక్టర్ శివానిగారు, అన్నయ్యగారూ" సుమిత్ర సంజాయిషీ ఇస్తున్నట్టుగా అంది.

"అలాగా? అలాగే చేద్దాం" శ్రీనాథరావు వెంటనే అన్నాడు.

వినయ్ శ్రీనాథరావు వైపు తిరిగాడు. "నాన్నా, మరిచిపోయారా? శుక్రవారం ఈవెనింగ్ ఫ్లయిట్‌కి సంధ్యా నేనూ తిరుపతి వెళ్తున్నాం.."

"ఓ మరిచేపోయా!" అంటూ శ్రీనాథరావు ఆనందరావు వైపు చూశాడు. "బావగారూ, ఏం చేద్దాం?"



## జరిగిన కథ

ఒక దాని తరువాత ఒకటిగా కంప్యూటర్ స్క్రీన్‌మీద ఫొటోలు జరిగిపోతున్నాయి. అన్నీ సంధ్య ఫొటోలే! అతనికి ఎటుచూసినా ఆమే కనబడుతోంది. ఆమెనే మంత్రముగ్ధుడిలా చూస్తూ తన తీయటి గతంలోకి జారుకుంటాడు వినయ్. అమెరికాలో ఉన్న వినయ్‌ని వెంటనే ఇండియా బయలుదేరి రమ్మంటూ తల్లి శాంతమ్మ ఫోన్‌చేస్తుంది. సడన్‌గా పెళ్ళిచూపులంటుంది. దానికి తండ్రి శ్రీనాథరావు, చెల్లెలు సుధ కూడా వంతపాడతారు. దాంతో ఇండియా వస్తాడు వినయ్. కుటుంబంతోసహా పెళ్ళిచూపులకి వెళతాడు. తొలిచూపులోనే సంధ్యను చూసి ఫ్లాటైపోతాడు. ఇద్దరినీ గదిలోకి పంపించి భావాలు, అభిప్రాయాలు పంచుకోమంటారు పెద్దలు. ఇద్దరూ ఒకరికి ఒకరు నచ్చినట్లుగా చెప్పుకుంటారు. ఇద్దరికీ పెళ్ళి జరుగుతుంది. శోభనం రాత్రి గదిలోకి అడుగుపెట్టిన సంధ్య ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. హాస్పిటల్‌కి తీసుకువెళతారు ఆమెని.

ఆ తర్వాత...

"తిరుపతి ప్రయాణం వాయిదా వేసుకుంటే?" ఆనందరావు వినయ్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"లేదు మామగారూ. పెళ్ళవగానే తిరుమల యాత్రచేసి, దర్శనం చేసుకుంటామని సంధ్యా నేనూ మొక్కుకున్నాం."

"పెళ్ళి జరగ్గానే కొడుకునీ, కోడల్నీ దర్శనానికి పంపిస్తానని ఎప్పుడో మొక్కు చేసుకున్నాన్నేను" శాంతమ్మ కల్పించుకుంటూ అంది.

"అవున్నాన్నా.. తిరుపతి వెళ్ళాల్సిందే.. అది నా సెంటిమెంటు. అమ్మకు చెప్పాను కూడా" సంధ్య అంది. ఆమె కంఠంలో అలసట జీరగా ధ్వనించింది.

"మొక్కు చేసుకుంటే, వెళ్ళి తీరాల్సిందే... ఎప్పుడు తిరిగొస్తారు?"

"ఆదివారం సాయంత్రం..." వినయ్ అన్నాడు.

"సరే... ఆదివారానికి ప్లాన్ చేద్దాం" ఆనందరావు వెంటనే అన్నాడు.

"అదే మంచిది. సోమవారం రాత్రి విమానానికి అబ్బాయీ, అమ్మాయీ అమెరికా వెళ్తున్నారు." శ్రీనాథరావు అన్నాడు.

"ఔనవును... అల్లుడుగారు చెప్పారు పెళ్ళికి ముందే. లీవు కూడా అయిపోతుందన్నారు" సుమిత్ర అంది.

"సరే.. ఆదివారం రాత్రికే ప్లాన్ చేయండి" శ్రీనాథరావు అన్నాడు.

"అనుకున్నట్టు ఆ కాస్త కార్యం కూడా విఘ్నం లేకుండా జరిగి ఉండి, పిల్లలు తిరుపతి యాత్రకి వెళ్తే బావుండేది" శాంతమ్మ నిరుత్సాహంగా అంది.

"ఫరవాలేదులే శాంతా! ఆ ఏడుకొండలవాడిని దర్శించుకుంటే అన్ని విఘ్నాలూ తొలగి పోతాయి!" శ్రీనాథరావు ఓదార్పుగా అన్నాడు.

"సరే.. లేవండి..వెళ్దాం.." శాంతమ్మ లేస్తూ అంది.

***

వినయ్ బరువుగా నిట్టూరుస్తూ, గత స్మృతుల్ని తరిమేస్తూ కుర్చీలో వెనక్కి వాలాడు. అతని చెయ్యి కదిలింది. కంప్యూటర్‌కి ప్రాణమొచ్చింది. మౌస్ మీద అతని వేలు కదులుతోంది. మళ్ళీ ఫొటోలు... సంధ్య ఫొటోలు, సంధ్యా తనూ ఉన్న పెళ్ళి ఫొటోలు. ఒకదాన్నొకటి వెంబడిస్తూ తరుముతున్నాయి. తిరుమల శిలాతోరణం దృశ్యం. ఆ దృశ్యం కంప్యూటర్ స్క్రీన్ మీద స్తంభించింది.

శిలాతోరణం ఫ్రేములో సంధ్యా తనూ. సంధ్య తల తన భుజం మీద; తన చెయ్యి ఆమె నడుం చుట్టూ. తన భుజం మీద ప్రేమగా వాలిన ఆ అందమైన తల తనకామె సామీప్యాన్ని, క్లోజ్‌నెస్‌ను తెలియజేస్తోంది. ఆమె సన్నటి నడుమును వడ్డాణంలా చుట్టిన తన చెయ్యి ఆమెకు తన సామీప్యాన్ని తెలియజేస్తోంది; అని అనుకున్నాడు ఆ క్షణంలో తను. పెద్దలు పెట్టే ముహూర్తంతో, పెళ్ళి తరువాత కార్యానికి పెట్టే ముహూర్తంతో పనిలేకుండా తమ సామీప్యం ఐక్యతగా వికసిస్తుందని కూడా అనుకున్నాడు తను. తమ దాంపత్యానికి నాంది కలియుగ వైకుంఠక్షేత్రంలో జరగాలని ఆ విధి సంకల్పించినట్టున్నాడని కూడా తనకి అనిపించింది. ఆ ఆలోచన, ఆ ఊహ ఆ శిలాతోరణం ముందు తన శరీరానికి గిలిగింతలు పెట్టింది.

కానీ ఏసి కాటేజీ బెడ్‌రూములో తన ఆలోచన తిరగబడింది. తన ఊహ, రెక్కలు కట్టుకున్న తన ఊహ ఎక్కడికో నిస్సహాయంగా ఎగిరిపోయింది. ఆ రాత్రి బాత్‌రూంలోంచి బెడ్ రూములోకి వచ్చిన





# ఆ అందాలు కనపడవేమో!

ఒక్కోసారి చిన్న తప్పుకు కూడా జీవితాంతం వగచాల్సి వస్తుంది. ప్రస్తుతానికి అనుష్క కూడా ఇదే పరిస్థితిలో ఉంది. ఓ సినిమా కోసం చేసిన సాహసం ఆమె కెరీర్‌కే ప్రశ్నార్థకంగా మారింది. 'సైజ్ జీరో' కోసం పెరిగిన బరువు ఎంత ప్రయత్నించినా తగ్గకపోవడంతో మునుపటి అనుష్కను తెరమీద చూడడం కుదరదేమో అని ఆమె అభిమానులు సైతం భయపడుతున్నారు. ఇక దర్శకనిర్మాతలైతే చెప్పనక్కర్లేదు. మామూలు సినిమాలకు అనుష్క ఇక సరిపోదు అన్న నిర్ణయానికి వచ్చేశారంటున్నారు. రాబోయే కాలంలో అనుష్క తెరమరుగు కావలసిందే అంటున్నారు సినీజనాలు. ఇదంతా అనుష్క స్వయంకృతాపరాధమేనట!

సంధ్య పరుపు మీదున్న తలగడను తీసుకుని గోడ వారగా ఉన్న సోఫా మీద పడుకుంది! అక్కడ ఎందుకు? బెడ్‌మీద పడుకో అన్నాడు తను. ఒంట్లో బాగాలేదా? అన్నాడు కూడా. ఒంట్లో బాగానే ఉందంది సంధ్య. తిరుమల పుణ్యక్షేత్రంలో భార్యాభర్తలు ఒకే పరుపు మీద పడుకోకూడదు అని మా అమ్మ చెప్పింది అంది తన ప్రశ్నకు సమాధానంగా సంధ్య. మా అమ్మ మాటలో చెప్పాలంటే తిరుమల క్షేత్రంలో దంపతులకు ఏకశయ్య నిషేధం ఉంది.

ఆశ్చర్యం నుంచీ, నిరాశ నుంచీ కోలుకోవడానికి తనకు కొంత సమయం పట్టింది. తను సోఫా దగ్గరగా వెళ్ళాడు. సంధ్యను మంచం మీద పడుకొమ్మన్నాడు. తను సోఫామీద పడుకుంటానన్నాడు. సంధ్య మౌనంగా లేచి వెళ్ళి మంచం మీద, సోఫా వైపు వీపు తిప్పి పడుకుంది. తను సోఫా మీద నడుం వాల్చాడు. కాసేపట్లో సంధ్య ప్రారంభించిన గురక సన్నగా తనకు జోల పాట పాడసాగింది. ఆ జోల పాట తనకు రాత్రంతా నిరంతరాయంగా సాగే మేలుకొలుపైంది. ఏదో అసహనం తనకు మనశ్శాంతిని దూరం చేసింది.

ఆలయంలో సుప్రభాతసేవ ప్రారంభమయ్యే వేళకు తనకు ఒక ఆలోచన తట్టింది. నిజమే నేమో... పుణ్యక్షేత్రంలో భార్యాభర్తలు దగ్గర కాకూడదేమో! అత్తయ్య ఆ ఆచారం తెలిసే సంధ్యకు జాగ్రత్త చెప్తూ హెచ్చరించిందేమో! ఆ విధమైన ఆలోచన తట్టిన సుప్రభాతవేళ తనకు నిద్ర పట్టింది.

ఆదివారం మధ్యాహ్నానికల్లా తనూ, సంధ్యా హైదరాబాద్ చేరుకున్నారు. సంధ్యను వాళ్ళింట్లో దింపేసి, తను తన ఇంటికి చేరుకున్నాడు. సాయంత్రం తన మామ ఆనంద రావు, అత్త సుమిత్ర రాత్రికి ఏర్పాటుచేసిన 'కార్యా'నికి తమ కుటుంబాన్ని ఆహ్వానించారు.

రాత్రి పది దాటింది. తను శోభనం గదిలో కూచున్నాడు సంధ్యకోసం ఎదురుచూస్తూ. తలుపు తెరుచుకుని సంధ్య లోపలికి వచ్చింది. ఆమె చేతిలో పాల గ్లాసు. వినయ్ లేచి నిలుచున్నాడు. రెప్పపాటు మరిచిపోయిన అతని కళ్ళు ఆమెనే చూస్తున్నాయి. లేత గులాబీరంగు చీర, అదే రంగు స్లీవ్‌లెస్ జాకెట్. గులాబీరంగు వస్త్రాల్లో బంగారు బొమ్మలా ఉంది సంధ్య. ఇద్దరూ కలిసి తిరుపతి యాత్ర వెళ్ళినా, కలిసి తిరుమల మీద తిరిగినా, ఒకే గదిలో ఉన్నా ఈ గదిలోకి అడుగుపెట్టేసరికి సిగ్గు సంధ్య సర్వస్వాన్నీ ఆవరించినట్టుంది. ఆ గులాబీరంగు దుస్తుల్లో, సిగ్గుతో గులాబి రంగు పూసుకున్న చెక్కిళ్ళతో, నేల చూపులు చూస్తున్న కళ్ళతో, సంధ్య అందానికే అందంలా కనిపించింది తన కళ్ళకి. ఆ దృశ్యం ఇప్పటికీ తనకు బాగా గుర్తుంది.

తను సంధ్య దగ్గరగా నడిచాడు. ఎడమచేత్తో పాల గ్లాసు తీసుకుని, కుడిచేత్తో ఆమె చేతిని పట్టుకుని గులాబీ రేకలతో, మల్లెపూలతో అందంగా కప్పబడిన మంచం వైపు నడిపించాడు. సంధ్యను మంచం మీద కూచోబెట్టి, ఆమె పక్కనే కూచున్నాడు తను. పాల గ్లాసుని ఆమె వైపు చాచాడు.

'ఆ పాలు మీకే...తాగండి' అంది సంధ్య. సంధ్య కంఠం కొద్దిగా వణికినట్టు అనిపించింది తనకు. నన్ను మీరూ గీరూ అనీ, ఏమండీ గీమండీ అనీ అనాల్సిన అవసరం లేదన్నాడు తను. ఆ మర్యాదలు ఔట్‌డేట్ అయిపోయాయన్నాడు. 'వినయ్' అని పేరు పెట్టి పిలిస్తే చాలన్నాడు. ఏకవచన ప్రయోగం భార్యాభర్తలను ఇంకాఇంకా దగ్గర చేస్తుందన్నాడు. తిరుమల యాత్ర సందర్భంలో కూడా చెప్పాడు తను. తరువాత శోభనం గదిలోనూ చెప్పాడు. అమెరికా వెళ్ళాక అలాగే పేరుపెట్టి పిలుస్తాను. ఇక్కడ మీరు అనే అంటాను అంది సంధ్య తనతో. అక్కడ అమెరికాలో తమిద్దరికీ కావాల్సినంత ఏకాంతం అని కూడా నవ్వుతూ అంది సంధ్య.

'ఈ పాలలో సగం నీ పాలు; సగం నా పాలు' అంటూ లోటా అందించాడు మళ్ళీ తను. మీరు తాగండి అంది. తను సగం తాగి, గ్లాసు ఆమెకి అందించాడు. 'నాకోసం తాగు' అన్నాడు తను, ప్రేమగా. సంధ్య గ్లాసు అందుకుంది. నోటి దగ్గరగా తీసుకెళ్ళి, కొద్దిగా ముఖం చిట్లించింది. గ్లాసు అంచుమీంచి తనను చూసింది. మీకోసం తాగుతా అంటూ కళ్ళు మూసుకుని గడగడా తాగేసింది. లోటాను తనకు అందిస్తూ, ఇబ్బందిగా చూస్తూ చేతి వెనక భాగంతో పెదవులు తుడుచుకుంది. కళ్ళు మూసుకుని, రెండు చేతుల్తో కణతలు నొక్కుకుంది. ఏమైందని ఆదుర్దాగా అడిగాడు తను. కళ్ళు తెరిచి తనవైపు నీరసంగా చూసింది. పాలల్లో యాలకుల పొడి కలిపారనీ, యాలకుల వాసన తనకు సరిపడదనీ అంది. రెండు చేతుల్తో ఆమె భుజాలు పట్టుకుని, నెమ్మదిగా వాల్చే ప్రయత్నం చేస్తూ కాసేపు విశ్రాంతిగా పడుకొమ్మన్నాడు తను. సారీ సంధ్యా, యాలకుల వాసన పడదని ముందే చెప్పాల్సింది అన్నాడు తను.

**తిరుపతి వెళ్ళారిద్దరూ. సంధ్య తల తన భుజం మీద, తన చెయ్యి ఆమె నడుం చుట్టూ వేసి నడుస్తూంటే, తనకామె సామీప్యం, క్లోజ్‌నెస్ తెలుస్తున్నాయి. పెద్దలు పెట్టే ముహూర్తంతో పనిలేకుండా, తమ సామీప్యం ఐక్యతగా వికసిస్తుందని అనుకున్నాడు. తమ దాంపత్యానికి నాంది తిరుమల క్షేత్రంలో జరగాలని విధి సంకల్పించినట్టుగా అనిపించింది. ఆ ఊహే మనసుకు గిలిగింతలు పెట్టింది. మరి వారిద్దరూ ఏకమయ్యారా?**

సంధ్య భుజాల మీదున్న తన చేతుల్ని దూరంగా తోసింది కొంచెం విసురుగానే. నోటికి చేతిని అడ్డం పెట్టుకుంటూ బాత్‌రూం వైపు పరుగెత్తింది. తను కంగారుగా ఆమెను వెంబడించి, బాత్‌రూం తలుపు ముందు ఆగాడు. తలుపు సగం తెరిచే ఉంది. సంధ్య ముందుకు వంగి సింక్‌లో వాంతి చేసుకుంటోంది. తను ఆందోళనతో బాత్‌రూంలోకి పరిగెత్తాడు. సంధ్య కొళాయి తిప్పింది. నీళ్ళు దూకుతున్నాయి. సంధ్య నోటిలోకి నీళ్ళుపోసు

కుని, పుక్కిలించి ఉమ్ముతోంది.

"సంధ్యా" అన్నాడు తను వెనక నుంచీ ఆమె భుజాలు పట్టుకుంటూ. సంధ్య కక్కుతున్నట్టు శబ్దం చేసింది. ఉమ్మివేసి, నోరు పుక్కిలించింది. దోసిలితో నీళ్ళు తీసుకుని ముఖం తుడుచుకుంది. కుళాయి ఆపి, వెనుదిరిగి, తన వైపు ఒకసారి చూసి అవతలికి నడిచింది.

భుజాలు పట్టుకుని తను సంధ్యను మంచం వైపు నడిపించాడు. సంధ్య నీరసంగా మంచం మీద వాలి, కళ్ళు మూసుకుని పడుకుంది. ఆమె ముఖం మీద నీటి చుక్కలు చెమట పూసల్లా కనిపించాయి. తను ఆమె నుదురు మీద చేతిని వేశాడు. లాల్చీ అంచుతో ప్రేమగా ఆమె ముఖాన్ని తుడిచాడు.

సంధ్య ఒకసారి కళ్ళు తెరిచి నీరసంగా అతని వైపు చూసి, కళ్ళు మూసుకుంది. అత్తయ్యను పిలుస్తానన్నాడు తను. వద్దు, అందరూ కంగారుపడతారు. చలిగా ఉంది. దుప్పటి కప్పండి. నాకేం కాదు... అంది వణికే కంఠంతో సంధ్య. తాను మౌనంగా దుప్పటిని ఆమె కాళ్ళ దగ్గర్నుంచీ కంఠం దాకా లాగాడు సున్నితంగా. సంధ్య కళ్ళు తెరిచింది. తన వైపు ఒకసారి చూసి బరువుగా కళ్ళుమూసుకుంది. డాక్టర్‌కి ఫోన్ చేస్తానన్నాడు తను. పెద్దవాళ్ళు భయపడిపోతారు... వద్దంది. అయాంసారీ... మిమ్మల్ని మళ్ళీ డిజప్పాయింట్ చేస్తున్నాను.. అమెరికాలో... మనం... అంటూ ఆవులిస్తూ పక్కకుతిరిగి దుప్పటిని చెవులదాకా లాక్కుంది.

కాసేపాగి ఎలా ఉందని అడిగాడతను. ఫరవాలేదంది. తెల్లారేసరికి సర్దుకుంటుందండి... మీరు పడుకోండి అంది. తను అటూఇటూ చూసి మంచం మీద పడుకున్నాడు. కాసేపట్లో సంధ్య ప్రారంభించిన సన్నటి గురక అర్ధాంగి తనకు పాడుతున్న జోలపాటలా వినిపించింది తనకు. రెండో మొదటి రాత్రి కూడా ఇద్దర్నీ దూరంగా ఉంచింది. ఇంకా బ్రహ్మచారిగానే ఉన్న తను పూర్ణపురుషుడుగా ఎదగలేదు. ఇంకా కన్యగానే ఉన్న సంధ్య పరిపూర్ణ స్త్రీగా ఎదగలేదు. మంగళసూత్ర ప్రాయంగా దంపతులైన సంధ్యా తనూ దాంపత్యపరంగా ఐక్యత సాధించ లేదు. మానసికంగా దగ్గరైన ఇద్దరూ శారీరకంగా దగ్గర కాలేదు. దేహపరంగా, దాంపత్యపరంగా ఐక్యమై పోయి, ఒకరికొకరుగా, ఒకరికోసమే మరొకరుగా ఒక్కటి కాలేదు, మమేకం కాలేదు. అర్ధనారీశ్వర తత్వాన్ని అందుకోలేదు! అర్ధనారీశ్వరులుగా రూపొందలేదు!

ఆలోచిస్తూ, బరువుగా నిట్టూర్చాడు తను. ఇద్దర్నీ ఒక్కటి చేయడానికి ఉద్దేశించిన రెండు తొలి రాత్రులు ఓడిపోయి తెల్లమొహాలు వేశాయి! రేపు సోమవారం. రేపు రాత్రి విమానానికే తమ ప్రయాణం. ఇద్దరూ ఇక్కడ, పుట్టిన గడ్డమీద సాధించలేక పోయిన లైంగిక ఐక్యతను అక్కడ అమెరికాలో సాధించాలి. తను ఓరగా సంధ్యవైపు చూశాడు. ఆమె కళ్ళు మూసుకునే ఉన్నాయి. లయబద్ధంగా సాగుతున్న ఆమె గురక ఆమె నిద్రలో కూరుకుపోయిందని చెప్తోంది. ఏసీని వెక్కిరిస్తూ మంచం ఎందుకో వేడిగా అనిపించింది తనకు. కదలిక తెలీకుండా మంచం దిగి, తనలాగా ఒంటరిగా ఉన్న సోఫావైపు నడిచాడు. నిలువుటద్దంలోంచీ ప్రతిబింబం తనవైపే చూస్తోంది. ఆ ముఖంలో, ఆ కళ్ళలో ఏదో నిరాశా, నిస్పృహా, నిస్సహాయతా పెనవేసుకుని ప్రత్యక్షమవుతున్నాయి. తాను ప్రతిబింబం వైపు చిరునవ్వు నవ్వాడు. ప్రతిబింబం తన వైపు చిరునవ్వు నవ్వింది. అయితే ఆ చిరునవ్వులో జీవం లేదు.

సోఫాలో వెల్లకిలా శరీరాన్ని పడవేసి, ఆలోచనల్లో మునిగిపోతూ కళ్ళుమూసుకున్నాడు తను. "అమెరికాలో..మనం.." అంటూ నిద్రమత్తులో సంధ్య అన్న మాటలు గుర్తొచ్చాయి అతనికి. అమెరికాలో... యస్.. అక్కడ ఇద్దరూ ఒకరికి ఒకరుగా, నాకు నువ్వు నీకు నేను అనే విధంగా ఉంటారు. ఉండి తీరాలి. తనతో బాటు అమెరికాలో అమ్మానాన్నా ఉండరు. సుధ ఉండదు. సంధ్యతో పాటు ఆమె తల్లిదండ్రులు ఉండరు. ఆమెకు అందరూ తనే! తనకు అందరూ ఆమే! పరిచయం ప్రణయంగా ఎదుగుతుంది. స్నేహం సాన్నిహిత్యంగా, సాహచర్యంగా ఎదుగుతుంది. ఇద్దర్నీ ఐసోలేషన్ దగ్గర చేస్తుంది. ఏకాంతం ఒక్కటిచేస్తుంది. అర్ధనారీశ్వర స్వరూపులుగా మారుస్తుంది! ఇవాళ, ఈ రాత్రి శోభనం పెళ్ళికొడుకూ, శోభనం పెళ్ళికూతురూ ఒక్కటి కాలేదన్న చేదునిజాన్ని తను బైటపెట్టడు. సంధ్య కూడా బైటపెట్టదు. ఎవ్వరికీ చెప్పొద్దని తనామెకు చెబుతాడు. నిజం తెలిస్తే, తన తల్లిదండ్రులు, సంధ్య తల్లిదండ్రులు విషాదంలో మునిగిపోతారు!

నిజం వాళ్ళెవ్వరికీ తెలీకుండా తను జాగ్రత్తలు తీసుకుంటాడు. మంచం మీద సువాసనలు వెదజల్లుతున్న పువ్వుల్ని నలిపి పడేస్తాడు. సంధ్య గాఢ నిద్రలో మునిగిపోయాక, ఆమె పెట్టుకున్న కాటుక చెరిపి వేస్తాడు. ఆమె లిప్‌స్టిక్‌ని కూడా చెరిపివేస్తాడు. అవన్నీ పెద్దవాళ్ళు ఆశించినదంతా జరిగి

## మా అపార్ట్‌మెంట్ లిఫ్టు




*తెల్లవారగట్లే మొదలవుతుంది హడావుడి*
*బర్రుమంటూ గ్రిల్లు లాగిన చప్పుడు!*
*అది మూసుకోవడం కాస్త ఆలస్యమైతే చాలు*
*"ప్లీజ్ క్లోజ్ ద డోర్ ..*
*దయచేసి తలుపు మూయండి..*
*కృపయా ..."*
*త్రిభాషా సూత్రాన్ని అమలుచేస్తూ*
*తలుపు మూతపడేవరకు ఒకటే సణుగుడు!*

*చిల్లులు పడ్డ పాలప్యాకెట్ల లోంచి*
*బొట్లు బొట్లుగా కారిన చుక్కల ముగ్గుల మధ్య*



*నిలబడ్డ ప్రతీ శాల్తీనీ*
*మౌనంగా పలకరిస్తుంది!*

*ఆవరణలో స్కూలు బస్సు హారన్ వినగానే*
*కడుపునొప్పి నటించిన మనవడి నోట్లో*
*తాతయ్య పెట్టిన లంచానికి గుర్తుగా చాక్లెట్ రేపర్.....*

*ఓవర్ హెడ్ ట్యాంక్ వాల్వ్ విప్పడానికి వెళ్ళిన*
*వాచ్ మేన్ ప్యాంటు జేబు కన్నం లోంచి*
*రాలిపడ్డ ఖాళీ గుట్కా ప్యాకెట్.....*
*నలిగి నలిగి అమీబాలాగా ఆకారాలు*
*మార్చుకుంటాయి!*

*టెర్రస్ మీద పెట్టిన కుండీలోని తులసమ్మ*
*పూజకోసం*
*పక్క ఫ్లాట్ బామ్మగారు తీసుకెళ్ళిన*
*అగరొత్తులు..*
*ఉదయాన్నే ఉద్యోగానికి బయల్దేరే*
*ఆవిడ కోడలి జడలోని మరువం,మల్లెలు..*
*టిఫిన్ బాక్సు అంచులకు*
*తుడిచీ తుడవని పచ్చడి చారలు..*
*వీటన్నిటి పరిమళాల కలగలుపునూ*
*నిలువెల్లా పూసుకొని ..*
*ఒంటి నిండా పచ్చబొట్లు లాంటి*
*వ్యాపార ప్రకటనల స్టిక్కర్లనీ,*
*కౌమారదశ ముద్రించిన చిలిపి లిపుల్నీ,*
*కాలక్షేపం కోసం చదువుకుంటూ...*
*అందరికన్నా చివర్న వచ్చే చెత్తడబ్బాను చూసి*
*ముక్కు మూసుకోకుండా*
*చెలిమి హస్తాన్ని అందిస్తుంది*
*మా అపార్ట్‌మెంట్ లిఫ్ట్!*

**-ఓలేటి శ్రీనివాసభాను**
**సెల్: 94405 67151**

నట్టు చెదిరిన ఆనవాళ్ళు తెలియజేస్తూ ఆనందాన్ని అందిస్తాయి వాళ్ళకు! ఔను! అదే మంచిది. ఆలోచనలకు స్వస్తిచెబుతూ తను రిస్ట్‌వాచ్ చూసుకున్నాడు. రెండున్నర దాటింది. రేపు ఈ సమయానికి ఇద్దరూ ఆకాశయానంలో ఉంటారు. రాని నిద్రకు ఆహ్వానం పలుకుతూ కళ్ళను రెప్పల్తో మూశాడు తను.

***

విమానం దూదిపింజల్లాంటి తెల్లటి మేఘాలను పక్కలకు తోస్తూ ఆకాశంలోకి దూసుకుపోతోంది. బిజినెస్ క్లాస్‌లో గవాక్షం పక్కన కూచున్న సంధ్య నీలాకాశంలో దొంతరలు కట్టిన మేఘాలను ఆసక్తిగా చూస్తోంది. లండన్ దాటి, ప్రయాణం శాన్‌ఫ్రాన్సిస్కో వైపు సాగుతోంది. వినయ్ ఓరగా సంధ్యను చూశాడు.

ఇంతసేపు మేఘాలు చూసిన సంధ్య తల ఇప్పుడు వెనక్కి వాలి ఉంది. కళ్ళు మూసుకుని ఉన్నాయి. నునుపు తేలిన బుగ్గ. చెవిని అంటిపెట్టుకుని వేలాడుతున్న రింగు ఆమె చెంపకు బంగారు రంగును పులుముతోంది. లేత నీలిరంగు చీర, స్లీవ్‌లెస్ జాకెట్. సంధ్య చేతి మీద చిన్నప్పుడు టీకాలు వేసిన గుర్తులు లేవు. వినయ్ చూపులు మళ్ళీ సంధ్య ముఖం మీదికి ఎగబాకాయి. ఆరోగ్యానికీ, అందానికీ పట్టిన అద్దంలా మెరుస్తోంది సంధ్య చెంప. అందం సంధ్యగా అవతరించి తన అర్ధాంగి అయ్యింది!




వినయ్ కళ్ళు మూసుకున్నాడు. అమ్మా నాన్నలూ, సుధా, అత్తమామలూ ఇచ్చిన వీడ్కోలు దృశ్యం వినయ్ మూసిన కళ్ళముందు ప్రత్యక్షమైంది.

నాన్న దుఃఖాన్ని చిరునవ్వుగా మార్చే ప్రయత్నం చేస్తూ, తనని కౌగిలించుకున్నాడు. "సంధ్యను జాగ్రత్తగా చూసుకో. అమ్మాయిమీద ఎప్పుడూ కోపం తెచ్చుకోకు. కోపం నటించు; అవసరమైతే. అది సంతోషాన్ని రెండింతలు చేస్తుంది. ఎప్పుడయినా పెళ్ళాం కోప్పడితే ఆవేశానికి లోనుకావద్దు. కోపంతో ఉన్న కోమలి అందాన్ని చూడు!"

కౌగిలించుకుని, గెడ్డాన్ని తన భుజం మీద ఆన్చి చెవిలో ఉపదేశం చేసిన నాన్న ఎడంగా జరిగి చిరునవ్వుతో చూశాడు. మరుక్షణం తాను అమ్మ కౌగిలిలో ఉన్నాడు. అమ్మ తల పైభాగం తన గెడ్డం కింద ఆనింది. కొడుకుకు వీడ్కోలు పలుకుతున్న దుఃఖం ఆమె శరీరాన్ని కంపింప చేస్తోంది. వినయ్ అమ్మను రెండుచేతుల్తో పొదివి పట్టుకున్నాడు. ఆమె తలమీద సున్నితంగా చుంబించాడు.

"అమ్మా, ఇలా చూడు... నేను మళ్ళీ వస్తాగా!" వినయ్ అమ్మ వీపు నిమురుతూ అన్నాడు.

శాంతమ్మ దూరంగా జరిగి, తల కొద్దిగా పైకెత్తి వినయ్ ముఖంలోకి కన్నీటి తెరల గుండా చూసింది. "మొదటి పెళ్ళిరోజు పండక్కి మీరిద్దరూ ముగ్గురుగా రావాలి. నా చేతులకి మనవణ్ణి ఇవ్వాలి!"

వినయ్ అలాగే అన్నట్టు తల ఊపాడు. శాంతమ్మ రెండుచేతుల్తో వినయ్ బుగ్గల్ని నిమిరింది. వణుకుతున్న ఆమె వేళ్ళు ధ్వనిలేని భాషలో ఆమె వాత్సల్యాన్ని వ్యక్తం చేశాయి.

"అన్నాయ్.." సుధ బొంగురుగా అంటూ దగ్గరగా వచ్చింది.

వినయ్ చెల్లెల్ని ఆప్యాయంగా తన చేతుల్లో బంధించాడు. "ఏయ్ సుధా! ఏడుస్తున్నావ్! త్వరలో మళ్ళీ వస్తాను. నువ్వు కోరే కుర్రాడితో పెళ్ళి జరిపిస్తాను. ఇద్దర్నీ హనీమూన్‌కి అమెరికా తీసికెళతాను. ఇదిగో..ఏడవకమ్మా..."

"అమ్మాయ్! అన్నయ్యకూ, వదినకూ నవ్వుతూ వీడ్కోలు చెప్పు!" శ్రీనాథరావు హెచ్చరించాడు.

సుధ వెనక్కి జరిగి, కళ్ళు తుడుచుకుని, చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేసింది. తల్లిదండ్రులిద్దర్నీ కౌగిలించుకుని, కన్నీళ్ళు తుడుచుకుంటూ సంధ్య అత్తమామల దగ్గరగా నడిచింది. ఒక్కసారి వారి ముఖాల్లోకి చూసి, తల వాల్చుకుంది. శ్రీనాథరావు చెయ్యి సంధ్య తల మీద వాలింది. "సుఖ సంతోషాలతో ఉండమ్మా!"

శాంతమ్మ కోడల్ని దగ్గరగా తీసుకుంది. కుడిచేత్తో కోడలి చుబుకాన్ని పట్టుకుంది. "పెళ్ళయ్యాక అమ్మనూ, నాన్ననూ వదిలి దూరంగా వెళ్ళడం ఆడపిల్లకు ఎంత కష్టమో నాకు తెలుసమ్మా. నువ్వు అడిగినప్పుడు ఇండియాకు తీసుకురమ్మని వినయ్‌కి చెప్పాను. క్షేమంగా వెళ్ళి పుత్ర లాభంతో రామ్మా!"

సంధ్య సుధను కౌగిలించుకుంది. రెండు నిమిషాల పాటు ఇద్దరూ బొమ్మల్లా చలనం లేకుండా ఉండిపోయారు. "వదినా... రిపోర్టింగ్ టైం దగ్గర పడుతోంది" సుధ కంఠం గాద్గదికంగా ధ్వనించింది. సంధ్య సుధను వదిలేసి, వినయ్ వద్దకు నడిచింది. వినయ్ చొరవగా ఆమె భుజాల చుట్టూ చేతిని వేశాడు.

వినయ్ వీడ్కోలు జ్ఞాపకాల గతంలోంచి వర్తమానంలోకి వచ్చాడు. అతని తల అసంకల్పితంగా సంధ్య వైపు తిరిగింది. సంధ్య నిద్రలోకి జారుకున్నట్టుంది. ఆమె తల తన భుజం వైపు వాలుతోంది. వినయ్ ఆమె వైపు కొద్దిగా వాలాడు. ఆమె తలని సున్నితంగా తన భుజం మీదికి వాల్చుకున్నాడు. సంధ్య నిద్రలోనే సర్దుకుంటూ కొద్దిగా కదిలింది. ఆమె నుదురు వినయ్ చెవికింద మెడకి చల్లగా తగిలింది. వినయ్ తల సంధ్య తల మీద వాలింది. 'చేరువలోనే ఉంటూ దూరంగా మసిలే ఇద్దర్నీ తమ వాళ్ళంటూ లేని సుదూర ప్రాంతానికి తరలిస్తే తమ మధ్య ఉన్న దూరాన్ని దూరం చేస్తూ దగ్గరవుతారు' ఎవరో మనో వైజ్ఞానికుడు ఎక్కడో చెప్పినట్టు గుర్తొచ్చి వినయ్ చిన్నగా నవ్వుకున్నాడు.

అమెరికా తమ ఇద్దరికీ కావాల్సినవాళ్ళు ఎవ్వరూ లేని ఏకాంత ప్రదేశం. ఏలియన్ ప్లేస్! భార్యాభర్తలుగా రూపొందాక కూడా దంపతులుగా దగ్గరకాలేకపోయినా, సంధ్యనూ, తననూ అమెరికాలోని ఏకాంతం దగ్గర చేస్తుంది. ఇద్దర్నీ ఒక్కటి చేస్తుంది! మధురమైన ఊహలతో వినయ్ విశ్రాంతిగా కళ్ళు మూసుకున్నాడు.

***

విమానం కిందకి దిగుతోంది. సంధ్య కిటికీలోంచి కిందికి చూస్తోంది. ఎన్నో రహస్యాలను గర్భంలో దాచుకున్న పసిఫిక్ మహాసముద్రం ఆకుపచ్చరంగులో కనిపిస్తోంది, మహా శాంతంగా. విమానం గూటి వైపు దిగుతున్న పక్షిలా శాన్‌ఫ్రాన్సిస్కో వైపు దిగుతోంది. శాన్‌ఫ్రాన్సిస్కో నగరం వరసలుగా అందంగా పేర్చిన పెట్టెల్లా ఉన్న కట్టడాలతో ఇంపుగా కనిపిస్తోంది. స్కేలుపెట్టి గీసిన గీతల్లా ఉన్న రోడ్లు... చీమల్లా కదులుతున్న కార్లు... విమానం కిందికి దిగేకొద్దీ దృశ్యాలు మారుతున్నాయి. గోల్డెన్ గేట్‌బ్రిడ్జ్. ఐదు దశాబ్దాల క్రితం దుర్భేద్యమైన చెరసాలగా పేరుపొంది, ఇప్పుడు టూరిస్ట్ స్పాట్‌గా మారిన 'ఆల్‌కట్రాజ్'..

విమానం నింగిలోంచి నేలమీదకు దిగి, రన్‌వే మీద జారుతూ గమ్యం చేరుకుంటోంది.

***(ఇంకా వుంది)***

సురభి

## నవ్వుల రాణి!

మిస్ యూనివర్స్, మిస్ వరల్డ్, వరల్డ్ స్మైలీయెస్ట్ టైటిల్స్ ఇచ్చినట్లుగానే ఈ శునకానికి కూడా స్మైలీయెస్ట్ శునకంగా టైటిల్ ఇచ్చేశారు. యునైటెడ్ కింగ్‌డమ్, ఆక్స్‌ఫర్డ్‌షైర్, బిస్టర్‌కి చెందిన జిల్ కాక్స్ పెంపుడు శునకం బఫ్ఫీ జాక్ రస్సెల్. దాని మొహం చూస్తే నవ్వుతున్నట్టే ఉంటుంది. మనసు బాలేనివారు, డిప్రెషన్‌లో ఉన్నవారు ఈ కుక్క మొహం చూస్తే చాలు అన్నీ ఇట్టే మర్చిపోతారు అంటోంది జిల్‌కాక్స్. అంతేకాదు సోషల్‌మీడియాలో దీనికి ఫాలోయర్స్ కూడా బోలెడంతమంది ఉన్నారు. దాంతో సెల్ఫీలు తీసుకోడానికి వస్తామంటూ ఫోన్లు చేస్తుంటారట. ఫోటోలో చూస్తే నిజమేననిపిస్తోంది కదూ!



## పడవల గ్రామం

అనగనగా ఓ గ్రామం. అక్కడ ఎటుచూసినా పడవలే. ఇళ్ళు మచ్చుకైనా కనబడవు. ఎందుకంటే అక్కడ ఉండేవారంతా పడవలలోనే నివసిస్తారు మరి. ఫ్రాన్స్‌లోని ఇంగ్లీష్ ఛానల్ ఒడ్డునున్న చిన్న గ్రామం ఈక్విహెన్ ప్లాజ్. ఆ గ్రామంలోని వారంతా ఒకప్పుడు చేపలవేటతో జీవనం సాగించేవారు. అప్పట్లో వాళ్ళు పాడుబడ్డ బోట్లనే తలకిందులు చేసి ఆవాసాలుగా మార్చుకున్నారు. కానీ రెండో ప్రపంచ యుద్ధం సమయంలో వారి నివాసాలన్నీ నేలమట్టం అయ్యాయి. అది జరిగిన 60 సంవత్సరాల తరువాత 1990లో తిరిగి పాడుబడిన పడవలన్నింటినీ ఒకచోట చేర్చి, వాటిని తలకిందులు చేసి, చిన్న గ్రామంగా రూపొందించారు. అధునాతన హంగులతో గ్రామాన్ని పునర్నిర్మించారు. చిన్న చిన్న తలుపులు ఏర్పాటుచేసి గదులుగా నిర్మించారు. అందులో సకల సౌకర్యాలు కల్పించారు. దీంతో పర్యాటకులను విపరీతంగా ఆకర్షిస్తోందీ గ్రామం. ఎంతోమంది ఔత్సాహికులు ఆ గ్రామం సందర్శించడానికి, అందులో విడిది చేయడానికి ఆసక్తి చూపిస్తున్నారు.



## వారం పాటు అక్కడే!

చీకటి గదిలో ఎటూ కదలలేని స్థితిలో ఒక్కరోజు గడపగలరా ఎవరైనా? అసలు ఉండగలరా? అమ్మో అనుకుంటున్నారు కదూ! కానీ అబ్రహం అలా అనుకోలేదు. ఒక్కరోజు కాదు ఏకంగా వారం రోజులపాటు ఎటూ కదలని స్థితిలో ఓ రాతిలో కూర్చుండిపోయాడు.

ఫ్రెంచ్ ఆర్టిస్ట్ అబ్రహం పోయిన్‌చెవల్. 44 ఏళ్ళ వయసులో అతని శరీర సౌష్టవానికి తగ్గట్టుగా తొలిచిన, రెండు బ్లాకులుగా ఉన్న లైమ్‌స్టోన్ రాయిలో ఫిబ్రవరి 22న ఎంటరయ్యాడు. పారిస్ మ్యూజియంలో ఉందీ రాయి. తనకు కావలసిన సరంజామా, నీళ్ళు, ఆహారం పెట్టుకోవటానికి వీలుగా అందులోనే అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు. వారం రోజులపాటు అందులోనే గడిపాడు. 'ఎటు చూసినా చీకటి. రాత్రో పగలో అర్థం కాని పరిస్థితి. అంతా అగమ్యగోచరం. నిద్ర వచ్చేదికాదు' అంటూ రాతిలో తన పరిస్థితిని చెప్పుకొచ్చాడు అబ్రహం. అతడు ఇంతకుముందు కూడా ఇలాంటివి చేశాడట! నిజంగా ఏడు రోజులు బయటిప్రపంచంతో సంబంధం లేకుండా గడపటమంటే మాటలు కాదు.



## గ్రాడ్యూ వెడ్డింగ్!

ఈమధ్యనే లిన్నే అనే ఆవిడ స్వీయవివాహం చేసుకోవటం విన్నాం. అదే తరహాలో ఓ అమ్మడు తన గ్రాడ్యుయేషన్ సర్టిఫికెట్‌ని వివాహం చేసుకోబోతోంది.

హ్యూస్టన్‌కి చెందిన ఏంజీ టెక్సాస్ యూనివర్సిటీలో డిగ్రీ పూర్తి చేసి డిప్లొమా తీసుకుంది. పెళ్ళిలాగానే డిగ్రీ సర్టిఫికెట్ కూడా జీవితంలో ఒక్కసారే వస్తుందని భావించి, దాన్నే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంది. పెళ్ళిదుస్తులు కుట్టించుకుంది. కేక్ ఆర్డర్ చేసింది. మామూలుగా పెళ్ళి తంతు ఎలా జరుగుతుందో అలాగే జరిగేట్టు అన్ని ఏర్పాట్లు చేసుకుందీ అమ్మడు. అంతేకాదు, తన వివాహం గురించి తెలియజేయడానికి ప్రత్యేకంగా ఓ వెబ్‌సైట్ తయారుచేసింది. మే 13న జరగబోయే తన వివాహానికి ఫ్రెండ్స్, బంధువులు అందరికీ ఆహ్వానం పంపింది. ఈ 'గ్రాడ్యూ వెడ్డింగ్' ద్వారా నేను సాధించిన చదువు గురించి అందరికీ గొప్పగా చెప్పాలనుకుంటున్నాను. 'మహిళలు తమ జీవితాల్లో వివాహానికి ఎంత ప్రాధాన్యమిస్తారో, వారి విద్యార్హతకీ అంతే ప్రాధాన్యమివ్వాలి' అంటోంది ఏంజీ. వెర్రి వేయివిధాలంటే ఇదేనేమో!




## బొమ్మల బామ్మ

చుట్టూ బొమ్మలు పెట్టుకుని, మధ్యలో ఠీవీగా కూర్చున్న ఈ బామ్మగారెవరో ఏదో బొమ్మల షాపులో ఉంది అనుకుంటున్నారు కదా! కానీ ఆమె బొమ్మల షాపులో లేదు. తన ఇంట్లోనే, తను సేకరించిన బొమ్మలమధ్యనే కూర్చుంది. 86 సంవత్సరాల కేథరిన్ బ్లోమెన్ బ్రస్సెల్స్ నివాసి. 65 సంవత్సరాలుగా ఈ బొమ్మలను సేకరిస్తోందట. అంటే తనకు 21 ఏళ్ళ వయసులోనే ఈ బొమ్మల సేకరణ ప్రారంభించిందన్న మాట. ఆమె దగ్గరున్నవన్నీ టెడ్డీబేర్, స్టఫ్డ్ బొమ్మలే! ఇవన్నీ కలిపితే 20 వేలకు పైగానే ఉన్నాయట. లివింగ్‌రూం, బెడ్రూం అనే తేడా లేకుండా, ఇంటిని మొత్తం బొమ్మలతోనే నింపేసింది కేథరిన్. ఆ ఇంట్లో ఎటు చూసినా, ఎక్కడ చూసినా బొమ్మలే కనబడతాయి. భలే మంచి హాబీ కదూ!



–నర్మద వాసిరెడ్డి



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 31

(గతవారం తరువాయి)

**తన సినిమాలో పనిచేసే ఆర్టిస్టులను పువ్వులా చూసుకుంటారు రాఘవేంద్రరావుగారు. వారి అవసరాలను అనుక్షణం కనిపెట్టిమరీ తీరుస్తారు. ఒకసారి అలీ అవసరం పడి రాఘవేంద్రరావుగారు కో-డైరెక్టర్‌తో ఫోన్ చేయించారు. అప్పుడే అలీకి పెళ్ళయిందని తెలిసింది.**

అలీ ఫోన్ అటెండ్ చేసి 'నాకు పెళ్ళి సార్. ఇవాళ నేను షూటింగ్‌కి రావడానికి కుదరదు. ఇవాళ ఇంట్లో వాళ్ళు ఏవో అరేంజ్‌మెంట్స్ చేస్తున్నారు. రావడానికి కుదరదండీ' అన్నాడట.

ఇక కో-డైరెక్టర్ చేసేదేమీ లేక రాఘవేంద్రరావు గారికి విషయం చేరవేశాడట.

## ఆ హీరో, ఓ యాంగిల్‌లో అమితాబ్‌లా ఉంటాడు

ఆయన అంతా విని 'అవన్నీ నేను చూసుకుంటానని చెప్పు. అర్జంటుగా అలీని, ఫ్యామిలీతో పాటు ఫ్లైట్ ఎక్కి హైదరాబాద్ వచ్చేయమని చెప్పు' అన్నారట. కో-డైరెక్టర్ ద్వారా అంతా విన్న అలీ... ఎంతో అర్జంట్ అయితే తప్ప దర్శకేంద్రుడు ఇలా పిలవడని అర్థం చేసుకుని ఫ్యామిలీతో సహా భాగ్య నగరానికి వచ్చేశాడట. ఆ వేళ చాలామంది ఆర్టిస్టుల కాంబినేషన్‌లో అలీ సీన్లు చేశాడట. సాయంత్రం రాఘవేంద్రరావుగారే అలీకి ఓ మంచి హోటల్‌లో ఫస్ట్ నైట్ అరేంజ్ చేశారని విన్నాను. అంటే ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే అవతలి వ్యక్తి మంచీ చెడుల గురించి ఆలోచించే దర్శకులు ఉండటం అరుదు. అలా అన్నిటినీ అర్థం చేసుకుంటారు కాబట్టే రాఘవేంద్రరావుగారితో పనిచేయాలని అందరూ మళ్ళీ మళ్ళీ కోరుకుంటారు.

### రవితేజకి అది తెలుసు

ఓ దర్శకుడిగా రాఘవేంద్రరావుగారిని ఎలా ఇష్టపడతానో, అలాగే రవితేజని ఓ హీరోగా ఇష్టపడతాను. రవితేజ జెన్యూన్‌గా కష్టపడేటటువంటి కథానాయకుడు. అతని దగ్గర నాకు నచ్చేది ఏంటంటే అతను ఏమిటో అతనికి చాలా బాగా తెలుసు. అతని కెపాసిటీ గురించి అతనికి బాగా తెలుసు. వ్యక్తిగా, ఆర్టిస్టుగా తనకు తాను మంచి విమర్శకుడు. తన దగ్గరకు వచ్చిన కథలను కరెక్ట్‌గా జడ్జ్ చేసుకోగలిగిన హీరో. అతను హీరోగా నటించిన సినిమాల్లో మా కాంబినేషన్‌లో తొలిసారి అందరి దృష్టినీ ఆకర్షించిన చిత్రం 'ఇడియట్'.

అందులో నేను పోలీస్ కానిస్టేబుల్ వేషం వేశా. రవితేజ నా కొడుకు వేషం వేశాడు. 'ముత్యాల ముగ్గు' సంగీత నా భార్యగా నటించింది. ఆ చిత్రంలో పొద్దున్నే జరిగే ఒక సీన్ ఉంటుంది. నాకు ఇప్పటికీ ఆ సీన్ చాలా ఇష్టం. ఉదయాన్నే లేచి నేను దేవుడికి దణ్ణం పెట్టి 'నాకున్నది ఒకటే కోరిక. అది నాకూ తెలుసు.. నీకూ తెలుసు.. రోజూ గుర్తు చేస్తున్నానని ఏమీ అనుకోవద్దు' అని అంటా. అంతలో నా భార్యగా చేసిన సంగీత నావైపు కోపంగా చూసి కూతురిని ఉద్దేశించి 'ఆ ప్లేట్ ఇటు తీసుకురావే' అంటుంది. చెల్లెలు క్యారెక్టర్ చేసిన పిల్ల ప్లేటులో దోశ తీసుకెళ్ళి రవితేజకు ఇస్తుంది. అతను నిలబడి తింటుంటాడు. అతను ఎక్కడుంటే అక్కడికి వెళ్ళి పక్కనే నిలబడి చూస్తూ ఉంటా. నేను చూస్తూ ఉండటాన్ని గమనించిన రవితేజ అక్కడి నుంచి వెళ్ళి సోఫాలో కూర్చుని తింటాడు. నేను సోఫా దగ్గరకువెళ్ళి చెప్పులు విప్పేసి, అతనికి ఎదురుగా కింద కూర్చుని గడ్డం కింద చేయి పెట్టుకుని చూస్తూ ఉంటా. కాసేపు నన్ను చూసి తినడం మానేసి 'అబ్బా అట్టా సూడకు నాన్నా.. సిగ్గేస్తుంది' అంటాడు.

'నీకు సిగ్గు కూడా ఉందంట్రా..' అని వెటకారంగా నవ్వుతూ 'ఏరా నువ్వు తినే తిండికి, నువ్వు చదివే చదువుకి ఏమన్నా బ్యాలన్స్ అవుతుందంట్రా...'అని చేతుల్ని తక్కెడలా పెట్టి చూపిస్తా.

'నువ్వు తినేది ఇంత.. చదివేది ఇంత' అని చేతుల్ని పరస్పరం విరుద్ధంగా చేసి చూపిస్తా.. ఆ సీన్ పూరి జగన్నాథ్ ఎలా రాసుకున్నాడోగానీ, పక్కా మధ్యతరగతి తండ్రి మనస్తత్వం అండీ అదీ. మధ్యతరగతి తండ్రికి, ఎదిగిన కొడుకుకు ప్రతి ఇంట్లో దాదాపుగా అలాంటి సీన్లు జరుగుతుంటాయి. ఎందుకో తెలియదుగానీ తల్లి ఎప్పుడూ మగపిల్లల్ని వెనకేసుకుని వస్తుంటుంది. 'ఇడియట్' లోనూ అంతే. రవితేజ చాలా నేచురల్‌గా నటించాడు. ఆ సీనే కాదు, టీ షాప్ దగ్గర హీరోని, ఫ్రెండ్స్‌ని చితకబాదే సీను, కోపంగా నేను ఇంటికి వచ్చి చిందులు వేస్తుంటే రవితేజ కోసం వచ్చిన ఫ్రెండ్‌ని చేతిలో ఉన్న చెంబుతో కొట్టే సీను.. అప్పట్లో థియేటర్లలో చాలా మెప్పించాయి. ఇవి ఎంత బావుంటాయో ఈ చిత్రంలో కొన్ని సెంటిమెంట్ సీన్లు కూడా అంతే బావుంటాయండీ. నటుడిగా రవితేజను చూసి నేను గర్వపడ్డ సినిమా ఇది.

అంతకు ముందు కూడా చిరంజీవిగారి 'అన్నయ్య'తో పాటు ఏడెనిమిది సినిమాలు రవితేజతో చేశాను కానీ 'ఇడియట్' చూశాక నాకు రవితేజ అంటే ఏంటో తెలిసింది. మంచి ఈజ్ ఉన్నటు



వంటి ఆర్టిస్ట్. టిపికల్‌గా ఉంటుంది తన స్టైల్. అతని వాయిస్ గమ్మత్తుగా ఉంటుంది. డైలాగులు చెప్పడంలో తనకంటూ ఓ స్టైల్ ఉంటుంది. ఆ వెటకార ధోరణిని సినిమా సినిమాకూ చాలా పెక్యూలియర్‌గా మార్చుకుంటూ, ఎక్కడా బోర్ కొట్టనీయకుండా, మొనాటనీ రానీయకుండా జాగ్రత్తగా వెళ్తున్నాడు. ఆ మధ్య రవితేజతో 'మిరప కాయ', 'షాక్' అని రెండు చిత్రాలు హరీశ్ దర్శకత్వంలో చేశా. ఆ తర్వాత కూడా చాలా చేశా. అతనిలో నాకు బాగా నచ్చింది ఫ్రాంక్‌నెస్. సెట్లో సరదాగా ఉంటాడు. రవితేజ సెట్లో ఉంటే మొత్తం సందడి సందడిగా ఉంటుంది. పూర్తిగా పాజిటివ్ ఎనర్జీతో అందరూ కళకళలాడుతుంటారు. ఇవన్నీ నేను అతనిలో అబ్జర్వ్ చేసిన విషయాలు. అందుకే



**జెన్యూన్‌గా కష్టపడేతత్వంగల కథానాయకుడు అంటూ రవితేజను మెచ్చుకుంటారు కోట శ్రీనివాసరావు. కరెక్ట్‌గా జడ్జిచేసి కథలు ఎంపిక చేసుకుంటాడనీ, మంచి ఈజ్, టిపికల్ స్టైల్ ఉన్న నటుడనీ రవితేజను ప్రశంసిస్తారు కోట. మరో యాంగిల్‌లో చూస్తే అతడు అమితాబ్‌లా ఉంటాడంటారాయన. కొన్ని రకాల హెయిర్ స్టైల్స్‌లో అలా ఉంటాడని చాలమంది మెచ్చుకున్నారట కూడా!**

ఎవరైనా రవితేజ గురించి అడిగితే 'హుషారైన కుర్రాడు' అని చెబుతా. అతను పెద్దవాళ్ళతో రెస్పెక్ట్‌గా మాట్లాడుతాడు.

వీటన్నిటితోపాటు అతనికి సంబంధించిన మరో ముఖ్యమైన విషయం.. అతను అమితాబ్ బచ్చన్ గారికి ఫ్యాన్. రవితేజ కొన్నాళ్ళు హిందీలో అసిస్టెంట్ డైరెక్టర్‌గానూ, కో డైరెక్టర్ గానూ పనిచేసి వచ్చాడుగా, కారణం అదో, మరేమిటో తెలియదు గానీ అతనికి అమితాబ్‌గారంటే చాలా ఇష్టం. నేను అమితాబ్‌బచ్చన్‌తో కలిసి సినిమా చేశానని తెలిసి చాలా ఆనందపడ్డాడు.

'బాబాయ్.. మంచి మార్కులు సంపాదించుకున్నావ్.. హిందీలోనూ మంచి పేరు తెచ్చుకున్నావు. అమితాబ్‌గారితో చేశావ్' అని సంబరంగా అన్నాడు. ఇక్కడ నేను చెప్పొచ్చే విషయం ఏంటంటే రవితేజ చూడ్డానికి ఒక యాంగిల్‌లో అమితాబ్‌లాగా ఉంటాడు. నేను ఒకట్రెండుసార్లు ఈ విషయం అతనితో కూడా అన్నాను. కొన్ని రకాల హెయిర్ స్టైల్స్ అలా ఉంటాడని అతనితో కూడా అంతకు ముందు చాలా మంది చెప్పారట.

### మా శంకరం!

రవితేజ గురించి చెబుతుంటే గుర్తొస్తోంది. ఆ మధ్య నా ఫ్రెండ్ ఒకతను ఇంటికొచ్చారు. వయసులో ఉన్నప్పుడు చూడ్డానికి రవితేజ ఛాయలు కొన్ని కనిపించేవి. మనిషి కూడా లోపల ఏదీ దాచు కోడు. చాలా ఫ్రీగా ఉంటాడన్నమాట. బ్యాంకులో నాతో పాటే పనిచేసేవారులెండి. పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నప్పుడు 'ఏవిటోనండీ జీవితమంతా టెన్షన్ టెన్షన్‌గా ఉంది' అన్నారు. అదేమిటండీ 'ఒక వైపు జీవితం అంటూనే మరో వైపు టెన్షన్ అంటున్నారు' అని చెప్పా.

అర్థం కానట్టు నావైపు చూశారాయన. పక్కనే మా తమ్ముడు కోట శంకర్రావు ఉన్నాడు. తనకి నేను చెప్పేది అర్థమైందేమో నవ్వసాగాడు.

వెంటనే నా ఫ్రెండ్‌ని ఉద్దేశించి 'ఏదీ జీవితం అని రాయండి' అన్నా. రాశాడు. 'చివరన ఏమిటి ఉంది?' అని అడిగా. 'సున్న' అన్నారు.

'అంతే. జీవితమంటే చివరికి సున్న. ఇక్కడ సాధించింది అంతా ఇక్కడే వదిలేసి వెళ్తాం. ఏదీ వెంట తీసుకెళ్ళం. అలాంటి దాని గురించి అసలు ఎందుకు ఆలోచించాలి?' అని చెప్పా.

'అయితే అయింది కానివ్వండి శ్రీనివాసరావు గారూ.. వీటన్నిటికేం...బాగానే చెబుతారు, మీ తర్వాత మీ పేరు చెప్పే వారసులు సినిమా పరిశ్రమలోకి రావాలి కదండీ.. మీ తమ్ముణ్ణి రికమెండ్ చేయండి నలుగురికి' అన్నారు.

మా శంకరం మా మధ్య వచ్చిన టాపిక్ గమనించి 'ఇప్పుడే వస్తాను అన్నయ్యా' అని పక్కకు వెళ్ళాడు.

సినిమా పరిశ్రమ ఎలాంటిదంటే గుమ్మడికాయంత టాలెంట్ ఉన్నప్పటికీ, ఆవగింజంత అదృష్టం తప్పకుండా ఉండాలి. నా అనుభవంలో నేను తెలుసుకున్న విషయం అది. అలా కాకపోతే ఏంటండీ.. నాకూ, మా తమ్ముడికీ ఇద్దరికీ గురువు మా అన్నయ్య కోట నరసింహారావుగారు. నాలాగే మా తమ్ముడు కూడా నాటకాలు వేశాడు. సినిమాల్లోకి వచ్చాడు. మరి నా తమ్ముడు కావడం అతనికి ప్లస్ అయిందో, మైనస్ అయిందో అర్థం కాదుగానీ ప్రతిభ ఉన్నా ఎదగాల్సినంత స్థాయికి ఎదగలేక పోయాడన్నది నాకెప్పుడూ బాధగా ఉంటుంది. అతనిలో నటన లేకపోతే నేను పట్టించుకునేవాణ్ణి కాదు. తను చాలా మంచి నటుడు. కొన్ని వేషాలకు చాలా బావుంటాడు. సబ్ ఇన్‌స్పెక్టర్, లాయర్ వేషాలకు చాలా బావుంటాడు. ఆ మాటే ఎవరితోనైనా చెబుదామా అంటే తను ఎవరికీ తెలియనివాడు కాదు. అందరికీ తెలిసినవాడాయే. ఇంకేం చెప్పాలి? ఏదేమైనా ప్రస్తుతం టీవీల్లో చాలా మంచి వేషాలు వేస్తున్నాడులెండి. వెండితెరమీద కూడా ఇంకా వాడు ఎదిగితే చూడాలని నా తాపత్రయం.

## అరుదైన విలన్

మా శంకరం అంటే ఎంత ఇష్టమో రఘుబాబు అన్నా నాకు అంతే ఇష్టం. ప్రస్తుత తరంలో రఘుబాబు చాలా మంచి ఆర్టిస్ట్. మన గిరిబాబు గారి అబ్బాయి అయినా అతను సినిమాల్లోకి రాకపూర్వం నాకు పరిచయం లేదు. ఎప్పుడూ చూడలేదు కూడా. సినిమాల్లోకి వచ్చాకే పరిచయం. అన్నయ్యా అంటూ చాలా ఆప్యాయంగా పలకరిస్తాడు. రఘుబాబులో ఎన్ని వేరియేషన్స్ ఉన్నాయో నటుడిగా నేను ఇట్టే చెప్పగలను. మనం ఎక్కడెక్కడి నుంచో విలన్‌ని తెచ్చుకుంటాంగానీ సరిగ్గా వాడుకుంటే రఘుబాబు చాలా చక్కటి విలన్ అవుతాడు. పంచెకట్టు వంటివి కట్టిస్తే గమ్మత్తుగా ఉంటాడు. కామెడీ టైమింగ్ ఉన్న విలన్‌లు అరుదుగా ఉంటారు. అలాంటి



అరుదైనవాడు రఘుబాబు. డైలాగులు కూడా వెరైటీగా చెప్పగలడు. మనిషిగా కూడా చాలా మంచివాడు. సాయపడే మంచి మనసున్నవాడు.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**




**జగన్నాథశాస్త్రి ఏమీ తోచక నడవాలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. రిటైరై ఆరు నెలలు కావస్తోంది. ఉద్యోగానికి వెళ్ళినన్ని రోజులూ సమయం ఎలా గడిచేదో తెలిసేది కాదు. కళ్ళుమూసి తెరిచేలోగా గంటలు, రోజులు మాయమయ్యేవి. ఇప్పుడు నిముషం గడిచేందుకే గగనంగా ఉంది.**

**అబ్బాయి వ్యాస్ ఉదయమే ఆఫీసుకు వెళ్ళిపోయాడు. కొత్త కోడలు ఇంట్లో సర్దుకు పోయేందుకు అలవాటు పడేలోపే పుట్టింటికి వెళ్ళాల్సివచ్చింది. అమ్మాయికి ఐదో నెల రాగానే తల్లిదండ్రులు వచ్చి ఆమెను తీసుకువెళ్ళారు. అబ్బాయికి పెళ్ళై ఏడాది కావస్తోంది.**

భార్య సుగుణ కాఫీతో వచ్చింది. ఏమీ తోచక అతనలా పచార్లు చేస్తూండడం చూసి చిన్నగా నిట్టూర్చింది. తన మనసులోని మాట చెప్పాలావద్దా అనే ధర్మ సందేహంతో కాఫీ గ్లాసు కాస్సేపు చేతిలోనే ఉంచుకుని తలపటాయించింది. తన నడకలో వెనుదిరిగిన వెంటనే కనబడిన భార్యను, ఆమె చేతిలోని కాఫీని చూశాక అతనిలో కొంత కొత్త ఉత్సాహం పొడసూపింది. నడక వేగంపెంచి కాఫీ అందుకున్నాడు. అది చేతిలోకి రాగానే ఎనర్జీ డ్రింక్ దొరికినట్టనిపించింది.

కాఫీ ఇచ్చేసి ఇంకా అక్కడే నిలబడి ఉన్న భార్య వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏదో చెప్పాలనుకుంటున్నావు?"

"అదే...ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను"

"నలభై ఏళ్ళు తోడుగా ఉన్నావు. ఇంకా తటపటాయింపేనా?"

భృకుటి ముడి వేసింది చిరుకోపంతో. "ప్రస్తుత సమస్య వేరు" అంది.

సమస్య అన్న పదం వినగానే నిదానం అయ్యాడు. ఇన్నేళ్ళుగా ఏనాడూ ఆమె నోట సమస్య అన్న మాట విని ఎరగడు. ఒకవేళ విన్నా చాలా అరుదు.

"సమస్యా? ఏమిటది?"

"మన అబ్బాయి ఈ మధ్య ఎందుకో చాలా ముభావంగా అంటీ ముట్టనట్టు ఉంటున్నాడు. దాదాపు ఆర్నెల్లుగా గమనిస్తున్నాను" అంటూ ఆపింది సుగుణ.

ఆమెవంక తదేకంగా చూశాడు శాస్త్రి. ఆమె మాటలను బట్టి ఆరునెలలు గతంలోకి వెళ్ళాడు శాస్త్రి. అంటే సరిగ్గా తను రిటైరైన కొత్తలో. అప్పటినుంచీ దైనందిన జీవితంలో జరిగే సంఘటనలు ఒక్కొకటిగా తరచి చూశాడు.

కొద్దిగా గజిబిజిగా ఉన్నా కాస్సేపటికి అవి స్పష్టత సంతరించుకున్నాయి.

"నిజమే అంతకుముందు ప్రతిరోజూ ఉదయం లేవగానే విష్ చేసేవాడు. ఇద్దరూ కలిసి కూర్చుని కాఫీ తాగేవాళ్ళు. సాయంత్రం రాగానే మళ్ళీ కలిసే కాఫీ తాగేవాళ్ళు. ఆఫీసులో ఏవైనా ముఖ్యమైన విషయాలుంటే ప్రత్యేకంగా చెప్పేవాడు. లేకుంటే కనీసం 'ఈ రోజు ఆఫీసులో విశేషాలేమీ లేవు నాన్నా' అనే వాడు. ఈ మధ్య ఆ సంఘటనలేవీ జరగడం లేదు. ఉదయం లేచింది మొదలు హడావిడిగానే ఉంటాడు. కోడలే అతనికి కాఫీ ఇస్తుంది. అతని పనులన్నీ కోడలే చక్కబెడుతుంది. సాయంత్రం కూడా రాగానే గదిలోకి వెళ్ళిపోతాడు. మళ్ళీ రాత్రి భోజనాల సమయంలోనే బయటకు వస్తాడు. పోనీలే ఆఫీసులో పని ఒత్తిడి ఎక్కువగా ఉందనుకుని తాను కూడా పెద్దగా పట్టించుకునేవాడు కాదు. ప్రస్తుతం కోడలు ఊళ్ళో లేకున్నా అతని దినచర్యలో మార్పేమీ రాలేదు. ఈ రోజు సుగుణ చెప్పేవరకు తనకీ ఆలోచన రాలేదు. దిగులుగా ఉన్న ఆమె వదనంచూసి శాస్త్రి కూడా కొద్దిగా కలవరపడ్డాడు. సమస్య చిన్నదేమో అనుకుంటే అది తరచి చూసేకొద్దీ హిమాలయమంత ఎత్తుగా ఎదుగుతూ వెళుతోంది.

"ఒకవేళ మనవాడేమన్నా మనల్ని.." ఆపై మాటలు నోటినుంచి వెలువడలేదు.

ఆమె ఆలోచనలకు ఉలికిపడ్డాడు."ఛఛ అలాంటి ఆలోచనలేమీ బుర్రలోకి రానివ్వకు. మనం వాణ్ణి అలా పెంచలేదు. వాడెప్పుడూ మనల్ని ఎప్పటికీ నిర్లక్ష్యం చెయ్యడు" అన్నాడు నిబ్బరంగా. అన్నాడేగానీ తామిద్దరిలో తన కన్నా ఆమెకే తమ బిడ్డను గురించి ఎక్కువగా తెలుసు. అతని కదలికలను గత ఆరునెలలుగా నిశితంగా పరిశీలించిన మీదటే ఆమె ఆ నిర్ణయానికి

వచ్చినట్టు అనిపించింది.

“సాయంత్రం వాణ్ణి ఒకసారి పలకరించాలని ఉంది” అన్నది సుగుణ.

“ఏమని పలకరిస్తావు? వాణ్ణి ఏమని నిలదీస్తావు? ఆలూ లేదూ చూలూ లేదన్నట్టు అసందర్భంగా ఏవైనా ప్రశ్నలు అడుగుతావా?”

“మాటల సందర్భంలో ఒకట్రెండుసార్లు మీ గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు వాడన్న మాటలే నన్నిలా ఆలోచింపజేస్తున్నాయి. మీరు మునుపటిలా ఉత్సాహంగా, చలాకీగా ఉండక నిస్తేజంగా ఉండడం చూడలేక నేనే వాడిముందు మీ ప్రస్తావన తెచ్చాను. ‘ఏదో ఒక వ్యాపకం ఉంటే నిర్లిప్తత దానంతటదే మాయమైపోతుంది’ అని పుల్లవిరుపుగా అనేశాడు. మీ గురించి అస్సలు పట్టించుకోనట్టే మాట్లాడడం నాకెందుకో నచ్చలేదు” కళ్ళల్లో నీళ్ళు రావడమే తరువాయి ఆమెకు.

ఆమె మాటలకు శాస్త్రి కూడా ఆలోచనలో పడ్డాడు.

నిజమే. రిటైరైన కొత్తల్లో కాస్త హాయిగా అనిపించినా రోజులు గడుస్తున్న కొద్దీ దినచర్యల్లోనే ఒక విధమైన నిరాసక్తత అలుముకోసాగింది. ‘ఇంత తొందరగా లేచి ఏం చెయ్యాలి? స్నానం కాస్త ఆలస్యంగా చేస్తే సరి. టిఫిన్ ఇంత తొందరగా తినాలా? ఇవాళ భోజనం మానేస్తే?’ ఇలా ప్రతి పనీ వాయిదా వెయ్యసాగాడు. అదే పద్ధతి అలవడింది.

కొడుకు మాత్రం ఉదయమే లేచి చకచకా తయారై ఆఫీసుకు వెళ్ళిపోతాడు. తనకు దినమంతా ఫ్రీయే. చేసేందుకు పనేమీ లేదు. ‘ఐడిల్ బ్రెయిన్ ఈజ్ డెవిల్స్ వర్క్ షాప్’ అన్న నానుడి ప్రకారం మరే పిచ్చి ఆలోచనలు రాకున్నా ప్రస్తుతానికి నిత్యకృత్యంగా చేసే పనులు వాయిదా వెయ్యడం మాత్రమే జరుగుతోంది. ఇప్పుడు భార్య మాటలతో డెవిల్ బుర్రలో ప్రవేశించినట్టైంది. ‘కొడుకు బుర్రలో ఏముంది? తమపట్ల వాడలా కేర్‌లెస్‌గా ఎందుకున్నాడు?’ అన్న ఆలోచన అల్లాఉద్దీన్ అద్భుత భూతంలా పైకి వచ్చింది. అప్పటినుంచి అనునిత్యం ఆ భూతం మెదడులో చేరి ఆలోచనలను తొలిచెయ్యసాగింది.

నాలుగు నెలలు గడిచాక వియ్యంకుడి నుండి ఫోను. మనవడు పుట్టాడన్న సంతోషకరమైన వార్త చెవిన వేశారు.

తాత్కాలికంగా మనసులోని మథనాన్ని మాటున పెట్టారు శాస్త్రి దంపతులు. ఆ రోజు సాయంత్రం కొడుకు వచ్చేసరికి స్వయంగా తనే తీపి పదార్థాలు చేసి ఉంచింది సుగుణ. అతను ఇంటికి రాగానే విషయం సంతోషంగా చెప్పారు చేతిలో తీపి ఉంచుతూ. ఐతే అందుకు కొడుకు ప్రతిక్రియ తాము ఆశించిన విధంగా లేకపోవడంతో ఇద్దరూ నిరుత్సాహపడ్డారు. శాస్త్రికన్నా సుగుణ మరీ బేలగా అయిపోయింది.

“ఉదయమే మామగారు ఫోన్‌చేసి చెప్పారు” అన్నాడు క్లుప్తంగా వ్యాస్.

“అదేమిట్రా... అంతచప్పగా ఉన్నావు. వంశాంకురం పుట్టాడన్న సంతోషం లేదా?”

“లేకుండా ఎలా ఉంటుంది? అలాగని ఇక్కడ

## నీతులు చెప్పొద్దంటోంది

గోవా బ్యూటీ ఇలియానాకి ఒళ్ళు మండి పై విధంగా ఫైర్ అవుతోంది. ఇంతకీ అసలు సంగతేమిటంటే ఇటీవల ఇలియానా ఫొటో షూట్ల పేరుతో అర్ధనగ్న ఫొటోలు సోషల్ మీడియాలో పోస్ట్ చేస్తోంది. ఈ ఫొటోలు చూసిన ఆమె అభిమానులు ఇలాంటి ఫొటోలు ఇక మీద పోస్ట్ చేయవద్దంటూ ఆమెకు సూచించారు. ఆ సూచనలకు సానుకూలంగా స్పందించకుండా అభిమానుల మీద ఫైర్ అవుతోంది ఇలియానా. నా జీవితం నా ఇష్టం. నాకెవ్వరూ నీతులు చెప్పాల్సిన అవసరం లేదంటూ ఘాటుగా స్పందించింది.



నేను గంతులేస్తే సరిపోతుందా? ఐనా ఈ సమయంలో నేను అక్కడ ఉండాల్సింది. వెళ్ళలేకపోయినందుకు చింతిస్తున్నాను. అదే నాకు ఎక్కువ బాధగా ఉంది” అన్నాడు వ్యాస్ చిరాకుగా.

సుగుణ భర్తవైపు చూసింది. ‘కాలం మారింది. తమ కాలంలో మగవాళ్ళు కేవలం పిలిచినప్పుడు మాత్రమే వెళ్ళేవాళ్ళు. అది కూడా అబ్బాయి పుట్టిన పదహారు రోజుల తరువాత బాలసారెకు మాత్రమే తండ్రి తన భర్తను పిలిచాడు. కానీ ఇప్పుడు?’

మారిన కాలం, మారుతున్న మనుషులు, మనస్తత్వాల గురించి ఎంత తక్కువగా ఆలోచిస్తే అంత మంచిదనుకుంది సుగుణ.

మరో మూడు నెలలు గడిచాక అబ్బాయిని తీసుకుని కోడలు వచ్చింది. చుట్టుపక్కల వాళ్ళను పిలిచి ఓ చిన్న సైజు పార్టీ ఇచ్చుకున్నారు శాస్త్రి దంపతులు.

కోడలు ఉద్యోగస్తురాలు. మొదట ఒక రెండు వారాలు బిడ్డను ఇంట్లోనే వదిలి వెళ్ళింది. ఐతే మూడోవారమే బిడ్డను తీసుకుని బయలు దేరింది. సుగుణ ఆశ్చర్యపోయింది. “అదేంటమ్మాయ్. ఇంట్లో పెద్దదాన్ని నేనుండగా బిడ్డను అక్కడెక్కడో వదుల్తానంటావే?”

“నీకెందుకమ్మా శ్రమ? తనిష్టప్రకారమే కానియ్” అన్నాడు వ్యాస్ కల్పించుకుని.

“నువ్వు కూడా దానికి వంతపాడతావేంట్రా? మీరేమన్నా పరాయి ఊర్లో ఉన్నారా? మేం ఇక్కడ ఉన్నందువల్ల ప్రయోజనం ఏమిటి? మనవణ్ణెత్తుకోవాల్సిన వయసులో ఈ పని కష్టం అనుకుంటే ఎలా?” అన్నది కొడుకు మాటలకు నిశ్చేష్టురాలై.

వ్యాస్ ఎక్కువ మాట్లాడలేదు. కోడలు కూడా మౌనం వహించింది. కాస్సేపటికి బిడ్డను ఎత్తుకుని ఇద్దరూ వెళ్ళిపోయారు. సుగుణ బాధ వర్ణనాతీతం.

“చూశారాండీ. మనవడి మీద మనసులో ఉన్న మమకారాన్నంతా ఇప్పుడెక్కడ కుమ్మరించాలి? బాధ తట్టుకోలేకపోతున్నానండీ”

అదే సమయంలో “పోస్ట్” అన్న అరుపు వినబడింది.

పోస్ట్‌మేన్ శాస్త్రి చేతిలో ఓ మోస్తరు కవరు ఉంచి వెళ్ళాడు. అది అబ్బాయి పేరుమీద ఉంది. విప్పకూడదనుకుంటూనే జగన్నాథశాస్త్రి కవరువిప్పి చూశాడు. అతని భృకుటి ముడిపడింది. ఏదో వృద్ధాశ్రమం నుంచి వచ్చిన కవర్ అది. సాంతం చదివాడు.

పెద్దగా నిట్టూరుస్తూ ఆ కాగితాలన్నీ సుగుణ చేతిలో ఉంచాడు.

అది చదివి సుగుణ నవనాడులూ కుంగిపోయాయి. “అంటే మనబ్బాయి మనల్ని వృద్ధాశ్రమంలో చేర్చాలనుకుంటున్నాడా? ఏమిటండీ ఇది? నేను చూస్తున్నది నిజమేనా?” అన్నది ఏడుపు ధ్వనించే గొంతుతో.

శాస్త్రికి కూడా అయోమయంగా ఉంది. ఇంతా చేసి తాము కొడుకూ కోడలిని ఏ విషయానికీ ఇబ్బంది పెట్టలేదు. పైగా ఈనాటికీ ఇంటి పనంతా తనే చేస్తోంది. కోడలికి ఏపనీ చెప్పదు. తనకై తాను చేస్తే వద్దనదు. అలాంటిది ఈ రోజు కొడుకు పేరన ఈ కవర్ రావడంలో ఆంతర్యం ఏమిటి? వృద్ధాశ్రమం గురించిన వివరాలు ఎందుకు సేకరిస్తున్నాడు? శాస్త్రికి ఏం చెయ్యాలో తోచలేదు.

సాయంత్రం కొడుకు రాగానే గుండె దిటవు చేసుకుని ఓ ఐదు నిముషాలు మాట్లాడి పరిస్థితి చక్కదిద్దాలను

కున్నాడు.

ఐతే ఎప్పటిలాగే కొడుకు రాగానే తన గదిలోకి వెళ్ళిపోయాడు. కోడలు బిడ్డతో సహా వంటింట్లోకి వెళ్ళిపోయింది. దాంతో అతనికి నిరాశే మిగిలింది.

సుగుణ నోటంట ఆ మాట వచ్చినప్పటి నుంచీ అతని గదిలోకి వెళ్ళాలంటే బిడియంగా ఉంది. లోపలికి వెళ్తే అతనేమనుకుంటాడో అనే జంకు కలుగుతోంది. 'తన కొడుకు గదిలోకి వెళ్ళేందుకు తాను తటపటాయించాలా? ఏమిటీ పరిస్థితి. నో. ఇలా జరగకూడదు' అనుకుని 'ధైర్యం' చేసి లోపలికి వెళ్ళాడు.

ఏదో పని చేసుకుంటూ ఉంటాడనుకుంటే మంచం మీద పడుకుని కళ్ళు మూసుకుని ఉన్నాడు వ్యాస్. తండ్రిని చూడగానే లేచి కూర్చున్నాడు.

"ఏమిటి నాన్నా. పిలిస్తే వచ్చేవాణ్ణిగా" అతని కంఠంలో విసుగు ధ్వనించింది.

ఎలా ప్రారంభించాలో తెలియలేదు శాస్త్రికి. "ఏమిటోరా ఈ మధ్య చాలా విసుగనిపిస్తోంది. చాలా ఇబ్బందిగా ఉంది" అన్నాడు ఏం మాట్లాడాలో, భార్య చెప్పిన విషయాన్ని ఎలా అతని ముందుంచాలో అని ఆలోచిస్తూ.

"ఇన్నాళ్ళూ ఉద్యోగం పేరిట బిజీగా ఉన్నారు. ఇప్పుడేపనీ లేక ఖాళీగా ఉన్నందువల్ల అలా అనిపిస్తోంది. అంతే. దీనికెందుకు బాధ? రిటైరైన ప్రతి వారికీ ఇది తప్పని పరిస్థితేగా?" అన్నాడు అదేమీ పెద్ద విషయం కాదన్నట్టు.

"అది కాదురా. మన డైలీ రొటీన్‌లో కూడా ఏదో మార్పు వచ్చినట్టు ఇంట్లో వాతావరణమే ఏదో అసహజంగా ఉన్నట్టు అనిపిస్తోంది" చెప్పదల్చుకున్నది ఇంకా చెప్పే మూడ్‌లోకి రాలేదతను. రాలేకపోతున్నాడన్నదే నిజం.

వ్యాస్ మాట్లాడలేదు. అంతకన్నా ముఖ్యంగా లోపలికొచ్చిన తండ్రిని కూర్చోమని కూడా చెప్పలేదతను. అది కూడా గ్రహించాడు శాస్త్రి. సుగుణ మాటలు ఉత్తవేం కావన్న విషయం సుస్పష్టమైంది. తానే అక్కడున్న కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

తన చేతిలోని కవర్ అతని చేతిలో ఉంచాడు. దాన్ని చూసిన వ్యాస్ "ఇదేమిటి?" అంటూ ఓ మారు చూసి "ఇలాంటివి వస్తూనే ఉంటాయి" అంటూ గిరాటేశాడు.

అతని చర్యకు శాస్త్రి మనసు కుదుటపడింది. అంటే తనకు తానుగా వివరాలు అడిగి తెప్పించుకోలేదన్నమాట. ఐనా ఎందుకో మనసింకా మామూలు స్థితికి రాలేదు. అతను గిరాటేసిన కవర్ తనచేతిలోకి తీసుకున్నాడు. మరి మాటలు పెగల్లేదు. ఈ లోగా కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది కోడలు. కాఫీ తాగి ముగించి అక్కణ్ణుంచి లేచి వచ్చేశాడు శాస్త్రి.

మర్నాడు కొడుకూ కోడలూ ఇద్దరూ వెళ్ళిపోయాక శాస్త్రి తనవద్ద భద్రంగా దాచుకున్న ఆ కవరు తీసుకుని వంటింట్లో సుగుణ వద్దకు వెళ్ళాడు.

"సుగుణా, ఒకసారి వెళ్ళి ఈ ఆశ్రమం చూసి వద్దామనుకుంటున్నాను."

అతని ఆలోచనకు ఉలికిపడింది. అతనివంక భయంగా చూసింది.

"భయపడకు. చూద్దాం ఏమవుతుందో" అంటూ అనునయించాడు.

"ఏం జరుగుతోందండీ? మనం ఎవరికి అపకారం చేశాం? ఒక్కగానొక్క బిడ్డను పొత్తిళ్ళలో పెట్టుకుని పెంచినందుకు మనకు లభించే బహుమతి ఇదేనా?" సుగుణ కళ్ళనీళ్ళ పర్యంతమవుతోంది.

"ఊరుకో. అడ్డాలనాడు బిడ్డలుగానీ, గెడ్డాలనాడు బిడ్డలా? వాళ్ళు కూడా పెరిగి పెద్దవాళ్ళయ్యారు. మంచీ చెడు తెలియవనుకోవడానికి వీల్లేదు. ఎందుకంటే మనం వాణ్ణలా పెంచలేదు. వాడికన్నీ మంచి బుద్ధులే నేర్పాం. వాడు చెడు తిరుగుళ్ళు తిరిగిన దాఖలాలు కూడా లేవు. దుష్టసాంగత్యం అసలే లేదు. మరి ఎందుకిలా జరుగుతోందో అర్థం కావడంలేదు. ఒకవేళ కోడలుపిల్ల వల్ల మనిషి మారుతున్నాడా అనుకోవడానికి ఇది సమయం కాదు. దేనికైనా కాలమే బదులిస్తుంది. ఆ ఆశ్రమం నాలుగు వీధుల అవతలే ఉందట. అదీ చూసొద్దాం" అంటూ మెల్లగా బయటికి నడిచాడు.

***

ఇచ్చిన అడ్రసు ప్రకారం ఆ ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళి మెల్లగా లోపలికి అడుగుపెట్టాడు శాస్త్రి. ఇంతకు ముందెన్నడూ దాన్నక్కడ చూసినగుర్తు లేదు. ఈ మధ్యనే పెట్టినట్టున్నారు. స్థలం పెద్దదిగానే ఉంది. రెండుగ్రౌండ్ల స్థలంలో ఓ చివర సుమారైన ఇల్లు. మిగతా స్థలమంతా పచ్చిక, పూలమొక్కలతో నిండి ఉంది. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. అది చూడగానే ఎందుకో ఇక్కడుంటే బాగుండును అనిపించింది.

ఇంటిని సమీపించి చూస్తే లోపల సుమారుగా ఒక పదిమంది వయోవృద్ధులున్నారు. హాల్లో ఒక టేబుల్ ముందు ఒక వ్యక్తి కూర్చుని పేపర్ చదువుతున్నాడు. మెల్లగా లోపలికి అడుగుపెట్టి అక్కడ కూర్చున్న వ్యక్తికి నమస్కరించాడు.

**భార్య చెప్పిన మాటలు విని ఆ భర్త సందేహంలో పడ్డాడు. తన కొడుకు ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఆ విషయం నిర్ధారించుకోవాలనుకున్నాడు. అంతలోనే పోస్టులో ఏవో కాగితాలొచ్చాయి. ఆ కవరు చించి చూశాక అతడి అనుమానం బలపడింది. నేరుగా కొడుకు దగ్గరకు వెళ్ళి ఆరాతీశాడు. కొడుకు ముభావ ప్రవర్తనతో అతడికి విషయం స్పష్టమైంది. దాంతో అతడు మర్నాడు ఒకచోటకు వెళ్ళి ఎంక్వైరీచేసి ఒక నిర్ణయానికి వచ్చేశాడు.**

పక్కనే మరో గదిలో నుంచి పిల్లల ఏడుపులు వినిపించి ఆశ్చర్యపోయాడు.

ఆ వ్యక్తి "నేను షణ్ముఖశర్మ. చెప్పండి సార్. ఏం కావాలి?" అని అడిగాడు.

"ఆశ్రమం గురించి వివరాలు కావాలి. ఇక్కడ చేరేందుకు...." ఆపాడు.

"వివరాలు పెద్దగా ఏంలేవు సర్. మీ అబ్బాయిని పిల్చుకురండి. అతను తనంత తానుగా వచ్చి అప్లికేషన్ పూర్తి చేసి సంతకంచేసి వెళ్ళాలి. ఇకపోతే నెలసరి ఖర్చులు గురించి అతనికే చెప్తాం."

"లోపల చిన్నపిల్లల ఏడుపు వినిపిస్తోందే?"

"అవును. ఐదేళ్ళలోపు పిల్లలను కూడా ఇక్కడ కేర్ సెంటర్‌లో ఉంచుకుంటాం. ఉదయం వదిలివెళ్ళి సాయంత్రం తీసుకెళతారు"

పక్కగదిలోకి తొంగి చూస్తే అక్కడ ఐదారుగురు చంటిపాపలు ఉన్నారు. అందరూ రెండేళ్ళలోపు వయసు వాళ్ళే. వాళ్ళను అక్కడున్న ఇద్దరు బామ్మలు, వాళ్ళకు తోడుగా నర్స్ దుస్తుల్లో ఒక అమ్మాయి చేరి సముదాయిస్తున్నారు.

అందులో ఒక బాబును చూసి ఆశ్చర్యపోయాడు. వాడు తన మనవడే. అది చూసి అతని మనసు విలవిలలాడింది. తల్లిదండ్రులు, తాత, బామ్మ అందరూ ఉండీ ఎవరూ లేని అనాథలా బాబు అక్కడ ఉండడం తట్టుకోలేకపోయాడు శాస్త్రి.

'ఈ విషయం సుగుణకు చెప్తే తల్లడిల్లిపోతుంది. ఆరు నూరైనా తామిద్దరూ ఇక్కడ చేరాలి. ఇలాగైనా మనవడి దగ్గరున్నట్టుంటుంది. సాయంత్రం రాగానే కొడుకుతో చెప్పి రేపే ఇక్కడికి వచ్చేయాలి' అనుకుంటూ బయటికి నడిచాడు.

వెనకనుంచి 'సార్ సార్' అని పిలుస్తున్నా పట్టించుకోకుండా నడక వేగం పెంచాడు.

సాయంత్రం వ్యాస్ రాగానే "బాబూ, కాస్త ఇలా కూర్చోరా... నీతో మాట్లాడాలి" అన్నాడు గొంతు పెగల్చు కుని. మనవడు అక్కడున్న సంగతి సుగుణకు ఇంకా తెలియదు. వ్యాస్ కూర్చున్నాక "నిన్న నీకు వచ్చిన కవర్ చదివానురా. వృద్ధాశ్రమమట. ఇవాళ వెళ్ళి చూసొచ్చాను. మీ అమ్మతో సహా అక్కడికి వెళ్దామనుకుంటున్నాను" అన్నాడు.

"వృద్ధాశ్రమంలోనా? ఎందుకూ?" ప్రశ్న మనసులో నుంచో, కడుపులో నుంచో కాక నాలుక చివరి నుంచి వచ్చినట్టనిపించింది జగన్నాథశాస్త్రికి.

"ఎందుకంటే ఏం చెప్పను? ఏ పనీ పాటా లేకుండా చాలా విసుగు అనిపిస్తోంది. అక్కడైతే కొంత మంది చిన్నపిల్లలు, పెద్దవాళ్ళూ ఉన్నారు. కావలసినంత కాలక్షేపం. నాకేమో అదే మంచిదనిపిస్తోంది.



'ఐడిల్ బ్రెయిన్ డెవిల్స్ వర్క్ షాప్' అన్న సామెత కాకుండా ఉండేందుకు ఇదొక్కటే మార్గమనిపిస్తోంది.'

"మీకు నచ్చినంత మాత్రాన సరిపోతుందా? అమ్మ ఒప్పుకోవద్దా?"

అంటే మనసులో ఇతనికి అంగీకారమేనన్న మాట. సామెత నిజమేననిపించింది.

'అడ్డాలనాడు బిడ్డలుగానీ గడ్డాలనాడు బిడ్డలా?'

"నేను ఎక్కడుంటే తను కూడా అక్కడే ఉంటుంది. అసలు ఇంతకూ నీకీ విషయం ఎందుకు చెబుతున్నానంటే నువ్వు కూడా వస్తేనే మమ్మల్ని అక్కడ చేర్చుకుంటారట" చివరి మాట చెప్పేందుకు చాలా కష్టపడ్డాడు శాస్త్రి. కొద్ది నిముషాలు మౌనంగా దొర్లాయి.

"రేపు మంచిరోజు కాదు. ఎల్లుండి ఆదివారం వెళ్ళండి" అంటూ లేచాడు వ్యాస్.

సుగుణ లోపల్నుంచి తండ్రీ కొడుకుల మాటలు వింటోంది. కొడుకు వద్దు అని వారిస్తాడేమో అని ఆశగా చూసినా ఆమెకు నిరాశే మిగిలింది.

ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు కుటుంబ సమేతంగా బయలుదేరాడు జగన్నాథశాస్త్రి. కోడలు మాత్రం ఇంటివద్దనే ఉండిపోయింది. బయలుదేరిన తరువాత, "మీరు అక్కడికి వెళ్ళి ఉండండి. నేను బ్యాంకుకు వెళ్ళి వస్తాను" అనేసి వాళ్ళ అంగీకారం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు వ్యాస్.

ఆశ్రమం లోపలికి అడుగుపెట్టే సమయంలో సుగుణ దుఃఖం కట్టలు తెంచుకుంది. రెండురోజుల క్రితం చూసిన వ్యక్తే అక్కడ కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

"మీ అబ్బాయి రాలేదా?" అడిగాడు.

"బ్యాంకుకు వెళ్ళాడు. వచ్చేస్తాడు" అంటూ అక్కడే కుర్చీలో కూర్చున్నాడు.

సుగుణ పరిసరాలన్నీ తేరిపార చూస్తోంది. ఇక నుంచీ అదే తమ ఇల్లు! ఆ భావన ఎందుకో మనసులో నాటుకోలేకపోతోంది. మెల్లగా భర్త చెవిలో "మన బిడ్డకు మనం ఏం లోటు చేశామండీ" అన్నది జీరబోయిన గొంతుతో.

నోటికి వేలు అడ్డంపెట్టి మౌనంగా ఉండమని సౌంజ్ఞ చేశాడు శాస్త్రి.

"ఇంతకు ముందెన్నడూ దీన్నిక్కడ చూడలేదు. ఎంతకాలమైంది ప్రారంభించి?" అక్కడున్న నిర్వాహకుణ్ణి అడిగాడు శాస్త్రి.

"ఈ మధ్యనే. ఓ ఆర్నెల్లక్రితం"

"మీరేనా దీన్ని నడిపేది?" ఆ ప్రశ్నకు తల అడ్డంగా ఊపాడా వ్యక్తి.

"మా దేవుడుబాబు. ఇంకా రాలేదు" అన్నాడు కృతజ్ఞత ఉట్టిపడే కంఠంతో.

అతని మాటలు చిత్రంగా ధ్వనించాయి శాస్త్రికి.

"ఎంతమంది ఉన్నారు ఇక్కడ?"

"పిల్లలు పెద్దలు చేర్చి ప్రస్తుతానికి సుమారు డజను మంది"

"దీని నిర్వహణ ఖర్చు ఎవరు భరిస్తారు?"

"మేమంతా మా పెన్షన్లలో సగం ఇచ్చేస్తాం. మిగతా అంతా ఆ బాబే వేస్తారు. ఎంతలేదన్నా మొత్తం ఖర్చులో సగానికి పైగా ఆ బాబే ఇస్తారు. ఏ తల్లి కన్నబిడ్డో, నూరు కాలాలపాటు చల్లగా ఉండాలి" అన్నాడావ్యక్తి కంఠం వణుకుతుండగా.

అతని మాటలు విన్న శాస్త్రి దంపతులకు అసూయ కలిగింది. అటువంటి కొడుకు తమకు లేకుండా పోయాడే అనిపించింది. ఆశ్రమంలో చేరుతామంటే కనీస మర్యాద కోసమైనా వారించని తమ కొడుకును తల్చుకుని చింతించారు.

ఆలోగా ఒక వ్యక్తి ఒక బోర్డు తీసుకువచ్చాడు.

"సార్ బోర్డు వచ్చింది. ఫిక్స్ చెయ్యమంటారా?" అడిగాడు కార్పెంటర్. అలాగే అన్నట్టు తలూపాడు కుర్చీలోని వ్యక్తి.

'కొత్త బంగారు లోకం' అని బోర్డు మీదున్న పేరు చదివాడు శాస్త్రి.

"ఈ ఆశ్రమానికి ఆ బాబు పెట్టిన పేరిది. బాగుంది కదండీ. నిజంగా మా అందరికీ ఇది బంగారు లోకమే" అన్నాడా వ్యక్తి. అక్కడున్న వాళ్ళందరూ ఆ బోర్డుచూసి చప్పట్లు చరిచారు. వాళ్ళముఖంలో సంతోషం చూస్తే నిజంగానే వాళ్ళంతా కొత్త బంగారు లోకంలోకి అడుగు పెట్టినట్టు అనిపించింది. శాస్త్రి దంపతులకు మాత్రం మనసులో ఏదో వేదన. జరుగుతున్నదంతా కలా నిజమా అన్న సందిగ్ధత!

"సార్. మీ అబ్బాయి వచ్చేలోపు మీరు ఈ ఫారం పూర్తిచేసి సిద్ధంగా ఉంచండి" అంటూ ఆ వ్యక్తి ఒక కాగితం శాస్త్రి చేతికి ఇచ్చాడు.

దాన్ని తీసుకుని పూర్తిచేసి ఇచ్చాక సాంతం చదివి వెంటనే లేచి "సార్, ఇక్కడ కూర్చోండి. ఇక నుంచి ఈ బాధ్యత మీది" అన్నాడా వ్యక్తి జగన్నాథ శాస్త్రిని కుర్చీలోనికి ఆహ్వానిస్తూ.

"అదేంటీ" అంటూ ఆశ్చర్యపోయాడు శాస్త్రి.

"ఇక్కడి పద్ధతి ప్రకారం అందరికన్నా పిన్న వయస్కులే దీని నిర్వహణ బాధ్యత స్వీకరించాలి. ప్రస్తుతానికి మీరే అందరికన్నా చిన్నవాళ్ళు. కాబట్టి వచ్చి ఇలా కూర్చుని మీ బాధ్యతలు స్వీకరించండి" అంటూ జేబులోని తాళాలగుత్తి శాస్త్రి చేతికి ఇచ్చాడు.

జగన్నాథశాస్త్రికి అయోమయంగా అనిపించసాగింది. షణ్ముఖశర్మ ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. సుగుణ కూడా జరిగే తంతుచూసి ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టింది. సుగుణవైపు చూస్తూ వెళ్ళి అక్కడ కుర్చీలో కూర్చున్నాడు శాస్త్రి.

షణ్ముఖశర్మ అతనికి ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"సార్. మా బాబు వారానికి ఓసారి ఇక్కడికి వస్తారు. ఈ రోజు ఆదివారమే. బహుశా వస్తారని అనుకుంటున్నాను. అలా కాకుంటే వచ్చేవారం వచ్చినప్పుడు పరిచయం చేస్తాను" అంటూ తరువాత సుమారు పావుగంటసేపు అక్కడున్న అందరినీ పరిచయం చేశాడు.

అక్కడ ఒకొక్కరిదీ ఒకొక్క రకమైన కథ. అక్కడున్నవాళ్ళందరూ తమ కన్నబిడ్డలచేత నిరాకరింపబడిన వాళ్ళే. అడ్డాలనాడు బిడ్డలుగానీ, గడ్డాలనాడు బిడ్డలా అన్న సామెత నూటికి నూరుపాళ్ళు నిజం చేస్తూ తమ కన్నవాళ్ళను దిక్కులేని వాళ్ళను చేసిన ప్రబుద్ధులు కూడా కన్నవాళ్ళే కదా.

పిల్లల్లో అసలు ఆ మనస్తత్వం ఎలా పెంపొందుతుంది? దానికి కారణం ఎవరు? పెంపకంలో ఏ లోటూ లేకుండా కంటికి రెప్పలా చూసుకున్నా ఇటువంటి నిరాదరణకు కారణాలేమిటి? అన్న ప్రశ్నలకు సమాధానం దొరకదు. వాళ్ళందరినీ ఒకే గాటన కట్టేందుకు సరైన ఒకే ఒక పదం 'కృతఘ్నులు'.

అదేమంటే రెక్కలొచ్చిన పక్షులు తమ దారి తాము చూసుకుంటాయి కదా అంటూ నిర్లజ్జగా సమాధానాలు వినిపించిన సందర్భాలు కూడా ఉన్నాయి.

ఆ రోజు ఆదివారం కావడంవల్ల పిల్లలు తక్కువగా ఉన్నారు. కేవలం నలుగురే పిల్లలను వదిలి వెళ్ళారు. వాళ్ళను మాత్రం పరిచయం చేశాడు షణ్ముఖశర్మ. అక్కడ వాతావరణం చాలా ప్రశాంతంగా ఏదో కొత్తదనంతో కొత్త ఉత్సాహం కలిగించినట్టనిపించింది. మధ్యాహ్నం అయినా కొడుకు ఇంకా రాకపోవడంతో షణ్ముఖశర్మతో శాస్త్రి అదే విషయం చెప్పాడు. "మీరేమీ కంగారు పడకండి. వేరే ఏదైనా పని తగిలి ఉంటుంది" అంటూండగానే శాస్త్రి సెల్ మోగింది. చూస్తే వ్యాస్.

"ఇదుగో వస్తాననివెళ్ళి ఇంతసేపైనా రాలేదే?"

"హటాత్తుగా ఆఫీసు నుంచి ఫోను వచ్చింది నాన్నా. అందుకే వెళ్ళాల్సి వచ్చింది. ఆఫీసులోనే ఉన్నాను. ఎంతసేపు అవుతుందో చెప్పలేను. అక్కడున్న మేనేజర్‌కి ఫోన్ ఇవ్వండి మాట్లాడతాను" అన్నాడు.

"ప్రస్తుతానికి నేనే మేనేజర్ని. షణ్ముఖశర్మగారికి ఇస్తాను మాట్లాడు" అంటూ అతనికి ఇచ్చాడు శాస్త్రి. రెండు నిముషాలు మాట్లాడాక ఫోన్ తిరిగి ఇచ్చాడు శర్మ.

"మీ అబ్బాయి విషయం అంతా చెప్పాడు. ఏమీ వర్రీ అవ్వద్దు" అన్నాడు.

సుగుణ లోపలికివెళ్ళి అక్కడున్న ఒక పాపను ఎత్తుకుంది. ముద్దులొలికే ఆ పాపను అక్కడ వదిలి

## తప్పుకుందా? తప్పించారా?



*సుచీలీక్స్ వ్యవహారం అమలకు సినిమా ఛాన్సులు మిస్సయ్యేలా చేసిందట! ఎలాగంటే సుచీలీక్స్ వ్యవహారంలో ధనుష్, అమలాపాల్ పేర్లు ప్రముఖంగా వినిపించిన సంగతి తెలిసిందే! ఈ వ్యవహారం తరువాత ధనుష్ తన సినిమాలో రెండవసారి అమలను హీరోయిన్‌గా తీసుకున్నాడు. దాంతో వీరిద్దరి మధ్య ఏదో నడుస్తోందన్న పుకార్లు మొదలయ్యాయి. దీనికి తోడు రజని కూడా ధనుష్ కదలికల మీద ఓ కన్నేసి ఉంచాడట! దీంతో తన సినిమా నుంచి ధనుష్ అమలను తప్పించి వేరే హీరోయిన్‌ని తీసుకున్నాడట! కారణం అమల డేట్లు అడ్జస్ట్ కావడం లేదని చెబుతున్నా, ఆ సినిమా నుంచి అమలను తప్పించారని కొందరు అంటున్నారు. కాకపోతే తన మీద వస్తున్న పుకార్లకు ఫుల్‌స్టాప్ పెట్టడానికే అమల ధనుష్ సినిమా నుంచి తప్పుకుందని మరికొందరు అంటున్నారు.*

వెళ్ళేందుకు ఆ తల్లిదండ్రులకు మనసెలా ఒప్పిందో అర్థం కాలేదు. నలుగురు పసిపాపలతో సమయం గడిచిందే తెలియలేదు. రాత్రి అందరూ కలిసి భోజనాలకు కూర్చున్నారు.

బంధువులందరూ కలిసి ఏదో పెళ్ళి మంటపానికి వచ్చినట్టుగా అనిపిస్తోంది. అందరూ గలగలా మాట్లాడుకుంటూ తమ చిన్ననాటి సంగతులు చెప్పుకుంటూ బాధలన్నీ మరచిపోయి హాయిగా నవ్వుకుంటున్న వాళ్ళందరినీ చూసినాగానీ సుగుణకు ఇంకా ఆ కలుపుగోలుతనం అలవడలేదు. ఐతే శాస్త్రికి మాత్రం తలమునకలుగా పని తగిలింది. ఆశ్రమ నిర్వహణ అంటే సాధారణమైన విషయం కాదన్న సంగతి అర్థమైంది. ఇంతటి సంక్లిష్టమైన పనిని ఆ పిల్లవాడెవడో తన భుజస్కంధాలమీదకు ఎత్తుకుని నిర్వహించడం నిజంగానే గొప్ప విషయం అనిపించింది. మరుసటి వారం వస్తారనుకుంటే ఆ నిర్వాహకుడు రాలేదన్నారు. అలా ఒకనెల గడిచాక ఒక ఆదివారం బయట గేటు దగ్గర కలకలం వినిపించింది.

ఆశ్రమంలో వృద్ధులందరూ బిలబిలమంటూ బయటికి వచ్చారు. ఏమిటని అడిగితే "మా దేవుడు వచ్చినట్టున్నాడు" అంటూ షణ్ముఖశర్మ కూడా బయటికి వేగంగా వెళ్ళాడు. శాస్త్రి దంపతులు ఉత్సుకతతో గేటువైపు నడిచారు. దగ్గరకు సమీపిస్తున్న కొద్దీ ఆ

"లక్షణమైన ఇల్లు వదిలి నువ్వు నడిపే ఆశ్రమంలోనే మేం చేరాలా? ఇందుకా మేం నిన్ను పెంచి పెద్ద చేసింది?" సుగుణ మనసు విలవిలలాడింది.

"నేను ఏం చేసినా అందులో తప్పు ఉండదన్న నమ్మకం నాకు ఉందమ్మా"

"మమ్మల్నిలా వృద్ధాశ్రమం పాలు చెయ్యడం తప్పు కాదా?"

"నేను చెప్పేది పూర్తిగా విన్నాక నేను చేసింది తప్పో ఒప్పో నిర్ణయించుకోండి. నాన్నగారు రిటైరయ్యాక క్రమంగా ఆయనలో మునుపటి చలాకీతనం, ఉత్సాహం తగ్గుతున్నట్టు నాకు అనిపించింది. అది ఆరోగ్యానికి ఎంతమాత్రం మంచిదికాదు. ఏదో ఒక వ్యాపకం లేకుంటే మనిషి ఇంకా అచేతనుడైపోతాడు. ఒంట్లో జవసత్వాలు ఉన్నంతవరకు మనల్ని మనం ఎప్పుడూ ఏదో ఒక పనితో ఎంగేజ్డ్‌గా ఉంచుకోవాలి. అదే ఆరోగ్య సూత్రం. అప్పుడే నాకీ ఆలోచన వచ్చింది. ఆదరణ కరువైన వయసు మళ్ళిన పెద్దవాళ్ళ కోసం ఏదో ఒకటి చెయ్యాలనిపించింది. ఐతే ఈ పనిని మనస్ఫూర్తిగా స్వీకరించే వాళ్ళు కావాలి. ఇక్కడ పనికి అంకితభావం అవసరం.

అప్పుడే ఈ పనికి సరైన వ్యక్తి నాన్నగారే అన్న అలోచన కలిగింది. నాకు నేనుగా ఈ పని చెయ్యమని చెప్తే ఇదొక ఉద్యోగంలా భావించే అవకాశం




విగ్రహాన్ని ఎక్కడో చూసినట్టనిపించింది శాస్త్రికి. సుగుణకు కూడా అదే అనుభూతి. దగ్గరగా వెళ్ళి సతీసమేతంగా వచ్చిన వ్యాస్‌ను చూసి శాస్త్రి స్థాణువయ్యాడు.

అంటే వీళ్ళందరినీ చేరదీసిందీ, ఈ ఆశ్రమం నడిపేదీ తన కొడుకన్నమాట. మాటమాత్రమైనా తమతో చెప్పక ఇంత గొప్పపని చేయడం వెనుక అంతరార్థమేమిటో అర్థం కాలేదు. ఆఫీసుపనితో సతమతమయ్యే అతనికి ఇక్కడికి వచ్చే తీరిక ఉందా అనిపించింది. అదే సమయంలో తమ బిడ్డ తెరిచిన వృద్ధాశ్రమంలోనే తాము చేరడం జీర్ణించుకోలేని విషయమైంది. అదే సమయంలో వాళ్ళవైపు చూసిన వ్యాస్ చిన్నగా నవ్వుతున్నట్టనిపించింది. దగ్గరగా వచ్చి తల్లిదండ్రులనుచూసి కళ్ళెగరేశాడు వ్యాస్.

సుగుణ ముఖం ముడుచుకుంది. మెల్లగా తల్లి భుజంచుట్టూ చేతులేసి, "ఏంటమ్మా నా మీద కోపమా?" అన్నాడు గారంగా. క్షణకాలం అతనివంక అయిష్టంగా చూసింది.

"ఈ వృద్ధాశ్రమం నడిపేది నువ్వా?" అంటూ ఆశ్చర్యపోయాడు శాస్త్రి.

ఉంది. అందునా వృద్ధాశ్రమ నిర్వహణ అంటే ఎవరికైనా 'మనకెందుకులే' అనిపిస్తుంది. అందుకే నేను ముందుగా ఈ విషయం మీకు చెప్పలేదు.

మీకే ఆ ఉద్దేశం కలిగేలా ప్రవర్తించాను. అదే సమయంలో ఈ ఆశ్రమానికి సంబంధించిన ఉత్తరం మన ఇంటికి పోస్ట్ చేసి నాన్న మనసులో ఆలోచన రేపాను. ఇక్కడి నిబంధన ప్రకారం అందరికన్నా పిన్నవయస్కులే దీని నిర్వహణ బాధ్యత స్వీకరించాలి. ఆ విధంగా ప్రస్తుతం అందరికన్నా చిన్నవారు నాన్నే. అందుకే ఆయన తన కుర్చీని వెంటనే నాన్నగారికి ఇచ్చారు. అలా నాన్నగారిలో కొత్త ఉత్సాహం నింపే ప్రయత్నం చేశాను. నా ఆలోచన సరైనదేనని ఇప్పుడు అనిపిస్తోంది. నిజంగానే ఇప్పుడు ఆయన మునుపటికన్నా హుషారుగా ఉన్నారు కదూ. మిమ్మల్ని నేను నిర్లక్ష్యం చేస్తే నన్ను నేను నిర్లక్ష్యం చేసుకున్నట్టే. నిండు నూరేళ్ళు మీరు ఆరోగ్యంగా ఉండాలంటే ఇలాంటి ఏదో ఒక వ్యాపకం తప్పదు. మీకు చిన్నపిల్లలంటే ఎంత ఇష్టమో నాకు తెలుసు. ఇప్పటికిప్పుడు పదిమంది పిల్లలను కని ఇవ్వలేం.

అందుకే ఇంట్లో కేవలం మీ ఒక్క మనవడితోనే కాలక్షేపం చేసేకంటే ఇక్కడ పదిమంది పిల్లలు ఉంటారు. ఈ ప్రేమను అందరికీ పంచవచ్చు కదా. అలా మీ కోరిక కూడా తీరుతుంది. నా ఆలోచన సరైనదో కాదో మీరే నిర్ణయించుకోండి. ఒక్కటి మాత్రం నిజం. ఎట్టి పరిస్థితుల్లోనూ నేనీ ఆశ్రమం మూసెయ్యను. ఇక్కడికి నాలుగు వీధుల అవతలే మనిల్లు. మీకు ఎక్కడ కావాలంటే అక్కడ వచ్చి ఉండండి. కానీ దీని నిర్వహణ బాధ్యత మాత్రం నాన్నగారు తీసుకోవాలన్నది నా ఆశ" అంటూ ఆపాడు.

"ఏమిటి బాబూ? వీళ్ళు నీ తల్లిదండ్రులా?" అన్నారు అక్కడ ఉన్న వాళ్ళంతా. వాళ్ళకు ఎవరికీ అక్కడ జరుగుతున్నదేమిటో అర్థం కాలేదు.

"అక్షరాలా నన్ను కన్నవాళ్ళే. వీళ్ళను ఇక్కడ ఎందుకు వదిలానన్న ప్రశ్న మీకు కలిగి ఉండొచ్చు. నాన్నగారు రిటైరై ఏమీ తోచడం లేదంటే మీలో ఒకరుగా ఉండి మీ బాగోగులు చూస్తారన్న ఉద్దేశంతోనే ఇక్కడ ఉండమన్నాను. ఆ పైన ఇక వాళ్ళ ఇష్టం"

ముద్దులొలికే అరడజను మంది పిల్లలను వదిలి వెళ్ళడానికి మనసు ఒప్పలేదు సుగుణకు. ఐతే దానికన్నా అతను చెప్పిన రెండో సలహాయే బాగుందనిపించింది.

పక్కనే ఉన్న కోడలు అత్తమామలకు రెండుచేతులూ జోడించి నమస్కరించింది. ఆ తరువాత ఇద్దరూ జంటగా వారి కాళ్ళను స్పృశించి నమస్కరించారు.

"మామగారిలో కొత్తశక్తి నింపాలంటే ఇది తప్పదంటూ ఆయన చెప్పిన సలహామేరకే నేను నడుచుకున్నాను. అప్పటికీ మాటలతోచెప్పి ఒప్పించవచ్చు కదా అని నేను అంటే, 'అప్పుడది ఉద్యోగంలా ఉంటుంది. ఇలాగైతే జీవితంలా అనిపిస్తుంది. మనమేమీ వాళ్ళను నిర్లక్ష్యం చేయడంలేదు కదా. ఈ లోకంలో నిర్లక్ష్యానికీ, నిరాదరణకూ గురవుతున్న వేలాదిమంది తల్లిదండ్రుల పరిస్థితిని పూర్తిగా అర్థం చేసుకుంటారన్న ఉద్దేశంతో, ఆ నమ్మకంతోనే అలా చేస్తున్నాను' అన్నారు. ఆయన ఆలోచన మంచిదే అనిపించి సహకరించాను. నన్ను దోషిలా చూడొద్దమ్మా" అని సజల నయనాలతో అభ్యర్థిస్తున్న కోడలిని ఆప్యాయంగా గుండెలకు హత్తుకుంది సుగుణ.

"నేను కూడా ఉద్యోగం చేస్తే బాగుండునని అప్పుడప్పుడు అనిపించేది. ఉద్యోగం కాని ఈ ఉద్యోగంతో ఇన్నాళ్ళకు ఆ కోరిక తీరుతుంది" అన్నది సుగుణ నవ్వుతూ.

ప్రతిరోజూ ఉదయం పదిగంటలకల్లా తామిద్దరూ కూడా ఆఫీసులకు వెళ్తున్నట్టుగా ఆశ్రమానికి వచ్చి రాత్రివరకు అక్కడే ఉండి రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చేవారు. కొడుకు మీద విరక్తితో కొంతకాలంగా అక్కడే ఉన్న జగన్నాథశాస్త్రి నిజంగానే అక్కడ నివసించే వాళ్ళ కష్టాలు బాగా ఆకళింపు చేసుకున్నాడు. తదనుగుణంగానే అక్కడ కార్యక్రమాలు రూపొందించి అక్కడి వాళ్ళ కష్టాలు తీర్చేందుకు కావాల్సిన అన్ని సదుపాయాలు ఏర్పాటుచేసే పనిలో నిమగ్నమయ్యాడు.

రోజూ వస్తూపోతూ ఆశ్రమం బయట ఉన్న బోర్డుమీద 'కొత్త బంగారు లోకం' అనే అక్షరాలు చదువుతూ తమ బిడ్డకు అటువంటి ఆలోచన వచ్చినందుకు ఎంతో సంతోషించేవారు. అడ్డాలనాడైనా గడ్డాలనాడైనా ఎప్పుడైనా తమ బిడ్డ తమ బిడ్డే, ఆ సామెత అందరికీ వర్తించదనిపించింది.

సెల్: 9003141474

# లిపిడ్ ప్రొఫైల్

లిపిడ్స్ అనేవి కొన్ని రకాల కొవ్వులు మరియు కొవ్వులాంటి పదార్థం. అవి కణాలు మరియు శక్తి యొక్క మూలాలకు ముఖ్యభాగాలుగా ఉన్నాయి. మారుతున్న జీవనశైలి, పెరుగుతున్న శారీరక, మానసిక ఒత్తిడి, ఆహారపు అలవాట్లలోని మార్పుల వల్ల జీవిప్రక్రియలో మార్పులు జరిగి తద్వారా మానవ శరీరంలోని రోగనిరోధకశక్తి తగ్గి రకరకాల వ్యాధులు వస్తున్నాయి. జీవన విధానంలో కృత్రిమ ఆహారాలు, మధ్యపానం వంటి అలవాట్లు, శారీరక శ్రమ తగ్గటం ద్వారా జీర్ణవ్యవస్థలో అసమతూల్యత ఏర్పడుతుంది. ఈ పరిణామాల వలన వచ్చే సమస్యలో ఒకటి ఈ కొలెస్ట్రాల్. ఆరోగ్యకరమైన లిపిడ్ లెవెల్స్ ఒక ఆరోగ్యకరమైన గుండె కొనసాగించటానికి సహాయ పడతాయి. హైడెన్సిటీ లిపోప్రోటీన్ కొలెస్ట్రాల్, లోడెన్సిటీ లైపోప్రోటీన్ కోలెస్ట్రాల్, ట్రైగ్లిజరాయిడ్స్ మొత్తం కొలెస్ట్రాల్ లిపిడ్ ప్రొఫైల్ యొక్క రకాలు. గుండెజబ్బులబారిన పడుతున్న వారి సంఖ్య రోజురోజుకీ పెరుగుతుండటంతో ఇటీవలికాలంలో చాలామంది కొలెస్ట్రాల్‌పై దృష్టి కేంద్రీకరిస్తున్నారు. లిపిడ్ ప్రొఫైల్ అనే పరీక్ష కోలెస్ట్రాల్ ట్రైగ్లిజరైడ్స్, H.D.L, L.D.L ఎంత మోతాదు లో ఉన్నది తెలుసుకోవచ్చు.

**1.మొత్తం కొలెస్ట్రాల్:** ఈ పరీక్ష ద్వారా లిపోప్రోటీన్ రేణువులోని అన్ని కొలెస్ట్రాల్ గురించి తెలుసుకోవచ్చు. **2.హైడెన్సిటీ లైపోప్రోటీన్ కొలెస్ట్రాల్:** ఈ పరీక్ష ద్వారా హైడెన్సిటీ లైపోటీన్ రేణువులోని కొలెస్ట్రాల్ గురించి తెలుసుకోవచ్చు. దీన్ని మంచి కొలెస్ట్రాల్ అని కూడా అంటారు. దీని సాధారణ విలువ 40-60 మధ్యన ఉండాలి. అరవైకన్నా ఎక్కువ ఉంటే గుండెలోని రక్తనాళాల్లో కొవ్వు చేరకుండా చేస్తుంది. ఇది అధిక కొలెస్ట్రాల్ గుండెలోని రక్తనాళాల్లో కొవ్వు చేరకుండా చేస్తుంది. ఇది అధిక కొలెస్ట్రాల్ తొలగిస్తుంది. మరియు తొలగింపు మరియు తొలగింపు కోసం వాటిని పెద్దమొత్తంలో కాలేయంలోకి తీసుకువెళు తుంది. **3. లోడెన్సిటీ లైపో ప్రోటీన్ కొలేస్ట్రాల్:** ఇది లోడెన్సిటీ లైపో ప్రోటీన్ రేణువుల కొలేస్ట్రాల్ లెక్కిస్తుంది. దీన్ని చెడు కొలెస్ట్రాల్ అని కూడా అంటారు. దీని సాధారణ విలువ 140-150mg/dl లోపుఉండాలి. L.D.L-C మొత్తం కొలెస్ట్రాల్, H.D.L-C మరియు ట్రైగ్లిజరైడ్స్ ఫలితాలు ఉపయోగించి లెక్కించ బడుతుంది. **4.ట్రైగ్లిజరైడ్స్:** ఇది అన్ని లైపోప్రోటీన్ రేణువులలోని అన్ని ట్రైగ్లిజెరైడ్స్‌ను కొలుస్తుంది. అది తక్కువ సాంద్రత లైపోప్రోటీన్‌లో ఉంది.




**లిపిడ్ ప్రొఫైల్ టెస్ట్‌లు ఎడురకాలు అవి.**

1.మొత్తం లిపిడ్స్ 2.సిరమ్ మొత్తం కొలెస్ట్రాల్ 3.సిరమ్ H.D.L కొలెస్ట్రాల్ 4.మొత్తం కొలెస్ట్రాల్ / H.D.L నిష్పత్తి 5.సీరమ్ ట్రైగ్లిజెరైడ్స్ 6. సిరమ్ ఫోస్ఫోలిపిడ్లు 7.విద్యుత్ అంశికరణ ఇది



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

ఈ క్రింది వాటి యొక్క శాతం నిర్ణయించబడుతుంది. A. కైలోమైక్రాన్స్, B. లోడెన్సిటీ లైపోప్రోటీన్, C. చాలా తక్కువ సాంద్రత, D. హైడెన్సిటీ లైపో ప్రోటీన్.

**హోమియోచికిత్స:** కొలెస్ట్రాల్ తగ్గించడానికీ హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. దీనికి సాధారణంగా వాడే మందులు కల్కేరియా కార్బ్, ఫ్యూకస్, ఫైటోలిక్కా, కొలెస్ట్రినమ్, గ్రాఫైటీస్, కాక్టస్, రాపుల్ఫియా, సర్పెంటైనా మొదలైనవి అవే కాకుండా నిపుణులైన వైద్యుల పర్యవేక్షణలో సరైన హోమియో మందులను క్రమం తప్పకుండా వాడితే దీనికి మంచి పరిష్కారం లభిస్తుంది. హోమియోపతి వైద్యవిధానం లో కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ ద్వారా మంచి ఫలితం ఉంటుంది. శారీరక, మానసిక, వ్యక్తిగత లక్షణాలను పరిగణలోకి తీసుకొని శాస్త్రీయపద్ధతిలో వైద్యం చేయటం ద్వారా వ్యాధి మూలంనుండి నివారించబడి శాశ్వత పరిష్కారం దానికి లభిస్తుంది. వంశపారంపర్యంగా ఉన్న జబ్బులకి కూడా దీని ద్వారా చక్కని ఫలితాలు ఎటువంటి సైడ్‌ఎఫెక్ట్స్ లేకుండా లభిస్తాయి.



# అశ్మరీకి ఆయుర్వేద వైద్యం

**అశ్మరీ అనేది మూత్ర సంబంధ వ్యాధులలో ఒకటిగా చెప్పుకోవచ్చు. అంటే మూత్రంలో రాళ్ళు పడటం వంటి సమస్య. గడిచిన ఇరవై సంవత్సరాల కాలంలో ఎంతోమంది ఈ వ్యాధితో బాధపడు తున్నారు. ఇంకా పడుతూనే ఉన్నారు. అయితే ఈ వ్యాధికి ఆయుర్వేదం సరైన వైద్యమని అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యనిపుణులు డాక్టర్ లక్ష్మీ. అశ్మరీ వ్యాధి గురించి, దానికి సంబందించిన లక్షణాలు, చికిత్స గురించి ఆమె వివరిస్తున్నారు.**

సాధారణంగా ఇరవై నుంచి నలభైఏళ్ళ మధ్య వయసున్న వారిలో ఈ అశ్మరీ వ్యాధి ఎక్కువగా కనిపిస్తుంది. ఆయుర్వేదశాస్త్రం చెబుతున్న వివరాల ప్రకారం 'అశ్మరీ' అంటే రాళ్ళు అని అర్థం. మూత్ర సంబంధ వ్యాధులలో అశ్మరీ ఒకటి. దీన్నే రీనల్ కాలిక్యులై అని కూడా అంటారు. మన శరీరంలోని కొన్ని భాగాల్లో రాళ్లు ఏర్పడుతుంటాయి. ప్రధానంగా కిడ్నీలలో, మూత్రాశయంలో, మూత్ర నాళాల్లో ఏర్పడతాయి. అయితేకిడ్నీలలో తయారైన రాళ్లు మూత్ర విసర్జన ద్వారానే బయటకు వెళ్తాయి. మూత్ర విసర్జన క్రియలో ప్రధాన పాత్ర వహించేది కిడ్నీలే కాబట్టి మూత్ర విసర్జక సమస్యలు ఏర్పడ తాయి. మూత్రవిసర్జనలో సమస్యలు ఏర్పడితే విపరీతమైన ఇబ్బందికి గురి కావల్సి ఉంటుంది. అందుకే అశ్మరీ వ్యాధికి చికిత్స చేయించుకోవటం కన్నా అది రాకుండా జాగ్రత్తలు తీసుకోవటం ఉత్తమం.

**వ్యాధికారకాలు:** 1. అధిక మాంసాహారం తీసుకో వడం. 2. ద్రవపదార్థాలు తక్కువగా తీసుకోవడం. 3. పీచు పదార్థాలు తక్కువగా తీసుకోవడం. 4. అధిక మానసికఒత్తిడి, బీపీ అధికంగా ఉండటం. అశ్మరీ ఏర్పడటానికి తోడ్పడే పదార్థాలు. అంటే మెగ్నీషియం, సిట్రేట్, ఫాస్ఫేట్స్, ఆక్సిలేట్స్ కొన్ని రకాల డయూరిటిక్స్, యాంటీ యాసిడ్స్ వాడకం అధికమైనపుడు మరియు మూత్రంలో పీహెచ్ మార్పు వచ్చి నప్పుడు, గౌట్ వ్యాధితో బాధపడే వారిలో కూడా అశ్మరీ ఏర్పడటానికి ఎక్కువ అవకాశాలుం టాయి.

**లక్షణాలు:** అశ్మరీని తీవ్రమైన తరువాత గుర్తిస్తారు చాలామంది. ఎందుకంటే వ్యాధి చాలా వరకు ఎలాంటి ప్రత్యేక లక్షణాలు కనపడ కుండానే ఏర్పడుతుంది. క్రమంగా తీవ్రత పెరుగుతుంది.

1. మూత్రవిసర్జనలో మంట, ఏదో అడ్డు పడినట్టు ఉండటం, నొప్పి 2. మూత్రం లో రక్తం పడటం. 3. వాంతి రావటం లేదా వచ్చినట్లు అనిపించడం. చలితో జ్వరం రావటం. అసౌకర్యంగా అని పించటం కడుపులో నొప్పి నడుంనొప్పి, ఈ నొప్పి నడుం వెనుక భాగం నుండి ఉదర కిందిభాగం వరుకు ఉంటుంది.

**జాగ్రత్తలు:** ద్రవ పదార్థాలు ఎక్కువగా తీసుకోవాలి. ముఖ్యంగా మంచినీరు, బార్లీ నీరు ఎక్కువగా తాగాలి. మాంసాహారం, పాలకూర, టమేటా, క్యాబేజీ, పాల పదార్థాలు విటమిన్-సి, డి ఉన్న పదార్థాలు తగ్గించాలి. ఆల్కహాల్, కాఫీ, టీలు, మసాలా పదార్థాలు, నూనే పదార్దాలు తక్కువగా తీసుకుంటేమంచిది. ఒత్తిడి, ఆందోళన తగ్గించు కోవాలి, దినచర్యలో మార్పులు ఉండేలా చూసుకోవాలి.

**చికిత్స:** ఆయుర్వేదంలో ఈ అశ్మరీ సమస్యలకు ప్రత్యేక ఔషధ చికిత్సలు ఉన్నాయి. ఈ చికిత్సా కాలం అశ్మరీ సమస్య తీవ్రత మీద ఆధారపడి ఉంటుంది. చికిత్సను ఆయుర్వేద వైద్యుల పర్యవేక్షణలో తీసుకు న్నట్లయితే అశ్మరీ వ్యాధిని పూర్తిగా నివారించవచ్చును.

**డా.లక్ష్మీ.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**




# వాత మోత!

**"ఇవేమన్నా వెనకటి రోజులనుకున్నారా! పెళ్ళి కుదిరితే పిచ్చి కుదురుతుందనుకోవడానికి" అంది అవనీతలం.**

**"సామెతలు నిత్యానుసరణీయాలు, మనుగడకు మార్గదర్శకాలు. ఆనాడీనాడే కాదు ఏనాడైనా వసివాడని అనుభవసారాలు" అన్నాడు ఆద్యంతం.**

"అవ్వొచ్చుగాక, ఇప్పుడది మనకు వర్తించేది కాదు. మనవాడి పిచ్చేవిటో మీకంటే నాకు ఎక్కువ తెలుసు".

"ఏవిటో. నాకు తక్కువ తెలిసింది".

"వంశోద్ధారకుడు కావాలో, కావాలో అని మొత్తుకున్న మీమొర ఆలకించాడేమో భగవంతుడు వీణ్ణి నా కడుపులో పడేశాడు".

"పెరిగాడు పెద్దవాడయ్యాడు. పెళ్ళీడుకొచ్చాడు. పిచ్చోడై చేతిలో రాయిలాంటిదేం పట్టుకు తిరగడం లేదుగా".

"రాయే ఉండాలా! నడవడి చెప్పడం లేదా, చేష్టలు కనపడ్డం లేదా?"

"లాగూ చొక్కా వాడంతట వాడే వేసుకుంటు న్నాడు, బట్టల్లేకుండా ఏం తిరగడం లేదుగా".

"గుండీలు పెట్టుకోవాలన్న ఇంగితజ్ఞానం కూడా లేదు మరి".

"రాని మాటంటూ లేదు. అడిగిందానికి సమాధానం చెబుతూనే ఉన్నాడు".

"బడికెళ్లరా అంటే అదేంటంటున్నాడు. స్నానం చేశావేరా అంటే ఎవరూ చేయించలేదంటున్నాడు. ఆ జవాబులకే మీ కొడుకేదో రిలేటివిటీ థీరి చెప్పి నంత ఆనంద పడుతున్నారు".

"తల్లిగా ఆ ఆనందం నాకంటే నీకే ఎక్కువ ఉండాలి. నీ ఎక్కువేదో అక్కడ చూపించు".

"నిజమేంటో స్పష్టంగా కనిపిస్తుంటే, ఏం చూసుకుని మురవాలండీ. వాడికి పెళ్ళి ఆలోచన తలబెడితే, పిచ్చి వాడిక్కాదు మీకనుకుంటారు, మీ ఇష్టం" అంది అవనీతలం గొంతులో నిస్సత్తువతో.

"ఎవరో ఏదో అనుకుంటారని మనవాడి భవిష్యత్తు భగ్నం చేసుకుంటామా".

"మీలాంటి మూర్ఖత్వాలు, మొండితనాలే జనాభా సమస్యను పెంచుతున్నాయి. లేని అనర్థాలు వచ్చి పడుతున్నాయి!"

***

"ఏవిటీ... వీడో గొప్ప మగవాడనీ, మేధావివర్గానికి చెందినవాడనీ నమ్మి ఐదు లక్షలు కట్నం ఇస్తామన్నారా! ఎవరో ఆ వరార్తులు!"

"పెద్దగా అరవకు, పీకల మీదకొస్తుంది".

"పెళ్ళి చేస్తే అమ్మాయి పీకలమీదకొస్తుంది"

"నీవు మాట్లాడే పద్ధతి చూస్తే నిన్నెవరూ వాడికి కన్నతల్లివనరు"

"అదేమోగాని, వాడు మీ ప్రతిబింబం అనకుండా చూసుకోండి"

"నీతో ముడివడి ఉండడం కంటే ముడివిడి ఉండడమే మేలనిపిస్తున్నది".

"ఏంటి బావో, ఏదో ముడి దడి అని సందడి చేస్తున్నారు" అంటూ వచ్చాడు వాతాపి.

"నడేమియాలాగా, నువ్వెప్పుడు వచ్చావురా, వాతాపి".

"అదేమరి నేనొచ్చి రెండురోజులైంది బావా".

"పరాచికమా?!"

"కాదు మీ మతిమరుపుకి పరాకాష్ఠ".

***

"మీ అబ్బాయిని కనీసం ఐదేళ్ళు పరిశీలనలో ఉంచాలి. ప్రత్యేక చికిత్సతో ఏమన్నా ప్రయోజనం ఉంటుందేమో చూడాలి, ఉంటుందని మాత్రం నేను చెప్పలేను" చెప్పాడు సైకాలజిస్టు.

"లాభమేదో డాక్టరుగారికి తప్పితే మనకేం ఉండేట్లుగా లేదు".

ఆద్యంతం చెవికొరికాడు వాతాపి.

"ఎంత డబ్బైనా ఫరవాలేదు" బిగ్గరగా అన్నాడు ఆద్యంతం.

వాడికంటే ముందు మా వారి మనసు స్థితే నాకు ఆందోళనగా ఉంది. డాక్టరు గారూ".

"నాకూ అదే అనిపిస్తున్నది" అన్నాడు డాక్టర్.

"అరేయ్! నువ్వు కూడా వీళ్ళతో చేయి కలిపావా" అంటూ డాక్టరుపై చేయిలేపాడు ఆద్యంతం. వెంటనే ఇద్దరు మేల్ నర్సులు వచ్చారు. ఒకరు చేతులు పట్టుకుంటే ఒకరు ఇంజక్షన్ ఇచ్చారు.

మత్తులోకి జారిన ఆద్యంతాన్ని మంచం మీద పడుకోబెట్టారు.

***

పెద్ద కార్పొరేట్ ఆసుపత్రి ఐసీయూలో ఉన్నాడు ఆద్యంతం. మాట పెగలకుండా మూతి బిగించికట్టి ఉంది. ఎక్కువసేపు మత్తులో ఉంచుతున్నారు.

"ఐసీయూలో ఉంచితే ఇకసెలవు అని చెప్పడమే అంటారేవిట్రా" అంది అవనీతలం తమ్ముడితో.

"ఏం గాభరాపడకే, ఇదంతా నా ఏర్పాటే లేవే..." చెప్పాడు తమ్ముడు.

"ఇంత అవసరమంటావారా".

"లేకపోతే, బావ మొండిఘటవాద్య విన్యాసం నీకు తెలియదా. నాకు తెలియదా. ఒక్కదానివి బెంబేలెత్తుతావనేగా నేనొచ్చింది".

ఓ పద్ధతి గల జీవనం అవనీతలానిది. భర్త తన సర్వస్వం అనుకుంది. కానీ... పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. అదేటు దారి తీస్తుందో అనే ఆలోచన కలవరపెడుతున్నది ఓ పక్క.

"లేనిపోని ఆలోచనలతో తల బరువెక్కనీకే అక్కా" అన్నాడు వాతాపి.

"ఆద్యంతం గారు ఐసీయూలో ఉన్నారటగా, చూడొచ్చా" లోపలికి వచ్చి అడిగిందో జంట.

వాళ్ళ వాలకం చూసి ఆడపిల్లవాళ్ళే అని పసిగట్టింది అవనీతలం.

"రెండు రోజులుదాకా మమ్మల్ని కూడా చూడనిచ్చేట్లులేరు. డాక్టర్లు" చెప్పింది అవనీతలం.

"మీరు..." అనడిగింది ఆయనావిడ.

"నేను ఆయనకు ఆవిడనండీ" చెప్పింది అవనీతలం.

"ఓ అవనీతలం గారు మీరేనా" అన్నాడాయన.

"ఇంతకీ మీరెవరండీ" అడిగాడు వాతాపి.

"మేం అమ్మాయి తల్లిదండ్రులమండీ".

"అమ్మాయంటే మాకెలా తెలుస్తుంది".

"అదేంటండీ, మీ అబ్బాయి ఫొటో చూశాం. మా అమ్మాయి ఫొటో కూడా ఇచ్చాం."

"ఇంకానయం అమ్మాయినే ఇచ్చారు కాదు" అని గొణిగి "ఏదీ ఓసారి ఆ ఫొటో ఇవ్వండి చూద్దాం" అన్నాడు వాతాపి.

"ఇప్పుడు మాతో లేదండీ".

"అవును ఎందుకుంటుందిలే! సరే! మీ ఇంటికొచ్చి వివరం మాట్లాడతాం, అడ్రసివ్వండి" అన్నాడు వాతాపి.

***

అవనీతలం స్నేహితురాలు పేరు దేవత. గుణం కూడా దేవతే!

దేవతకు ఇద్దరు ఆడపిల్లలు. భర్త ఏదో అనారోగ్యంతో ఓ ఆసుపత్రిలో చేరాడు. అక్కడ సరస అనే

నర్సమ్మతో సరసమాడాడు. అది చాటుగా కొడుకు పుట్టబోతున్నాడు అన్నదాకా వెళ్ళింది. బొమ్మా బొరుసు వేశాడు. విధి వివాహం చేసుకోమని సూచించింది అని గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు.

ఆ తర్వాత సమయం చూసి భార్యతో చెప్పాడు. ఒక రోజంతా ఏడ్చి కన్నీళ్ళు తుడుచుకుంది దేవత. మగపిల్లవాడి కోసం పెళ్ళి చేసుకోవాల్సి వచ్చింది అన్నాడు భర్త. కవలపిల్లలు అమ్మాయిలు పుడితే ఏం చేసేవారో, అని మాత్రం అనగలిగింది. తర్వాత పరిస్థితికి తల ఒగ్గింది. చిన్నగా తనవాళ్ళకు చెప్పింది. ఆవిడను చెల్లెలుగా, అబ్బాయిని కొడుకుగా స్వీకరించింది. అందుకే దేవత, దేవత! ఆ చెల్లెలు కూడా దేవతకు తగిందే అవడంతో ఆ ఇంట్లో ఆప్యాయతలు అలాగే ఉన్నాయి.

"అదే నేనైతే!" అంది అవనీతలం. "ఏం చేసేదానివే" అని స్నేహితురాలు వేసిన ప్రశ్నకు జవాబు, తను చెప్పలేకపోయింది.

దేవత తన కూతుళ్ళ పెళ్ళి సంగతి ముందుగా చెబుదామని అవనీతలం ఇంటికి వచ్చింది. ఆ సమయంలో ఆద్యంతం, ఆద్యంతాలు లేని ఆవేశంతో ఎగిసి పడుతున్నాడు.

"సరే, వెళ్ళొస్తా" అంది స్నేహితురాలు.

"శుభవార్త చెప్పడానికి వచ్చి అశాంతిగా

**కన్న కొడుక్కి పెళ్ళి చేద్దామని తలపెట్టాడు ఆద్యంతం. భార్య అవనీతలం మాత్రం ఎదురుతిరిగింది. అప్పుడే వాడికి పెళ్ళేమిటని అడిగింది. పెళ్ళి చేస్తే పిచ్చి కుదరడానికి ఇవేమీ వెనుకటి రోజులు కాదని భర్తను హెచ్చరించింది. వాడి చేష్టలు మామూలుగా లేవని మీకు తెలియదా? అని ప్రశ్నించింది. మాట వినడం లేదు భర్త. ఇక బామ్మర్ది వాతాపి రంగంలోకి దిగాడు. తర్వాత కథ ఎటు మలుపు తిరిగింది? వాతాపి ఏం చేశాడు?**

వెళ్ళడం ఏంటి. ఆయన గంతులు ఎప్పుడూ ఉండేవే" అంది అవనీతలం.

***

"వాడూ నువ్వూ కలసి నన్నో వెధవను చేస్తారా" రంకేశాడు ఆద్యంతం. చినిగిన చొక్కాతో ఉన్నాడు వాతాపి. అక్క నవ్వింది. తమ్ముడూ నవ్వాడు.

"పైగా నవ్వులొకటా" అంటూ కత్తి చేతిలో ఉన్నంతవేగంగా ఇద్దరి మీదకి వచ్చాడు ఆద్యంతం.

అవనీతలం లోపల్నుంచి కూరగాయల కత్తి తీసుకొచ్చి ఇచ్చింది.

"తమ్ముడు లాయరనేగా మీ మిడిసిపాటు" అన్నాడు ఆద్యంతం.

"కొడుకు పెళ్ళిని కన్నతల్లి తమ్ముడితో కలిసి ఆపడం, ఈ లోకంలో ఎక్కడా నేను వినలేదు" అన్నాడు ఆద్యంతం చిందులేస్తూ. అవనీతలం జవాబు చెప్పలేదు.

ఆ మౌనం ఏంటో అర్థం కాలేదు ఆద్యంతానికి. పైగా మౌనం భయంకరంగా ఉంటుందని అప్పుడే తెలిసి వచ్చింది. అంతకుమించిన గంభీరంగా ఉన్నాడు వాతాపి సెల్ఫీ తీసుకుంటూ.

"ఈ డ్రామా ఏంటి!" అన్నాడు ఆద్యంతం.

"మహానటనాభినయ మహామహిమాన్వితులు మీ ముందు మా గంతులెంత" అంది అవనీతలం.

"ఏమయిందేంటి, ఏదో తేడాగా ఉంది" అన్నాడు ఆద్యంతం, ఒంటి తడికి వణుకుతూ.

"ఆ ఎత్తున చెమటలు కక్కుతున్నారు. ఏదన్నా ఆసుపత్రికి తీసుకెళ్ళాలేమోరా".



"ఐసీయూ, ఐకాంట్ సీయూ అయిందిగా, ఇంకెందుకులేవే, తుడుచుకోడానికో తుండివ్వవే" అన్నాడు వాతాపి.

"పిల్ల తండ్రి బీదరికం చూసి జాలిపడి అయిదు లక్షలెదురిచ్చి, పెళ్ళి....." ఆగింది అవనీతలం.

"చేద్దామనుకున్నాను తప్పేంటి" మ్యావ్ మన్నాడు ఆద్యంతం.

"చేసుకుందామనుకున్నారు, అందులో కూడా తప్పులేదా" ఖంగుమన్నది అవనీతలం.

"దొంగరాస్కెల్‌గాడు, విషయం కక్కాడన్న మాట వెధవ, అంతుచూస్తాను" అంటూ కదిలాడు ఆద్యంతం.

"అక్కడ పోలీసుల్ని పెట్టా బావా" అన్నాడు వాతాపి.

***

"సంతకం పెట్టు బావా".

"ఏమిటిది?"

"కనపడ్డం లేదా, విడాకుల కాయితాలు. అక్క మనసావాచాకర్మణా అని రాసి, చేసిన సంతకం కనిపించడం లేదా".

"నేను పెట్టను గాక పెట్టను".

"ఇక్కడ మీకు చోటులేదు" అసంకల్పిత కంటి తడితో అంది.

"ఇది నా ఇల్లు" గట్టిగా అన్నాడు ఆద్యంతం.

"అది నీ పేరు మీద ఉన్న సంగతి మరిచిపోయినట్లున్నాడే బావ" అన్నాడు వాతాపి.

"ఇంకా బావేంటిరా" అంది అవనీతలం.

"ఏ మూలో రవంత ఆశ ఉంది. మనసు వంకర సరి చేసుకుంటాడని, సహజంగా మంచివాడేగా" అన్నాడు వాతాపి.

"సరే, ద్రాక్షారామం వెళ్ళొస్తా" అన్నాడు ఆద్యంతం ముఖం, తిరుగుతున్న ఫ్యాన్‌ని చూస్తూ.

"ఆ అమ్మాయిని నా తమ్ముడు చేసుకుంటానన్నాడు. ఆ పెళ్ళికి రాండి, సెల్ నెంబరు మార్చకండి" అంది అవనీతలం.

"సరే, ఏం చేస్తాం! అందరం కలిసే ద్రాక్షారామం వెళ్దాం" అన్నాడు ఆద్యంతం.

నవ్య




**ఆయన వెంటనే ఫోన్ చేసి కీర్తిలాల్‌ను 'అర్జెంటుగా రమ్మని' ఆర్డర్ వేశాడు.**
**ఐదు నిమిషాల్లో కీర్తిలాల్, యాడ్ డైరెక్టర్ కూడా వచ్చారు.**
**"ఏమైంది సార్?" కీర్తిలాల్ అడిగాడు.**
**"సాబ్‌కు మన యాడ్ నచ్చలేదంట! నువ్వేమో పూరా హోగయా బోల్‌కే దారూ పీ రహే హై!" అన్నాడు కొంచెం కోపంగా.**

కీర్తిలాల్ నా వైపు గుర్రుగా చూశాడు. యాడ్ డైరెక్టర్ అయితే నన్ను మింగేసేలా చూస్తున్నాడు.

నేను, కీర్తిలాల్ వైపు చూసి "నేను అనేది ఏమిటంటే మీరు తీసినవి బాగులేదని కాదు! కానీ, ఇంకా బాగా తీయొచ్చునని అంటున్నాను. మీరు మీ టార్గెటెడ్ కస్టమర్లను మరిచిపోతున్నారు. మీరు తీసిన యాడ్ ఇంటర్నేషనల్ కస్టమర్సును ఆకర్షించడానికి ఉపయోగపడుతుంది. కానీ, ఈ యాడ్ ఇంటర్నేషనల్ స్టాండర్డ్స్‌లో లేదు..."

నేను ఇంకా మాట్లాడుతుండగానే, యాడ్ డైరెక్టర్ లేచి, చేతిలో ఉన్న గ్లాసు నేలకేసి కొట్టి "బ్లడీ షిట్! ఎవడ్రా నువ్వు? మోస్ట్ పాపులర్ యాడ్‌ఫిల్మ్ మేకర్‌ని... నా యాడ్‌కే స్టాండర్డ్ లేదంటావా!" అంటూ నా మీదకు రాబోయాడు. ఇంతలో అక్కడున్న బౌన్సర్స్ అతన్ని పట్టుకున్నారు. కీర్తిలాల్ కూడా యాడ్ డైరెక్టర్‌ను కోపంగా చూస్తూ,

"హోల్డ్ యువర్ టంగ్ మ్యాన్! సర్ శ్రావణి మేడం ఫియాన్సీ. ఫేమస్ టాలీవుడ్ డైరెక్టర్. సే సారీ టు హిం. నోరు మూసుకుని సార్ చెప్పింది విను" అన్నాడు కోపంగా.

యాడ్ డైరెక్టర్ వెంటనే కూల్ అయిపోయి,

"సారీ సర్! మై బ్యాడ్. ఐయాం ఎక్స్‌ట్రీమ్లీ సారీ!" అన్నాడు నా చేతులు పట్టుకుని.

"ఆప్ బోలో సాబ్!" అన్నాడు కీర్తిలాల్ తండ్రి.

"సార్! మనం యాడ్ తీసేది, మన టార్గెటెడ్ ఆడియన్స్ అయిన హైదరాబాద్ ప్రజల కోసం. ప్రజలు నగలను ముఖ్యంగా పెళ్ళిళ్ళప్పుడే కొంటారు. అంటే వాళ్ళకు మన సంప్రదాయం, మన నగలు, మన దుస్తులు కావాలి. మనం వాటినే వాళ్ళకు ఇవ్వాలి. మారిషస్ డ్రెస్సు అయితే వాళ్ళకేంటీ, సింగపూర్ డ్రెస్సు అయితే వాళ్ళకేంటీ... వాళ్ళు కనెక్ట్ కారు.

ఇప్పుడు తీసిన యాడ్స్ కూడా ఉంచుదాం. ఎలాగూ మనకు రేపటి వరకు షూట్ ఉంది కాబట్టి, రేపు మరికొన్ని యాడ్స్ షూట్ చేద్దాం. నేను డైరెక్ట్ చేస్తాను. మీకు ఏవి నచ్చితే అవి ఉంచుకోండి. నాకు వీటి కోసం డబ్బులేమి ఇవ్వనవసరం లేదు. శ్రావణికి ఎలాగూ రేపటి కోసం కూడా పేమెంట్ చేసేశారు కాబట్టి, మీకేం నష్టం లేదు" అని చెప్పాను.

వాళ్ళు రెండు నిమిషాలు మాట్లాడుకుని, ఆనందంగా ఒప్పుకున్నారు.

నేను, నాకు కావలసిన ప్రాపర్టీస్, దుస్తులు, నగలు, హెయిర్ స్టైల్ చెప్పాను. పొద్దున్నే ఏడుగంటల కల్లా షూటింగు అయిపోతుంది కాబట్టి, నాలుగింటి కల్లా అందరూ రెడీగా ఉండాలని చెప్పాను. వాళ్ళంతా బిత్తరపోయారు. "నో కాంప్రమైజ్ ఆన్ టైమింగ్!" అనేసరికి అందరి ముఖాలు మాడిపోయాయి.

శ్రావణి ఒళ్ళంతా పసిడి మయమైపోయింది. పసిడి వర్ణపు దుస్తులు ధరించి సముద్రంలో నుంచి నడిచి వస్తుండగా, గాలికి ముంగురులు కదులుతుంటాయి. తడవకుండా చీరను పైకి పట్టుకుని నడుస్తున్న శ్రావణిని స్లో మోషన్‌లో షూట్ చేశాను. ఆమె కాళ్ళకున్న బంగారు పట్టీలు నీళ్ళల్లో మునుగుతూ తేలుతూ ఉంటాయి. ఆమె కాళ్ళ వెంబడి రంగురంగుల చేపలు ఈదుతూ ఉంటాయి. ఆమె వెనుకే హీరో వస్తుంటాడు.

ఉదయపు బంగారు రంగు ఎండలో శ్రావణి పసిడికాంతలా మెరిసిపోతుంది.

ఇంతలో ఒక పంచవన్నెల రామచిలుక ఆమె

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. ఒక మంచి సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకువస్తుంది. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు దర్శకుడు. తన ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరగటంతో, చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్కబెట్టేస్తాడు. ప్రొడ్యూసర్, అతడి స్నేహితులూ కలిసి దర్శకుల అసోసియేషన్ నుంచి దర్శకుణ్ణి బహిష్కరించడం ఒక్కటే ఎజెండాగా డైరెక్టర్స్ యూనియన్ మీటింగ్ ఏర్పాటుచేస్తారు. ఈలోగా జైల్లో నవీన్ ఆత్మహత్య చేసుకుంటాడు. అతడు రాసిన సూసైడ్ నోట్‌తో జరిగిందేమిటో అందరికీ తెలుస్తుంది. సినిమా పూర్తవడంతో సెన్సారుకు అప్లై చేస్తాడు దర్శకుడు. శ్రావణి వాళ్ళమ్మ జైలు నుంచి విడుదలవుతుంది. ఇంతకుముందే ఒప్పుకున్న జ్యుయలరీ యాడ్ షూట్ కోసం మారిషస్ వెళతారు శ్రావణి, దర్శకుడు. ఆ యాడ్ తనకు నచ్చలేదని చెబుతాడు దర్శకుడు. **ఆ తర్వాత...**

భుజంపై వాలి, ఆమె చెవిలో గుసగుసగా,

"ఏం చేశాడే నీ ప్రియుడు?" అని అడుగుతుంది.

దాంతో శ్రావణికి గిలిగింతలై, పకపకా నవ్వుతుంది. నవ్వుతున్నప్పుడు ఆమె నవ్వులు ముత్యాలై నీళ్ళల్లో పడుతుంటే కొన్నింటిని రంగురంగుల చేపలు మింగుతాయి. కొన్నింటిని వెనుక వస్తున్న హీరో దోసిలి నిండా పట్టుకుని శ్రావణిపై చల్లుతాడు. అవి ముత్యాలసరాలై శ్రావణి కంఠాన్ని అలంకరిస్తాయి.

"మేము కూడా ఇలాగే ఎంతో శోధించి, శ్రమించి అపురూపమైన స్వర్ణాభరణాలను, మా కస్టమర్లకు అందిస్తాం" అన్న కాప్షన్‌తో యాడ్ ముగుస్తుంది.

ఈ అర నిమిషం యాడ్‌లో లాజిక్ ఉండదు. కేవలం ప్రేక్షకులను మంత్ర ముగ్ధులను చేసి మన సరుకులు అమ్ముకోవడమే. ఆ కళలో ఎంత వరకు విజయం సాధించామన్నదే పాయింట్. లేకపోతే, షారూఖ్ ఖాన్ కూరగాయలను కొంటాడంటే ఎవరైనా నమ్ముతారా? కానీ, ఆ యాడ్ పిచ్చిగా క్లిక్ అయింది.

నేను నా యాడ్ కాన్సెప్టును, అంతకు ముందు రోజు హోటల్లో ఉన్న మాట్లాడే చిలుకను, సముద్ర తీరంలో ఈదుతున్న రంగురంగుల చేప పిల్లలను చూసే రూపొందించాను.

అట్లాగే ఇంకో యాడ్‌లో శ్రావణి బోల్డన్ని నగలు ధరించి గుడికి వెళ్తుంది. అక్కడి స్త్రీలంతా ఆమెను చూసి ఈర్ష్య పడతారు. శ్రావణి దేవుడికి నమస్కరించి బయటకు వచ్చి, వాళ్ళతో,

"మీరూ రండి. మా...... జ్యుయలరీ షాపులో నగలు కొని నా అంత అందంగా ముస్తాబవ్వండి." అని చెబుతుంది.

వాళ్ళు చేసిన మూడు యాడ్స్, నేను చేసిన రెండు యాడ్స్‌ను 30 సెకండ్లకు, 60 సెకండ్లకు ఎడిట్ చేసి, RR, DI, డబ్బింగ్ చేశాము. నేను పక్కనే నిలబడి పర్యవేక్షించాను.

ఫైనల్‌గా యాడ్స్ చూసిన వాళ్ళకు నా రెండు యాడ్స్ మాత్రమే బాగా నచ్చాయి. మిగతావి, విజువల్‌గా బాగున్నా వాటిలో ఆత్మ లేదు. కృత్రిమంగా ఉన్నాయి. నా యాడ్స్ ఆడవాళ్ళను వశీకరించుకుంటాయి. మొదటి యాడ్ యువతులను ఆకర్షిస్తే, రెండో యాడ్ అన్ని వయసుల స్త్రీలకు కనెక్ట్ అవుతుంది.

బొంబాయి నుంచి వచ్చిన ఫిల్మ్ మేకర్ కూడా హృదయపూర్వకంగా అభినందించాడు.

కీర్తిలాల్ తండ్రికి బాగా నచ్చాయి. ఆయనకు మొదటి నుండీ బొంబాయి వాడు నచ్చలేదు ఎందుకో. బహుశా, వాడి పిలకా, ఫ్రెంచ్‌కట్ గడ్డం చూసి కావచ్చు.

కీర్తిలాల్ ఈ యాడ్స్‌ను తన ఫ్రెండ్స్‌కి పంపించాడు. అందరూ మెచ్చుకున్నారు. శ్రావణి అందానికి ఫిదా అయిపోయారు. వారిలో ఒక వస్త్రప్రపంచపు అధినేత నాకు ఫోన్ చేసి తనకో యాడ్ చేసి పెట్టమనీ, మేము ఒప్పుకుంటే రాత్రికి రాత్రే బయల్దేరి మారిషస్ వచ్చేస్తానన్నాడు. పేమెంట్ మా ఇష్టం అన్నాడు. నేను శ్రావణితో మాట్లాడి చెబుతానన్నాను. శ్రావణి ఓకే అంది. అంతే... అతను ఐదారు సూట్‌కేసుల్లో చీరలు, కాస్ట్యూమ్స్ సర్దుకుని కాస్ట్యూమర్‌ను, కొరియోగ్రాఫర్‌ను వెంటపెట్టుకుని మరునాటికల్లా మారిషస్‌లో దిగాడు.

పేమెంట్ కీర్తిలాల్ ఇచ్చినంతే ఇస్తానన్నాడు. వస్త్రప్రపంచానికి రెండు రాష్ట్రాల్లో కలిసి ఇరవై షోరూములున్నాయి. కాబట్టి పేమెంట్ డబుల్ అని నేనన్నాను. వాళ్ళు ఒప్పుకున్నారు. మూడు సంవత్సరాల కోసం ఒక కోటి రూపాయలు. వాళ్ళ ప్రతీ షోరూంను సంవత్సరానికోసారి విజిట్ చేయాలని కండీషన్ పెట్టారు. నేను ఒప్పుకున్నాను.

కానీ, అతను "స్విమ్ సూట్" అనగానే, నేను కోపంగా లేచి నిలబడి "బై" చెప్పాను. ఆయన నా చేతులు పట్టుకుని, "ఓకే ఓకే, నో స్విమ్ సూట్! సరేనా!" అన్నాడు.

మారిషస్‌లో ఇంకో రెండు రోజులు ఉండాల్సి వచ్చింది. వస్త్రప్రపంచం యాడ్ కూడా నేనే చేయాల్సి వచ్చింది. మొత్తానికి నాలుగు రోజుల్లో రెండు ప్రముఖ సంస్థల ప్రకటనలు పూర్తి చేశాం. శ్రావణి అన్నట్టు, ఈ ప్రకటనల వల్ల బోలెడన్ని డబ్బులే కాకుండా మంచి పబ్లిసిటీ వస్తుంది. అందుకే అప్పట్లో, సినీతారల సబ్బుగా పేరొందిన "లక్స్" వ్యాపార చిత్రాల్లో నటించడానికి హీరోయిన్లు పోటీ పడేవారు.

నేను వద్దన్నా వినకుండా, వాళ్ళిద్దరూ, డైరెక్టర్ రెమ్యునరేషన్‌గా నాకు చెరో ఐదు లక్షలూ ఇచ్చారు.



శ్రావణికి వస్త్రప్రపంచం యాడ్‌కి మొదటి విడతగా యాభై లక్షలు ముట్టింది. నాలుగు రోజులకు దాదాపు ఎనభై లక్షలు ముట్టాయి.

తిరుగు ప్రయాణంలో విమానంలో కూర్చున్న నాకు 'కలయా! వైష్ణవ మాయా!' అనిపించింది. డబ్బున్నవాళ్ళకు లక్షలంటే లక్ష్యమే లేదు.

జేబులో వంద రూపాయలు లేక ఆటో ఎక్కలేక మైళ్ళ కొద్దీ నడిచిన రోజుల అనుభవాలు ఇంకా నా మదిలో నుండి చెరిగిపోలేదు. ప్రొడ్యూసర్ ఆఫీసులో దొరికే భోజనం కోసమే పొద్దున్నే ఆ ఆఫీసుకు చేరుకున్న రోజులు మరిచిపోలేదు.

అట్లాంటిది, అదృష్ట దేవత తలుపు తడితే, 'దేనేవాలే చప్పర్ పాడ్ కే దేతే' అన్నట్టుగా అంటే 'ఇచ్చేవాడికి దయ ఉంటే ఆకాశాన్ని బద్దలు కొట్టయినా సరే ఒడిని నింపుతాడన్న' మాట.

శ్రావణికి డబ్బుల విషయమే పట్టదు. అంతా నేనే చూసుకుంటానన్న నిబ్బరంతో ఉంటుంది.

నేను యాడ్ డైరెక్ట్ చేసింది కూడా శ్రావణిని అందంగా చూపించడం కోసమే. దాంతోపాటు తనను అసభ్యంగా చూపించకుండా నా జాగ్రత్త కోసం నేను ఇన్వాల్వ్ అయ్యాను. ఆ ప్రయత్నం కూడా కనక వర్షం కురిపించింది.

***

అదనంగా వచ్చిన అరవై లక్షల్లో కొంత బ్యాంకు లోన్‌కు కట్టేశాం. మిగిలిన డబ్బులతో కొత్త ఇంట్లోకి కావల్సిన ఫర్నీచర్, ఇంటీరియర్ డెకొరేషన్, మాడ్యులర్ కిచెన్, ఫిట్‌నెస్ ఎక్విప్మెంట్, హోం థియేటర్, సెంట్రలైజ్డ్ ఏసీలు కొనేశాం. కానీ, అబ్బో! రోజుకో లిస్టు ముందు పెట్టేది శ్రావణి.

***

ఇంతలో నా సినిమా సెన్సార్ కోసం పిలుపు వచ్చింది. సినిమాలో అడల్ట్ కంటెంట్, సెక్సీ సీనులు, ఎక్కువే కాబట్టి 'A' సర్టిఫికెట్ వచ్చింది. కొన్ని డైలాగులు, కొన్ని సీన్లు తీసేస్తే 'U/A' ఇస్తామన్నారు. నేను కట్స్‌కు ఒప్పుకోలేదు.

'A' సర్టిఫికెట్‌నే స్వీకరించాను. దాన్ని తీసుకున్న క్షణంలో నా కళ్ళు చెమర్చాయి.

'ఒక మహా ప్రయాణం ముగిసింది. ఒక ముఖ్య ఘట్టం పూర్తయింది.'

మిగతా వారి విషయం నాకు తెలియదు కానీ, నా జీవితంలో ఇదొక ముఖ్య సంఘటన. నా జీవితం, ఇక్కడి నుంచి అయితే ఉన్నత శిఖరాలకు చేరుకోవచ్చు. లేదా శ్రావణికి మేనేజరుగా పనిచేసే స్థాయికి దిగజారవచ్చు. మొన్న మారిషస్‌లో వస్త్ర ప్రపంచం యజమాని నన్ను శ్రావణి మేనేజర్ అనే అనుకున్నాడు. తరువాత తన తప్పు తెలుసుకుని 'సారీ' చెప్పాడు. అది తెలియక జరిగినా, ఆ సంఘటన నా మనసులో బలంగా ముద్రించుకు పోయింది. 'నా భవిష్యత్తుకు సూచనా' 'ఒక ప్రీమానిషనా?' అన్న ఆలోచనే నన్ను తొలిచేస్తోంది. శ్రావణికి మేనేజర్గా పనిచేయడానికి నాకేమీ నామోషీ లేదు. కానీ, నేను నా ప్రయత్నంలో విఫలమవుతానేమో అనే భయమే నన్ను కుంగదీస్తోంది.

***

ఇపుడు నా సినిమాను థియేటర్లలో రిలీజ్ చేయడమనే ఒక చివరి ఘట్టం, ముఖ్య ఘట్టం, క్లిష్టమైన ఘట్టం మిగిలి ఉంది. ఇంత కృషి చేసిందీ, మన సినిమాను నలుగురికీ చూపించి వారి ప్రశంసలు పొందాలనే ఆశతోనే.

సినిమా తీయడం ఎంత కష్టమో, ఆ సినిమాను ప్రేక్షకుల దగ్గరకు చేర్చడానికి అంతకు వంద రెట్లు కష్టపడాలి. తెలుగు రాష్ట్రాల్లోని థియేటర్లన్నీ కొందరి కబంధ హస్తాల్లో బంధించబడి ఉన్నాయి. ఇక్కడంతా పక్కా వ్యాపారం. చిన్న సినిమా ఉసురు పోసుకుంటున్న ఈ చట్రంలో ఇరుక్కుని అనేక సినిమాలు ల్యాబుల్లోనే మూలుగుతున్నాయి.

**సినిమా సెన్సార్ పూర్తయింది. ఇక రిలీజ్ చేయడమే తరువాయి. ఆ ఏర్పాట్లలో ఉంటూనే, అంతర్జాతీయంగా జరిగే అనేక ఫిలిం ఫెస్టివల్స్‌కు తన సినిమాను పంపాడు దర్శకుడు. ఇండియన్ పనోరమాకు ఎంపికయింది. సినిమా పారిస్ ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్‌లో మూడు అవార్డులు గెలుచుకుంది. ఇంతలో ఆస్కార్ నోటిఫికేషన్ వచ్చింది. అప్లై చేశాడు దర్శకుడు. మరి అతడి సినిమా చరిత్ర సృష్టించిందా? ఆస్కార్ అందుకుందా?**

చిన్న సినిమా పతనానికి కారణమెవరో అందరికీ తెలుసు. ప్రభుత్వాలకు ఇంకా బాగా తెలుసు. అయినా సరే, వారినే పిలిచి జాతీయ అవార్డులు కట్టబెడుతుంది.

చిన్న సినిమాల ఘోష అరణ్య రోదనే అయింది.

ఇక్కడ కళలు, కళాసేవ, కళామ తల్లి అనేవన్నీ పడికట్టు పదాలు. తీపి పదార్థాల మీద అందం కోసం, మిఠాయి కొట్టువాడు పలుచని తగరపు రేకు అద్దినట్టు, ఉపన్యాసాల్లో అక్కడక్కడా ఈ పడికట్టు పదాలను అద్దుతారు. తగరపు రేకు, ఆరోగ్యానికి ఎంత ప్రమాదమో, వీళ్ళు కూడా చిన్న సినిమాల పాలిట అంత ప్రమాదకారులే.

నాది మామూలు కమర్షియల్ ఫార్మాట్ సినిమా కాదని టాలీవుడ్ మొత్తానికి తెలుసు.

చిన్న సినిమా, ఆర్ట్ ఫిలిం, శ్రావణి తప్ప అందరూ కొత్త నటులు, తెలిసిన ఒక్క ముఖం కూడా లేదు.... ఈ కారణాలు చాలు నా సినిమాకు థియేటర్లు దొరకక పోవడానికి.

ఒకవైపు రిలీజ్‌కు ప్రయత్నిస్తూనే, సబ్సిడీ మీద 'ఈ టీవీ' 'మా టీవీ'ల్లో యాడ్స్ రిలీజ్ చేశాం. మరొక వైపు నేను ఇంగ్లీషులో సబ్ టైటిల్స్ వేయించి రెడీగా పెట్టుకున్నాను. ఎందుకంటే, సంవత్సరం పొడుగునా ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్స్ జరుగుతూనే ఉంటాయి. అక్కడే నిజమైన ప్రతిభ బయటపడుతుంది. ఇక్కడిలాగా పైరవీలు, ప్రలోభాలకు అవార్డులు రావు అక్కడ. అందుకే వరసపెట్టి చాలా ఫెస్టివల్స్‌కు సినిమాను పంపడం మొదలు పెట్టాను.

ఇంట గెలవలేక రచ్చకెక్కడం అంటే ఇదేనేమో. ఇది టాలీవుడ్‌కు మాత్రమే పట్టిన దరిద్రం. మిగతా భాషల్లో కమర్షియల్ సినిమాలతో పాటు, చిన్న సినిమాలు కూడా బతికి బట్టకడుతున్నాయి. ఇతర భాషల్లో హిట్టు కొట్టిన ఆ చిన్న సినిమాలనే టాలీవుడ్ బడా హీరోలు కొనుక్కుని వచ్చి మసాలాలు దట్టించి తీస్తున్నారు. కానీ, మన సినిమాలకు మాత్రం థియేటర్లు దొరకవు.

'ఇండియన్ పనోరమా'కు కూడా నా ఎంట్రీ పంపాను.

ఈ లోగా, ఒక ఆసక్తికరమైన సంఘటన జరిగింది. అది ఒకందుకు మంచికే జరిగింది.

పెద్దల కోసం తీసే సెక్స్ చిత్రాల్లో నటించే యూట్యూబ్ నీలితార, నా సినిమాలో ఒక పాత్ర వేసింది. ఆమె ఒక వెబ్ ఛానల్‌కు ఇంటర్వ్యూ

## ధన్యవాదాలు

*పాఠకులకు నమస్కారం*

*మీరు నా సీరియల్‌ను ఆదరించిన తీరు అమోఘం. ఎంతోమంది ఎన్నోరకాలుగా ప్రశంసలు కురిపించారు. కానీ, అందరూ ఏకగ్రీవంగా చెప్పిందేమిటంటే 'పాకుడు రాళ్ళు' నవల తర్వాత సినిమారంగం మీద వచ్చిన ఇంత సమగ్రమైన నవల 'సినీవాలి' మాత్రమే అని. 'పాకుడు రాళ్ళు' నవలా కాలం నుంచి ఇప్పటివరకు సినిమారంగం ఎంతో అభివృద్ధి చెందింది. నా సీరియల్‌లో కథ అనుమతించిన మేరకు 24 క్రాఫ్ట్ గురించి నాకు తెలిసిన విషయాలు మీతో పంచుకున్నాను. మీతో 30 వారాల ప్రయాణం అద్భుతం. మీలాగే నాక్కూడా ఈ నవలలోని పాత్రలమీద అభిమానం ఏర్పడింది. ముఖ్యంగా శ్రావణి కష్టాలు చదువుతుంటే నాకే ఏడుపు వచ్చేది. అవి నేను సృష్టించిన పాత్రలని నేను భావించలేదు. మిత్రులు కొంతమంది 'సినీవాలి' అంటే అర్థం ఏమిటి? అని అడుగుతున్నారు. ఈ పదం సినిమాకు సంబంధించింది కాదు. 'సినీవాలి' అంటే అమావాస్యరాత్రిగానీ, ఆ తర్వాత రాత్రిగానీ తెల్లవారుజామున కనిపించే 'చంద్రవంక' వెలుగు అని అర్థం.*

*సినిమారంగం ఇంత భయంకరంగా ఉంటుందా? అని చాలామందికి అనుమానం. ఇంతకన్నా నీచంగా, భయంకరంగా, అన్నిరంగాల మాదిరిగానే ఉంటుంది. ఇక్కడ కార్చే కన్నీళ్ళు ఏ జీవనదికీ తక్కువ కాదు. పాఠకులతో కలిసి ఈ వేదిక పంచుకునేందుకు ఇంత గొప్ప అవకాశం నాకు ఇచ్చిన సంపాదకవర్గానికీ, 'నవ్య' యాజమాన్యానికీ, చిత్రకారుడు 'బాలి' గారికీ నా ధన్యవాదాలు.*

**—ప్రభాకర్ జైని**

ఇచ్చింది. ఆ ఇంటర్వ్యూలో 'డైరెక్టర్ కోరిక మేరకు నేను ఆ సినిమాలో అర్ధనగ్నంగా నటించాను' అని చెప్పింది. అందులో ఏ మాత్రం అబద్ధం లేదు. అది నిజం కూడా. ఆమె ఆ ఇంటర్వ్యూకు ముందు నన్ను అడిగింది కూడా. నేను నిజమే చెప్పమన్నాను.

సినిమాలో ఒక పాత్రధారికి న్యూడ్ ఫోటోగ్రఫీ అంటే పిచ్చి. దారిన పోతున్న బిచ్చగత్తెకు అర్ధ రూపాయి ఇచ్చి ఆమెను అర్ధనగ్నంగా ఫోటోలు తీసి హీరోకు చూపిస్తాడు. హీరో అతన్ని తిట్టి పంపి స్తాడు.

అయితే, ఆ సీన్ ఏ మాత్రం అసభ్యంగా లేదు. ఇప్పుడొచ్చే అగ్ర హీరోల రత్తాలు కన్నా తక్కువ ఎక్స్‌పోజింగే ఉంది. కానీ, ఆ వెబ్ ఛానల్ వాడు 'అర్ధ' అన్న పదాన్ని చిన్న ప్రింటులో పెట్టి 'డైరెక్టర్ కోరిక మేరకు నగ్నంగా నటించిన తెలుగు పోర్న్ తార', అని హెడ్డింగ్ పెట్టి యూట్యూబ్‌లో అప్‌లోడ్ చేశాడు. ఆ ఇంటర్వ్యూకు రెండు రోజుల్లో ఇరవై లక్షల హిట్స్ వచ్చాయి. రోజురోజుకు పెరుగుతూనే ఉన్నాయి.

అసలు నా ఉద్దేశం, సెక్స్ చూపించి సినిమాను నడుపుకోవడం కాదు. ఈ సీన్ షూట్ చేసిన తర్వాత కూడా చాలాసార్లు తర్జనభర్జనలు జరిగాయి. ఈ సీన్ ఒరిజినల్‌గా నవలలో ఉంది. యూనివర్సిటీ విద్యార్థుల మనోభావాలను వ్యక్తపరచడానికి రచయిత ఆ సంఘటన సృష్టించాడు. ఆ సీను తీసేయొద్దని చాలామంది మేధావులు, రచయితలు చెప్పడంతోనే ఉంచాను.

టాలీవుడ్‌లో యూట్యూబ్ ఇంటర్వ్యూ సంచలనం సృష్టించింది.

ఈ విషయం ప్రొడ్యూసర్ పసిగట్టాడు. 'తను సినిమా చూడాలనుకుంటున్నానని' నాకు కబురు పంపాడు. నాకు అతని ప్లాన్ అర్థమయింది.

నేనేం సమాధానం చెప్పకపోయేసరికి మనుషుల మీద మనుషులను పంపసాగాడు.

నాకేం చేయాలో పాలుపోవడం లేదు. న్యాయంగా చూస్తే, సినిమా మీద అతనికి అన్ని హక్కులూ ఉన్నాయి. కానీ, బ్యానర్ నా పేరు మీద రిజిస్టర్ కావడం, సినిమా నా బ్యానర్ లోనే తీయడంతో చట్టపరంగా నాకే హక్కు ఉంది.

ఇన్ని రోజులూ నన్ను నానా హింసలు పెట్టి, ఐటీ రెయిడ్ చేయించి, శ్రావణి మీద దాడి చేసిన వారి సైడున నిలబడి నన్ను యూనియన్ నుండి బహిష్కరించేందుకు ప్రయత్నించిన అతని పట్ల నాకు ఏ సానుభూతి లేదు. భగవంతుడు నా పక్షాన ఉన్నాడు కాబట్టి, ఈ సినిమా ఈ రోజు బయట పడింది. లేకపోతే, సినిమా రంగపు కుళ్ళు, కుతంత్రాల బారిన పడి బాక్సుల్లో మూలుగుతున్న ఎన్నో సినిమాల్లాగానే చిత్ర రంగ మురికి కూపంలో పడి నా సినిమా కూడా నామరూపాలు లేకుండా పోయేది.

అయినా, నాకు అతన్ని మోసం చేయాలని లేదు. నేను అభిషేకం గారి సలహా అడిగాను. యూనియన్ మీటింగు తర్వాత ఆయన మళ్ళీ ఆఫీసుకు వస్తున్నాడు. ఆయన ప్రొడ్యూసరుకు సినిమాను చూపించడానికి గానీ, హక్కులు బదిలీ చేయడానికి గానీ ఒప్పుకోలేదు.

ఒక రోజు ఆఫీసులో ఉండగా ప్రొడ్యూసర్ వచ్చాడు. రాగానే నా చేతులు పట్టుకుని "నన్ను క్షమించండి సార్! మనసులో ఏం పెట్టుకోకండి. పెద్దవాణ్ణి. ఎంతయినా ఈ సినిమాకు పెట్టుబడి పెట్టింది నేనే కదా సార్!" అన్నాడు అనునయంగా.

"ఓకే! ఇప్పుడేం చేయమంటారు?" అని అడిగాను, నిర్లిప్తంగా.

"సినిమా రిలీజ్ చేసుకుంటాను సార్! పెట్టిన పెట్టుబడైనా రావాలి కదా సార్!" అన్నాడు.

"నేనే రిలీజ్ చేస్తాను. మీ పెట్టుబడి మీకు వడ్డీతో సహా ఇచ్చేస్తాను" అన్నాను బింకంగా, నాకు ఆల్రెడీ డిస్ట్రిబ్యూటర్లు దొరికినంత కాన్ఫిడెన్సుగా. ప్రొడ్యూసర్ కంగారు పడ్డాడు. చకచకా ఆలోచించాడు. నేను అంత నమ్మకంగా చెప్పేసరికి అతనికి దురాశ పెరిగింది. నేను పెట్టుబడి కంటే ఎన్నో రెట్లు ఎక్కువ సంపాదించుకుంటున్నానన్న దుగ్ధ అతని ముఖంలో కనపడింది.

"అదేంటి సార్! ప్రొడ్యూసరును నేను కదా?

"తెలుగులో మొదటిసారి రిలీజ్‌కు మాత్రం నీకు ఇస్తాను. శాటిలైట్ రైట్స్, డిజిటల్ రైట్స్, డబ్బింగ్ రైట్స్, రిపీట్ రిలీజ్ రైట్స్, నెగటివ్ హోల్డింగ్ హక్కులు నాకే ఉంటాయి. నీకు మొదటి రిలీజ్‌లో పెట్టిన పెట్టుబడి రాకపోతే నా బాధ్యత ఉండదు. ప్రతీచోటా ప్రొడ్యూసర్‌గా బ్యానర్ పేరు, డైరెక్టర్‌గా నా పేరుతోనే వ్యవహారం జరగాలి. పబ్లిసిటీ ఖర్చులు మీవే. అన్ని ఫిల్మ్ ఫెస్టివల్స్‌కు నేనే పంపుకుంటాను. వచ్చే ప్రైజ్ మనీ, అవార్డులు రివార్డులు అన్నీ బ్యానర్‌కే అంటే నాకే చెందుతాయి. తెలుగులో సినిమా నువ్వు రిలీజ్ చేసినా దాంట్లో ఎటువంటి మార్పులూ చేర్పులూ నా అనుమతి లేకుండా చేయకూడదు. తెలుగులో అవార్డులకు నేనే అప్లై చేస్తాను. ఇవన్నీ మీకిష్టమైతే స్టాంప్ పేపర్ల మీద రాసి రిజిస్టర్ చేసుకుందాం" అన్నాను.



నాకు చెప్పకుండా మీరెలా రిలీజ్ చేస్తారు?"

నా ఉచ్చులో అతను పడ్డాడు. అతను ఆ ప్రశ్న అడగాలనే నేను సంభాషణను అలా డైవర్ట్ చేశాను.

"కాదు సార్! ఈ సినిమాకు సంబంధించినంత వరకు నా బ్యానరే ప్రొడ్యూసర్. మీకు, ఈ సినిమాకు ఏ సంబంధం లేదు" అన్నాను కూల్‌గా.

ప్రొడ్యూసరుకు వెర్రెక్కింది.

"మరి పెట్టుబడి నాది కాదా?"

"ఏమో, నాకు తెలియదు" అన్నాను.

నేను మొండికేశానని అతనికి అర్థం కావాలి. ఇప్పుడు అర్థమయ్యింది.

"ఇది అన్యాయం సార్!" అన్నాడు బేలగా.

"కాదు. నువ్వు చేసిన పనులకు ఇదే సరైన న్యాయం!" అన్నాను స్థిరంగా అతని కళ్ళల్లోకి చూస్తూ.

అతను కళ్ళు దించుకున్నాడు.

"అయితే సినిమా నాకు ఇవ్వరా?" అన్నాడు చివరకు.

"ఇస్తాను!" అన్నాను.

అభిషేకం గారితో పాటూ అందరూ ఆశ్చర్యపోయారు.

ప్రొడ్యూసర్ ఉబ్బితబ్బిబ్బయి పోతూ,

"మరి ఇప్పుడు మీకెంత ఇవ్వమంటారు?" అని అడిగాడు.

ప్రొడ్యూసరుకు పెద్దగా బుర్ర లేదని ఆయన అడిగిన ప్రశ్నతోనే అర్థమయింది.

"నాకేం వద్దు" అన్నాను.

ప్రొడ్యూసర్ నిజంగా నిర్ఘాంతపోయాడు. అంత దుర్మార్గుడైన అతను కూడా చలించిపోయాడు. కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ,

"సార్! మీరు నిజంగా పిచ్చోళ్ళే సార్! ఈ రోజుల్లో ఈ టాలీవుడ్‌లో ఉండాల్సిన వాళ్ళు కాదు. మీరడిగితే ఎంతయినా ఇచ్చేవాణ్ణి" అన్నాడు నా చేతులు పట్టుకుంటూ.

"మీరెంత ఇచ్చినా నేను తీసుకునేవాణ్ణి కాదు. తెలుగులో మొదటి రిలీజ్ వరకు అన్ని హక్కులూ మీవే! మీరే తొందర పడ్డారు. నన్ను చాలా ఇబ్బంది పెట్టారు. గతం గతః నేనెప్పుడూ డబ్బుకు ఆశపడలేదు. మీరు నాకు అవకాశం ఇచ్చారు. మీ ఆర్థిక సహాయం లేకపోతే నేనీ సినిమా తీయగలిగేవాణ్ణే కాదు" అన్నాను. ఎందుకో నా గొంతు వణికింది.

ప్రొడ్యూసర్ గారు చేతులు జోడించి, "నన్ను క్షమించండి సార్! టాలీవుడ్ లాంటి మురికి కూపంలో బ్రతుకుతున్న నేను మీలాంటి స్వచ్ఛమైన, పరిశుభ్రమైన అంతరంగం గల మనుషులు కూడా ఉంటారని కలలో కూడా ఊహించలేదు" అన్నాడు.

అతను కుర్చీలో కూర్చొని, సూట్‌కేసు తెరిచి చెక్ బుక్ తీసి చకచకా మూడు చెక్కులు రాశాడు. అవి నా చేతిలో పెట్టాడు. ఒక చెక్ ఐదు కోట్లకు, బ్యానర్ పేరు మీద; రెండు కోట్లకు ఒక చెక్, నా పేరు మీద; ఒక కోటికి చెక్, శ్రావణి పేరు మీద ఉన్నాయి.

"ఏమిటి సార్ ఇవి?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాను.

ఆయన ముసిముసిగా నవ్వుతూ "ఇవి మీ తదుపరి చిత్రానికి అడ్వాన్సులు సార్! వెంటనే ఇంకో సినిమా మొదలు పెట్టండి. మీలాంటి ఉత్తములను నేను వదులుకోలేను. దయచేసి స్వీకరించండి. పాత విషయాలు మనసులో పెట్టుకుని కాదనకండి!" అన్నాడు. నాకు ఇబ్బందిగా అనిపించింది.

"నేను ఇప్పుడే నెక్స్ట్ సినిమా గురించి ఏమీ అనుకోలేదు. చాలా టైం పడుతుంది. అప్పుడు తీసుకుంటాను




లెండి!" అన్నాను చెక్కులు వాపసు ఇవ్వబోతూ.

ఆయన తీసుకోలేదు.

"మీరు కాదంటే నా మీద కోపం తగ్గనట్టే" అంటూ వంగి నా కాళ్ళు పట్టుకోబోయాడు. నేను దూరంగా జరిగి,

"అయ్యో, ఇదేమిటి?" అంటూ ఆయన భుజాలు పట్టుకుని లేపాను.

"కాదనకండి సార్!" ఈసారి అభిషేకం గారు కూడా అన్నారు.

నేను ఔననక తప్పలేదు.

రెండు రోజుల్లో అగ్రిమెంటు తయారయింది. నేను సంతకం చేసేశాను. ప్రొడ్యూసర్‌గారు ఆ సినిమాను ఐదు కోట్లకు NRA (non refundable advance) పద్ధతిలో అమ్మేశాడు. నాకు చెబితే, నాకేం అభ్యంతరం లేదని చెప్పాను. కొన్నవారు కూడా నాకు చెప్పారు. నేను అంగీకరించాను.

ఈ లోపల నా సినిమా 'ఇండియన్ పనోరమా'కు ఎంపిక అయింది. పారిస్ ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్లో కూడా మూడు అవార్డులు పొందింది.

ఇంతలో 'ఆస్కార్ నోటిఫికేషన్ వచ్చింది. నేను అప్లై చేశాను. రెండు నెలల తర్వాత, భారతదేశం నుండి నా ఒక్క సినిమా 'ఫారిన్ లాంగ్వేజ్ సినిమా' కేటగిరీలో ఎంపిక అయింది.

దాంతో నా సినిమాకు బాగా హైప్ వచ్చింది. నాకు చాలా ఆఫర్లు వచ్చాయి. కానీ, నేను ఒప్పుకోలేదు. ఒకేసారి రెండు మూడు సినిమాలు డైరెక్ట్ చేసే సామర్థ్యం నాకు లేదు.

కొత్త సినిమాకు సబ్జెక్ట్ గురించి రీసెర్చ్ చేస్తూ టైం గడుపుతున్నాను. నాకు పది ఇంగ్లీషు సినిమాలు రుబ్బి కొత్త కథను తయారుచేసే అలవాటు లేదు. అసలు నాకు స్టోరీ డిపార్టుమెంటే లేదు.

***

అమ్మావాళ్ళు, శ్రావణి వాళ్ళమ్మ కూడా మా పెళ్ళి గురించి ఒత్తిడి చేయసాగారు. మా ఇల్లు కూడా అన్ని హంగులతో పూర్తయింది. శ్రావణీ, వాళ్ళమ్మగారు ఆ కొత్త ఇంట్లో ఉంటున్నారు. నేను ఫ్లాట్‌లోనే కంటిన్యూ అవుతున్నాను.

రోజులు అద్భుతంగా, హాయిగా గడిచిపోతున్నాయి. మా జీవితాల్లో ఒక గొప్ప మార్పు రాబోతుందన్న ఆశతో రోజులు గడుపుతున్నాం. శ్రావణికి కూడా తొందరగా పెళ్ళి చేసుకోవాలని ఉన్నా, "రెండో సినిమా అయ్యాకే" అని నేను చెప్పడంతో ఇతర సినిమాలన్నీ తగ్గించుకుంది. శ్రావణి చేసిన యాడ్ ఫిల్మ్స్ దుమ్ము రేపాయి. చాలా ఆఫర్లు వచ్చాయి. వాటిల్లో మంచి వాటిని సెలెక్ట్ చేసుకుని, ఇద్దరం కలిసి చేస్తున్నాం.

ఈ లోపల లండన్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో నా సినిమా చాలా అవార్డులు కొట్టేసింది. వాళ్ళు మా ఇద్దరినీ ఆహ్వానించారు.

ఇంతలో నేను గుండెలు చిక్కబట్టుకుని ఎదురు చూస్తున్న సమయం రానే వచ్చింది. 'ఆస్కార్ ఫెస్టివల్'కు రమ్మని ఆహ్వానం వచ్చింది. నన్నూ, హీరోయిన్‌ని పిలిచారు. ఫలానా రోజు ఫలానా సమయానికి హాలీవుడ్‌లోని డాల్బీ థియేటర్ రెడ్‌కార్పెట్ మీద హీరోయిన్ ఉండాలని చెప్పారు.

మేము లండన్ ఫిలిం ఫెస్టివల్ అటెండయి అక్కడినుంచి హాలీవుడ్ వెళ్ళాలని ప్లాన్ చేసుకుంటుంటే, ఓ గొప్ప ఆఫర్ వచ్చింది శ్రావణికి. ఓ అంతర్జాతీయ బ్రాండ్ సౌందర్య సాధనాల సంస్థ 'పారిస్‌లో షూట్ ఉంటుంది, రావడానికి వీలవుతుందా?' అని ఎంక్వైరీ చేశారు. మేము ఎగిరి గంతేశాము. ఆ ప్రోగ్రాం అంతా చూసుకోవడానికి వాళ్ళే ఓ టూర్ ఆపరేటర్‌ని అపాయింట్ చేశారు.

ఆ పనులన్నీ దిగ్విజయంగా పూర్తి చేసుకుని, హాలీవుడ్‌కు వెళ్ళడానికి లండన్ 'హీత్రూ' విమానాశ్రయం చేరుకున్నాము.

***

లండన్!

హీత్రూ ఎయిర్‌పోర్టు!

మేము బోర్డు అయ్యి అప్పటికే పది నిమిషాలయ్యింది.

ఆ పది నిమిషాల్లోనే, నా పక్క సీట్లోనే ఉన్న శ్రావణి నిద్రలోకి జారుకుంది.

ఇంతలో, విమానం టేకాఫ్ అవుతున్నట్టుగా అనౌన్స్ అయింది.

బిజినెస్ క్లాస్‌లో యాంబియెన్స్ ఆహ్లాదకరంగా ఉంది. బిజినెస్ క్లాస్‌లో ఇదే నా మొదటి ప్రయాణం. అసలు, ఇంటర్నేషనల్ ఫ్లైట్ ఎక్కడమే ఇది మొదటి సారి.

నా మనసు కూడా, విమానంలాగే, గాల్లో తేలిపోతోంది.

ఈ సంవత్సరం, ఇతర భాషల కేటగిరిలో, ఇండియా నుండి, ఆస్కార్ అవార్డు పోటీకి ఎంపికయిన మొదటి చిత్ర దర్శకుడిగా అమెరికాకు ఆహ్వానించబడిన నేను ఇక్కడ కూడా విజయం సాధిస్తే, చరిత్ర సృష్టించిన వాణ్ణవుతాను. ఎందుకంటే, ఇంతవరకు ఈ దశకు చేరుకున్న ఇండియన్ సినిమాలే నాలుగు. వాటిల్లో ఒక్కటి కూడా విజయం సాధించలేదు. పోయిన సంవత్సరం తమిళ చిత్రం 'విశారణై' ఈ స్టేజ్ వరకు వచ్చింది. అప్పుడు 'ది సేల్స్‌మాన్' అనే ఇరానియన్ సినిమా అవార్డు గెలుచుకుంది. ఈసారి నా సినిమా. నేను అవార్డు గెలుచుకుంటే భారతదేశం నుండి 'ఆస్కార్' సాధించిన మొట్టమొదటి దర్శకుణ్ణి నేనే అవుతాను. అదీ, తెలుగు సినిమా ద్వారా అవార్డు సాధిస్తే టాలీవుడ్ పేరు ప్రఖ్యాతులు ప్రపంచమంతా మారుమోగుతాయి. విజయం సాధిస్తానా? లేదా?

ఒక్క క్షణం విశ్రాంతిగా కూర్చున్నా ఈ ప్రశ్నలే నాలో సుళ్ళు తిరుగుతున్నాయి. నా మనసులో నిరంతర సముద్ర ఘోష!

ఇంతలో, నా పక్క సీట్లో ఉన్న శ్రావణి, నా సినిమా హీరోయిన్ కదిలింది.

నిద్రలో ఆమె ముఖం, ముగ్ధమనోహరంగా ఉంది. ఏ మధుర జ్ఞాపకం గుర్తొచ్చిందో ఏమో గానీ, ముఖంలో చిరునవ్వు మొలక మొలిచింది.

ఆమె ఒంటి మీద ఉన్న మాడ్రన్ డ్రెస్ రెడ్‌కార్పెట్ మీద, ఆమె అందాలు దాచడం కన్నా, చూపించడానికే డిజైన్ చేయబడ్డట్టుంది. ఆమె పచ్చటి శరీరం మీద ఉన్న నల్లరంగు వెల్వెట్ గౌను స్థానభ్రంశం చెందడంతో నున్నటి భుజాలు, శంఖం లాంటి మెడ, పూర్ణకుంభాల్లాంటి ఆమె ఎద ద్వయం, వాటి మధ్యన అంతుచిక్కని అగాధం, దాని అంచున ఉన్న మహా బిలం లాంటి నాభి వరకు నా చూపు పాకింది. శ్రావణి ముందు ఒప్పుకోలేదు అట్లాంటి డ్రెస్ వేసుకోవడానికి. కానీ నేనూ, డిజైనర్ కలిసి ఒప్పించాం. ఆ మాత్రం గ్లామరస్‌గా ఉండడంలో తప్పు లేదని నేనే నచ్చచెప్పాను.

ఆమె కదిలినప్పుడల్లా, ఆమె ఒంటి నుండి వస్తున్న పున్నాగపూల పరిమళం నా మనసును మధురోహల్లో ముంచేసింది. నా మనసు, శరీరం

వశం తప్పుతుంది. ముద్దుగా, సున్నాలా, చుట్టుకుని ఉన్న అందమైన, పిల్లనాగులా ఉన్న, ఆ పెదాలపై ముద్దు పెట్టాలనే కాంక్షను, బలవంతంగా, నేను చేసుకున్న ప్రమాణాన్ని గుర్తు చేసుకుని, అణచుకున్నాను.

ఈ సమయంలో శ్రావణి నా పక్కన లేకుంటే, ఆలోచనల తాకిడికి, నా బుర్ర బద్దలయ్యేది.

ఇంతలో, ఎయిర్ హోస్టెస్, డ్రింక్స్ ట్రే పట్టుకొని వచ్చింది.

సీలింగ్‌లో ఉన్న లైట్ల వెలుగులో, క్రిస్టల్ కట్ గ్లాసులు, ఆ గ్లాసుల్లో బంగారు రంగులో మిల మిల మెరుస్తున్న ద్రవం నన్ను ఊరించింది. ఈ టెన్షన్ భరించలేక గటగటా ఒక ఫుల్ బాటిల్ తాగేయాలని ఉంది.

కానీ, నా ప్రమాణం గుర్తొచ్చింది. దాంతోపాటూ, యాదగిరి నరసింహస్వామీ, నన్ను ఎన్నోసార్లు ప్రమాదాల బారి నుండి రక్షించిన డీసీపీ మేడం గుర్తొచ్చారు. అమెరికా నేల మీద అడుగు పెట్టగానే, మేడంను చూస్తానన్న ఊహతో కొంచెం తేరుకున్నాను.

మేడం కూడా మాతో పాటూ 'ఆస్కార్' ఫంక్షనుకు వచ్చేలా అనుమతి తీసుకున్నాను. వాళ్ళిద్దరూ నా పక్కనుంటే నాకు కొండంత ధైర్యం. జయాపజయాలను స్పోర్టివ్‌గా స్వీకరించే ధైర్యం వస్తుంది.

***

'ఆస్కార్' అవార్డుల ప్రదానోత్సవంలో భాగంగా 'రెడ్‌కార్పెట్' మీద పరేడ్ జరుగుతోంది. ఇది ప్రపంచంలోనే అతి పెద్ద ఫ్యాషన్ గ్రాండ్ గాలా ఈవెంట్. ఎంతో మంది ప్రపంచ ప్రసిద్ధి గాంచిన సుందరాంగులు నడిచిన నేల. అట్లాంటి చోట శ్రావణి, నా శ్రావణి, ముగ్ధమోహన అందాలు చిందిస్తూ నిలబడింది. ఆమెలోని అమాయకత్వం ఆమె ముఖంలో ప్రతిబింబిస్తోంది. నేనూ, మేడం పక్కనే ఉండి ప్రోత్సహించడంతో ఆ కాస్త ధైర్యంగానైనా నిలబడగలిగింది. ఫోటో సెషన్ కాగానే పరుగుపరుగున వచ్చి మా ఇద్దరినీ చుట్టుముట్టేసింది.

90వ వార్షిక అకాడమీ అవార్డుల ప్రదానోత్సవం ప్రారంభించారు. రెండు మూడు కేటగిరీల తర్వాత 'ఫారిన్ లాంగ్వేజ్ కేటగిరి'లోని నామినేషన్లను చదివారు. అందులో నా సినిమా పేరు ఉంది.

ఆ తర్వాత,

"అండ్ ది అవార్డ్ గోస్ టూ...."

అని అంటుండగానే శ్రావణి కళ్ళల్లో భయం, ఆందోళన స్పష్టంగా కనిపించాయి. మేడం నా చేయిని వదలకుండా పట్టుకుంది. నేను కుర్చీలో నిబ్బరంగా కూర్చున్నాను. అవార్డు గ్రహీతలను వేదిక మీదకు తీసుకువెళ్ళడానికి పోటీదార్లు కూర్చుని ఉన్న కుర్చీల వరస చివర పుష్పగుచ్ఛాలు పట్టుకుని అవార్డు కమిటీ తరఫున వచ్చిన అమ్మాయిలు నిలబడతారు. ఎవరి పేరు అనౌన్స్ చేస్తారో వారికి పూల బొకే ఇచ్చి వేదికమీదకు తీసుకు వెళ్తారు. ఇది పద్ధతి.

అలాగే, మేము కూర్చున్న వరస చివరన కూడా ఒకమ్మాయి పుష్పగుచ్ఛంతో నిలబడి ఉంది.

ఒక్కసారిగా చప్పట్లు మారుమోగాయి. ఎవరి పేరు అనౌన్స్ చేశారో నేను వినలేదు. నేను ఒక విధమైన ట్రాన్స్‌లో ఉండిపోయాను.

నా జీవితంలో, ఈ డాల్బీ థియేటర్లోకి ప్రవేశించడమే నేను సాధించిన అత్యంత గొప్ప విజయం. ఈ రెడ్‌కార్పెట్ మీద కాలు మోపడం, మహామహులకే సాధ్యం కాలేదు. ఆ కార్యాన్ని నేను సాధించగలిగాను.

ఇక్కడి వరకు రావడమనే గమనమే, ప్రయాణమే ముఖ్యం నాకు.

లక్ష్యం అనేది ఎప్పుడూ ఎడారిలోని మరీచికే.

ఒక లక్ష్యం చేరిన తర్వాత అక్కడ ఏముంటుంది. ఏమీ ఉండదు. శూన్యం.

నాకయితే ఆ లక్ష్యాన్ని ఛేదించానన్న సంతోషం కన్నా తర్వాతేం చేయాలన్న ప్రశ్నే నన్ను ఎక్కువగా బాధ పెడుతుంది.

ఒక మనిషి తన జీవితంలో అనేక లక్ష్యాలు సాధించుకుంటూ, అల్టిమేట్‌గా అంటే అంతిమ గమ్యం వైపు పయనించడమే ఆ మనిషి జీవితానికి సార్ధకత.

చప్పట్లు ఆగిపోయాయి.

శ్రావణీ, మేడం లేచి నిలబడి నా వైపు నవ్వుతూ చూడసాగారు. ఎవరో పుష్పగుచ్ఛం తీసుకుని వస్తున్నట్టు, నీళ్ళతో నిండిన నా కళ్ళకు మసకమసకగా కన్పించసాగింది.

**(అయిపోయింది)**

## మనమీదేనర్రోయ్!

సరసి








## సైకిల్‌తో ఆరోగ్యం!



బైకులు అందుబాటులోకి వచ్చిన తరువాత సైకిల్‌ని ఎవరూ పెద్దగా ఉపయోగించడం లేదు. కానీ సైకిల్ తొక్కడం వలన ఆరోగ్యం సొంతం చేసుకోవచ్చు అంటున్నారు బ్రిటన్ పరిశోధకులు. సుమారు రెండున్నర లక్షల మంది మీద ఐదుసంవత్సరాల పాటు పరిశోధన నిర్వహించారు. ఆఫీసులకీ, ఇతర పనుల మీద బయటకు వెళ్లే సమయంలో సైకిల్‌కి బదులు బైక్ ఉపయోగిస్తే కలిగే అనారోగ్యాలను వీరు కనుగొన్నారు.

బైక్ బదులు సైకిల్ ఉపయోగిస్తే కేన్సర్ వచ్చే అవకాశం 43 శాతం తగ్గుతుందని, అదేవిధంగా గుండె జబ్బులు వచ్చే అవకాశం కూడా 36 శాతం తగ్గుతుందని వారు చెబుతున్నారు. అకాల మరణాలు 40 శాతం తగ్గుతాయని చెబుతున్నారు. అంతే కాకుండా సైకిల్ ఉపయోగించేవారిలో ఊబకాయం, చక్కెర వ్యాధిలాంటి సమస్యలు తక్కువగా కనిపిస్తాయని అంటున్నారు. సైకిల్ వాడకం వలన ఇంధనం పొదుపు మాత్రమే కాకుండా వాతావరణ కాలుష్యం కాకుండా ఉంటుందనీ, ఆరోగ్యం కూడా భేషుగ్గా ఉంటుందని వారు సూచిస్తున్నారు.

## కూల్‌డ్రింక్స్‌తో మెదడుకు దెబ్బ?



వేసవికాలం వచ్చిందంటే కూల్‌డ్రింక్స్ వాడకం రెట్టింపు అవుతూ ఉంటుంది. అందరికీ అందుబాటు ధరలతోపాటు రుచి, తియ్యదనం తదితర అంశాలు ఎక్కువగా ఆకర్షిస్తుండడంతో చాలా మంది వీటిని తాగకుండా ఉండలేరు. తరచు కూల్‌డ్రింక్స్ తాగేవారిలో ఊబకాయం, చక్కెర వ్యాధి కనిపించే అవకాశాలు ఎక్కువన్న సంగతి గతంలో నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. ఇప్పుడు ఇవి మెదడు మీద కూడా తీవ్రప్రభావం చూపుతుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో స్పష్టమైంది. కూల్‌డ్రింక్స్ తాగే కొంతమంది మీద అధ్యయనం నిర్వహించారు. వీరి మెదడు కుంచించుకుపోవడం, నిర్వీర్యమవడం, జ్ఞాపకశక్తి సన్నగిల్లడం వంటి లక్షణాలు పరిశోధకులు గుర్తించారు. మామూలు కూల్‌డ్రింకుల కన్నా కూడా డైట్ కూల్‌డ్రింక్ తీసుకునేవారిలో ఈ ముప్పు మూడు రెట్లు అధికంగా ఉంటుందని వారు చెబుతున్నారు. అందువలన ఎంత దాహమైనా బయట దొరికే కూల్‌డ్రింకుల జోలికి పోకుండా ఇంట్లో తయారు చేసిన జ్యూస్‌లే ఎక్కువగా తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

## స్ట్రాబెర్రీస్‌తో రొమ్ము కేన్సర్ దూరం?

స్త్రీల పాలిట శాపంగా మారిన రొమ్ము కేన్సర్‌ను అడ్డుకోవడానికి రకరకాల పరిశోధనలు, ప్రయోగాలు నిర్వహిస్తూనే ఉన్నారు. ఎలుకల మీద నిర్వహించిన ఓ పరిశోధన రొమ్ము కేన్సర్ వ్యాధిగ్రస్థులకు ఎంతో ఉపయోగపడుతుంది అంటున్నారు పరిశోధకులు. రొమ్ము కేన్సర్‌కు గురైనవారు ప్రతి రోజూ పదిహేను స్ట్రాబెర్రీ పళ్ళు క్రమంగా తీసుకుంటే కేన్సర్ కణజాలం పెరగకుండా నిరోధించవచ్చన్న విషయాన్ని వీరు కనుగొన్నారు. రొమ్ము కేన్సర్‌తో బాధపడుతున్న ఎలుకల మీద వీరు పరిశోధన నిర్వహించారు. వీటిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు ఎలుకలకు క్రమం తప్పకుండా పదిహేను స్ట్రాబెర్రి పళ్ళు ఇచ్చారు. మరో గ్రూపుకి మామూలు పళ్ళు ఇచ్చారు. కొన్ని నెలల అనంతరం ఈ ఎలుకలను పరీక్షించగా, స్ట్రాబెర్రి పళ్ళు తిన్న ఎలుకల్లో రొమ్ము కేన్సర్ కణితి క్రమేపీ తగ్గగా, ఆ పండు తినని ఎలుకల్లో ఎలాంటి మార్పును గమనించలేదు. కేవలం ఈ పండు తినడం వలనే ఎలుకల్లో కేన్సర్ కణజాలం పెరగకుండా నిరోధించబడిందా? లేక దీనికి మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



## సన్నగా ఉన్నా డిప్రెషన్?



సాధారణంగా బరువు ఎక్కువగా ఉన్నవారిలోనే డిప్రెషన్ లక్షణాలు ఎక్కువగా కనిపిస్తాయి. దీనికి స్త్రీలే ఎక్కువగా గురవుతుంటారు. కానీ సన్నగా ఉన్నవారు కూడా డిప్రెషన్‌కి లోనవుతారనీ, బరువు తక్కువగా ఉండడమే వారి మానసిక అశాంతికి కారణమనీ దక్షిణ కొరియా పరిశోధకులు నిర్వహించిన ఓ అధ్యయనంలో వెల్లడైంది. బరువు తక్కువగా ఉన్న స్త్రీ పురుషులిద్దరూ కూడా డిప్రెషన్‌కి గురికావడాన్ని వీరు గుర్తించారు. వీరిలో శారీరక బలహీనతతో పాటు ఆత్మవిశ్వాసం సన్నగిల్లడం, ఆత్మన్యూనత, పోషకాహార లోపం తదితరమైన కారణాలు డిప్రెషన్‌కి దోహదం చేస్తాయని వీరు అభిప్రాయపడుతున్నారు. పై లోపాలను సరిదిద్దుకోగలిగితే వీరు డిప్రెషన్ నుంచి బయటపడే అవకాశం ఉందని వీరు స్పష్టం చేస్తున్నారు. మానసిక అశాంతికి బరువు కారణం కాదు అని వారు చెబుతున్నారు.

## వ్యాయామంతో కంటి చూపు మెరుగు?



ప్రతిరోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం వలన మానసిక శారీరక ఆరోగ్యంతో పాటు కంటిచూపు కూడా మెరుగు పడుతుంది అంటున్నారు పరిశోధకులు. క్రమం తప్పకుండా పదిహేనురోజులపాటు వ్యాయామం చేయడం వలన వయస్సు రీత్యా వచ్చే కంటిసమస్యల నుంచి తప్పించుకోవచ్చన్న విషయం వీరి అధ్యయనంలో వెల్లడైంది. అరవై నుంచి డెబ్బై సంవత్సరాల వయస్సు ఉన్న 20 మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరి చేత ప్రతి రోజూ సైక్లింగ్, వాకింగ్ వంటివి చేయించారు. కొన్ని రోజుల అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించగా, కంటి చూపు మెరుగు పడిన విషయం గమనించారు. కేవలం చిన్నపాటి వ్యాయామంతోనే కంటి చూపు మెరుగుపడిందా? మరేదైనా కారణం ఉందా? అనే విషయాన్ని వీరు పరిశీలిస్తున్నారు.

—అవినాష్

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## థైరాయిడ్ సమస్యలకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ఈ మధ్యకాలంలో దేశజనాభాలో చాలా ఎక్కువ మంది – థైరాయిడ్ సమస్యలతో బాధపడటం జరుగుతోంది. మారుతున్న మానవుని జీవనశైలితో పాటు అధిక మానసిక ఒత్తిడికి లోనవడం ఈ సమస్యకు గల ప్రధాన కారణంగా చెప్పవచ్చు. దీని వలన శరీర బరువులో మార్పులు ఏర్పడటం, స్త్రీలలో ఋతుచక్ర సమస్యలు, పిల్లలలో ఎదుగుదల సమస్యలు మొదలైన దుష్ఫలితాలను ఎదుర్కోవడం జరుగుతోంది. అయితే ఈ సమస్యతో బాధపడేవారు 'జీవితకాలం పాటు మందులు వాడటం' లేదా 'తప్పనిసరిగా శస్త్రచికిత్స చేయించుకోవడం' ద్వారా మాత్రమే థైరాయిడ్ సమస్య నుండి బయటపడగలమని భావిస్తుంటారు. కానీ హోమియో చికిత్సను అందించడం ద్వారా ఈ థైరాయిడ్ సమస్యలను సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంది.




మానవ శరీరంలోని ముఖ్యమైన గ్రంథులలో ఒకటైన థైరాయిడ్ గ్రంథి – మెడ ప్రాంతంలో కంఠం దగ్గర సీతాకోకచిలుక రెక్కల రూపంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. థైరాయిడ్ గ్రంథి మన మెదడులోని పిట్యుటరీ గ్రంథి నియంత్రణలో ఉంటుంది. శరీరంలో తగినంతగా థైరాయిడ్ హార్మోన్‌లు లేనప్పుడు, పిట్యుటరీ గ్రంథి ఆ అవసరాన్ని గ్రహించి TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్)ను విడుదల చేస్తుంది. ఈ TSH సంకేతంతోనే థైరాయిడ్ గ్రంథి T3, T4 అనబడే థైరాయిడ్ హార్మోన్‌లను ఉత్పత్తి చేసి రక్తప్రవాహంలోకి పంపుతుంది. ఇలా రక్తంలో కలిసిన T3, T4 హార్మోన్‌ల ప్రభావం – శరీర ఎదుగుదల, శ్వాస వ్యవస్థ, గుండె, నాడీమండలం, జీర్ణ వ్యవస్థ, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతానోత్పత్తి వ్యవస్థ వంటి అన్ని జీవక్రియలపై ఉంటుంది.

ఇలా నిరంతరం మన శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తగిన స్థాయిలో ఉండే వ్యవస్థ విఫలమై, తద్వారా థైరాయిడ్ హార్మోన్‌ల ఉత్పత్తి ఎక్కువ మరియు తక్కువ కావడం ఒక ఖచ్చితమైన సమస్యగా పరిణమిస్తుంది. ఈ రకమైన అసమతుల్యతలు – హైపోథైరాయిడ్ లేదా హైపర్‌థైరాయిడ్ మరియు గాయిటర్ అనే దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తాయి.

**హైపోథైరాయిడిజం:** ఇది సర్వసాధారణమైన సమస్య. శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడంతో తలెత్తే ఈ సమస్య సహజంగా పిల్లలు, స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఏ వయస్సు వారిలోనైనా ఇది కనిపించవచ్చు.
**లక్షణాలు: పిల్లలలో** – బుద్ధిమాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం కోల్పోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం. **యుక్తవయస్సు వారిలో:** ఒంట్లో నీరు చేరి బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, రజస్వల (మెనార్కే) ఆలస్యం కావడం, ఋతుచక్రం ఆలస్యం కావడం, అమెనోరియా, నెలసరిలో అధిక రక్తస్రావము లేదా అల్ప రక్తస్రావము ఉండటం, సంతానలేమి, చర్మం పొడిబారడం, వెంట్రుకలు రాలడం, బద్ధకంగా ఉండటం, చలిని తట్టుకోలేకపోవడం, అర్టికేరియా అనే చర్మసంబంధిత వ్యాధుల వంటి లక్షణాలతో హైపోథైరాయిడ్ సమస్యను సులువుగా గుర్తించవచ్చు.

**హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ గ్రంథి – ఎక్కువ మోతాదులో థైరాక్సిన్‌ను విడుదల చేయడం వలన వచ్చే సమస్యను హైపర్‌థైరాయిడిజం అంటారు.
**లక్షణాలు:** ఆహారం సరైన మోతాదులో తీసుకున్నప్పటికీ బరువు తగ్గిపోవటం, నిద్రలేమి, గుండెదడ, అధిక చెమటలు, విరేచనాలు, చేతులు వణకడం, నీరసంగా ఉండటం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం జరగడం.

**గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అంటారు. కొన్ని సందర్భాలలో ఇది సాధారణ పరిమాణం కంటే రెండింతలు పెరిగి, స్వరపేటికపైన ఒత్తిడి చేయడం వలన మాట్లాడేటప్పుడు స్వరంలో (వాయిస్) మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. గాయిటర్‌లో T3, T4 థైరాయిడ్ హార్మోన్‌లు సాధారణ స్థితిలో ఉన్నప్పటికీ గాయిటర్ లేనట్లుగా నిర్ధారించలేము. **కారణాలు:** దీనికి అతి ముఖ్యమైన కారణం 'అయోడిన్' అనే మూలకం లోపం మరియు గ్రేవ్స్ డిసీజ్, పిట్యుటరీ గ్రంథిలో ఏర్పడే కణితులు (ట్యూమర్స్), థైరాయిడ్ క్యాన్సర్ వంటివి గాయిటర్ సమస్యకు దారితీస్తాయి.
**లక్షణాలు:** గొంతు క్రింద వాపు రావటంతో ఆహారం మ్రింగడానికి కష్టంగా ఉంటుంది. స్వరంలో మార్పులు రావటం, ఎక్సాప్‌తాల్మిక్ గాయిటర్ అనగా కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం, టిబియల్ మిక్సెడిమా వంటి లక్షణాలు కనపడటం జరుగుతుంది.

**థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు:** నేటి మానవ జీవన విధానం ప్రకృతి విరుద్ధముగా ఉండటం, సరైన శారీరక వ్యాయామం లేకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన ఈ థైరాయిడ్ సమస్యలు ఎదురవుతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, TSH, యాంటీ థైరాయిడ్ యాంటీ బాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్, గొంతు యొక్క CT స్కాన్ వంటి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారిస్తారు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో ముందుగా రోగి యొక్క శరీర తత్వాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన తదుపరి మాత్రమే అందించబడే జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ సిమిలిమం విధానం ద్వారా, హైపోథలామస్–పిట్యుటరీ–థైరాయిడ్ వ్యవస్థను సరిచేసి థైరాయిడ్ సమస్యలను పూర్తిగా నయం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in




# బుర్క్ అండ్ హేర్

**'విచ్చలవిడితనం నేరప్రవృత్తిని పెంచుతుందా అన్న అంశంపై పరిశోధనలు జరుగుతున్నాయి. ఎందుకంటే సమాజంలో వ్యక్తుల స్వేచ్ఛ పెరుగుతోందిగానీ ఆ స్వేచ్ఛకు తగ్గట్టు మనస్తత్వం మారకపోవడంతో అది పలు రకాల వికృతాలకు దారితీస్తోంది. నేర పరిశోధనలో దీనిపై దృష్టి కేంద్రీకరించాలి' అసిస్టెంట్ రాముకు పరిశోధనా మెళకువలు వివరిస్తున్న శరత్, సెక్రటరీ సుధ గదిలోకి రావటంతో ఆ వైపు చూశాడు.**

'బాస్, అర్జంటుగా కలవాలట ఎవరో వచ్చారు' సుధ చెప్తుంటేనే ఓ నడివయసు వ్యక్తి లోపలకు వచ్చాడు.

'నా అల్లుడే నా కూతురిని హత్యచేశాడు. పోలీసులు దాన్ని ఆత్మహత్యగా ప్రకటించేలోగా మీరు నిజం తేల్చాలి' కన్నీళ్ళతో అభ్యర్థించాడతడు.

***

'దగ్గరకు జారేసి ఉన్న తలుపులు తట్టింది పని మనిషి. ఎంత పిలిచినా ఎవరూ పలకలేదు. లోపలకు వెళ్ళి గదుల్లో వెతికింది. మంచంపైన సుమతి పడుకుని కనిపించింది. ఎంత పిలిచినా పలకలేదు. తట్టి లేపబోతే అర్థమైంది, ఆమె శవమైపోయిందని' చెప్పాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

'ఆమె భర్త?' అడిగాడు శరత్.

'ఈ రోజు ఉదయం బెంగుళూరు నుంచి విమానం దిగాడు. వెంటనే అరెస్టు చేశాం. ఇంకా ప్రశ్నించాలి'.

క్రైమ్‌సీన్ పరిశోధకులు అప్పటికే తమ పని పూర్తిచేశారు. ఇంట్లో అన్నిచోట్లా వేలి ముద్రలు సేకరించారు. గదులన్నీ తిరిగి పరిశీలించాడు శరత్. ఎక్కడా అనుమానాస్పదంగా ఏమీ కనబడలేదు. తర్వాత శవాన్ని పరిశీలిస్తుండగా శరత్ భృకుటి ముడి పడింది.

విజయ్ అతడి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

'ఇది ఆత్మహత్యో, సహజమరణమో కాదు, ఇది హత్య' గంభీరంగా అని ఇంకాస్త జాగ్రత్తగా పరిశీలన ప్రారంభించాడు.

'మెడమీద అతిసన్నని ఈ గాటు చూడు. ఏదో సన్నినిదాన్ని బిగించారు. ప్రాణం ఉన్నప్పుడు ఏర్పడిన గాయం'!

'అంటే ఊపిరి అందకుండా చేసి చంపేశారా?' అడిగాడు విజయ్.

'అంతేకాదు ఇక్కడ బుల్ చంపే పద్ధతి ఉంది 'బుర్క్‌డ్' (Burked) అంటారు. ఆ పద్ధతిని కూడా ప్రయోగించారు.

ప్రశ్నార్థకంగా చూశాడు విజయ్.

'1820 ప్రాంతాలలో బుర్క్, హేర్ అనే ఇద్దరు పాతిపెట్టిన శవాలు తీసి అమ్మి జీవించేవారు. కొన్నాళ్లకు వాళ్ళు మనుషులను చంపి మరీ అమ్మటం మొదలుపెట్టారు. మనుషులను చంపేందుకు వారు అవలంబించిన పద్ధతే 'బుర్క్ పద్ధతి'. మనిషి ఊపిరి పీల్చినప్పుడు ఛాతీ వ్యాకోచిస్తుంది. వదలినప్పుడు సంకోచిస్తుంది. సంకోచవ్యాకోచాలు ఊపిరి పీల్చుకోవటాన్ని సులభతరం చేస్తాయి. ఈ బుర్క్‌పద్ధతిలో వాళ్ళు చంపాలనుకున్న మనిషి గుండెలపై కూర్చుంటారు. ఆ బరువువల్ల ఊపిరి పీల్చుకునే అవకాశంలేక ఆ మనిషి మరణిస్తాడు. ఈ పద్ధతిని నిర్ధారించడానికి ఎలాంటి ఆధారాలుండవు. ఊపిరి అందక సహజమరణం సంభవించినట్టుంటుంది'.

'ఈ అనుమానం నీకెలా వచ్చింది?' అడిగాడు విజయ్.

'ఛాతీపైన కూర్చున్నప్పుడు ఏర్పడిన ఒత్తిడి గుర్తులివి. బహుశా అదే సమయానికి మెడపైన ఒత్తిడి పెంచటంతో అటూ ఇటూ కొట్టుకోవటంవల్ల ఏర్పడిన సన్నని గాయాలవి'.

'అంటే ఇద్దరు హత్య చేశారా?'

'అలాగే ఉంది. లేకపోతే, ఒకేసారి ఛాతీపై బలమంతా ఉపయోగించి కూర్చుని మెడచుట్టూ పట్టు బిగించి చంపటం కష్టం. పోస్ట్‌మార్టమ్ వివరాల్లోస్తేగానీ ఏమీ తేల్చలేం' చెప్పాడు శరత్.

***

'బాస్, వాళ్ళ పెళ్ళయి మూడేళ్ళయింది. సంతానం లేదు. వాళ్ళిద్దరూ అన్యోన్యంగా ఉండేవారని చుట్టుపక్కలవాళ్ళు చెబుతున్నారు. భర్తను అనుమానించే వీలులేదు. ఇన్నాళ్ళూ ఎలాంటి కంప్లైంటూ ఇవ్వని అతని అత్తమామలు ఇప్పుడీమె హఠాన్మరణంతో అల్లుడుమీద ఆరోపణలు చేస్తున్నారు. అవి ఆవేశంలో చేస్తున్న ఆరోపణలేతప్ప నిజాలుకావు' రాము గబగబా చెప్పాడు. మళ్ళీ ఇలా అన్నాడు. 'అతడు బెంగళూరు సమావేశంలో పాల్గొని తెల్లారుజామున విమానం ఎక్కి దిగగానే అరెస్టయ్యాడు. అతడి ఫోను వివరాలు, బ్యాంకు బాలెన్సులు పరిశీలించాను. చివరిసారి రాత్రి తొమ్మిదిన్నరకు భార్యకు ఫోన్ చేశాడు. ఆ తరువాత అతడు ఫోను వాడలేదు'.

'అమ్మాయి వివరాలు సేకరించావా?'

'యెస్ బాస్. అమ్మాయి పుట్టిపెరిగింది, చదివింది అంతా హైదరాబాద్‌లోనే. మంచి ఏక్టివ్. కాలేజీ రోజుల్లో పలురకాల లిబరల్ మూవ్‌మెంట్స్‌లో పాల్గొంది' కళ్ళెగరేశాడు శరత్ ప్రశ్నార్థకంగా.

'అవే బాస్ మహిళ స్వేచ్ఛ, మహిళ హక్కులు, మానవహక్కులు వంటివి. స్వలింగ సంపర్కాన్ని సమర్థిస్తూ, ఎల్‌జిబిటి (LGBT) (Lesbian, Gay, bisexual, transgender) ప్రదర్శనలలో కూడా పాల్గొంది. పెళ్ళయ్యాక అవన్నీ వదిలేసింది. బహుశా ఆమె భర్త భార్గవ్ సంప్రదాయ సమర్థకుడు కావటం వల్ల కావచ్చు' శరత్ కాస్సేపు ఆలోచించాక అడిగాడు, 'ఆమెకు కాలేజీలోగానీ తరువాతగానీ స్వలింగ సంపర్కం అలవాటుందేమో పరిశోధించు. ఆమె స్నేహితులను ప్రశ్నించు'.

'బాస్... ఇలాంటివి ఎవరైనా బైటికి చెబుతారా?'

'ఈ మధ్య ఇలాంటివాటిని ఓపెన్‌గా చెప్పడం ఆధునికం, అభ్యుదయం, గొప్పతనంగా భావిస్తున్నారు. నువ్వు ప్రశ్నించు. ఎవరు నిజం చెప్పటం లేదనిపిస్తోందో వారి వివరాలు నాకు ఇవ్వు. భార్గవ్ నేపథ్యం కూడా పరిశోధించు. ఒకోసారి అత్యంత ఛాందసవాదిగా కనిపించేవాడు అంతర్గతంగా అత్యంత లిబరల్‌గా ఉంటాడు. తన స్వేచ్ఛా ప్రవృత్తిని కప్పి పుచ్చటానికి సంప్రదాయం ముసుగు వేసుకుంటాడు' అన్నాడు శరత్.

'యెస్ బాస్' అంటూ లేచాడు రాము.

***

'బాస్... ఇదిగో, ఈ నలుగురు సుమతి సన్నిహితులు. సుమతి పెళ్ళయ్యేవరకు వీళ్ళదో జట్టు. నేను అడిగిన ప్రశ్నలకు వీళ్ళు సరిగ్గా సమాధానం చెప్పటం లేదు' అంటూ శరత్‌కి ఓ జాబితా అందించాడు రాము.

వెంటనే ఎవరికో ఫోను కలిపాడు శరత్.

అవతలి వ్యక్తి ఫోనెత్తగానే 'శంకర్‌గారూ నేను

**సుమతి అనుమానాస్పద స్థితిలో ఇంట్లో మరణించింది. అల్లుడే తన కూతుర్ని హత్యచేశాడంటూ ఆమె తండ్రి డిటెక్టివ్ శరత్‌కు ఫిర్యాదు చేశాడు. పోలీసులు దీనిని ఆత్మహత్యగా చిత్రించకముందే మీరు రంగంలోకి దిగి నిజం నిగ్గుతేల్చాలని అభ్యర్థించాడు. అప్పటికే పోలీసులు సుమతి భర్తను అరెస్టు చేశారు. మరి ఇంతకీ భర్తే ఆమెను హత్య చేశాడా? శరత్ చివరకు ఏం తేల్చాడు?**

డిటెక్టివ్ శరత్.. మీతో మాట్లాడాలి' అన్నాడు.

'అయామ్ బిజీ... నేను కాల్ చేస్తాను' కట్ అయింది ఫోను.

ప్రశ్నార్థకంగా శరత్‌వైపు చూశాడు రాము.

'శంకర్, భార్గవ్ మంచిఫ్రెండ్స్' ఆల్బమ్‌లో, ఫొటోలు చూపిస్తూ చెప్పాడు శరత్. 'చూడు డిగ్రీ నుంచి సుమతి పెళ్ళివరకు ప్రతి ఫొటోలో ఉన్నారు ఇద్దరూ. ఆ తరువాత ఎక్కడా శంకర్ కనబ డటం లేదు. శంకర్ పెళ్ళి ఫొటోలో భార్గవ్ ఉన్నాడు. తరువాత శంకర్ దంపతులతో కూడా భార్గవ్ ఉన్నాడు. కానీ భార్గవ్ పెళ్ళి తరువాత శంకర్ ఫొటో కనబడటం లేదు. ఫోన్ కాల్ రికార్డు చూడు. శంకర్ నుంచి భార్గవ్‌కి ఫోన్లు వస్తున్నాయిగానీ భార్గవ్ శంకర్‌కి ఫోను చేయటం లేదు.

'అయితే?' అడిగాడు రాము.

'నాకేదో అనుమానం కలుగుతోంది. దాన్ని నివృత్తి చేసుకోవాలి' అంటూ, హఠాత్తుగా రాము వైపు తిరిగి 'రాము శంకర్ భార్య గురించి కూడా పరిశోధించు' అన్నాడు.

'యెస్ బాస్' అన్నాడు రాము.

***

'బాస్, శంకర్ భార్య సుందరి మంచి కార్యకర్త. మానవ హక్కుల పోరాటం చేసే స్వచ్ఛంద సంస్థలో పనిచేస్తోంది. ఫైర్ బ్రాండ్ బాస్. 'గే' హక్కులకోసం ఆమధ్య కోర్టుతీర్పును వ్యతిరేకిస్తూ చేసిన ఉద్య మంలో శంకర్ పాల్గొన్నాడు. అక్కడే అతడికీ సుందరికీ పరిచయం. ఇద్దరూ బైసెక్సువల్ అను కుంటా. పెళ్ళి చేసుకున్నారుగానీ ఇద్దరూ తమతమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు'.

ప్రశ్నార్థకంగా చూశాడు శరత్.

'నా అసిస్టెంట్లు ఇరవైనాలుగు గంటలు వాళ్ళి ద్దరినీ వెంబడించారు. ప్రతి వీకెండ్ వీళ్ళు రిసా ర్టుల్లో పార్టీలు చేసుకుంటారు. స్వింగ్‌పార్టీలు జరుగు తాయి. దాన్లో విచ్చలవిడిగా ఉంటారు'.

లేచాడు శరత్. 'వీళ్ళిద్దరినీ కలవాలి' అన్నాడు. రామువైపు తిరిగి 'ఓ పని చెయ్యి' అన్నాడు.

***

'మా ఇంట్లో పార్టీ జరుగుతోంది. మరో టైమ్‌లో రండి' తలుపు వేయబోయాడు శంకర్.

తలుపుకి కాలు అడ్డంపెట్టాడు శరత్. ఇంట్లోంచి పెద్దగా విదేశీ నృత్యగీతాల సంగీతం వినిపిస్తోంది.

'ఇప్పుడు మీతో మాట్లాడలేను. సారీ' అన్నాడు శంకర్.

అతన్ని తోసుకుని లోపలికి వచ్చాడు శరత్. విజయ్ అనుసరించాడు.

'ఇప్పుడు నాతో మాట్లాడతారా? లేకపోతే అరెస్టు చేసి తీసుకెళ్ళమంటారా?' అడిగాడు శరత్.

'వాటీజ్ దిస్? ఎందుకు అరెస్టు చేస్తారు?' కోపంగా అడిగాడు.

'సమాధానం ఇవ్వకుండా తప్పించుకుని పరిశో ధనకు అడ్డు పడుతున్నందుకు' సీరియస్‌గా అన్నాడు శరత్.

ఒక్కసారి శరత్‌ని పరిశీలనగా చూసి కుర్చీలో కూర్చున్నాడు శంకర్.

'ఓ.కె. మేకిట్ క్విక్'

'సుమతి హత్య జరిగినప్పుడు మీరు ఎక్కడ ఉన్నారు?'

'ఆరోజు రాత్రి తొమ్మిదిన్నర వరకూ ఆఫీసులో ఉన్నాను. తరువాత నేను, నా భార్య మా ఫ్రెండ్ ఇంట్లో వీకెండ్ పార్టీకి వెళ్ళాం.'

'మీ ఆఫీసు నుంచి పార్టీ స్థలానికి అరగంట కన్నా ఎక్కువ పట్టదు, కానీ పార్టీకి మీరు పద కొండు గంటలకు వచ్చారు'.

'ఇంటికి వెళ్ళి నా భార్యను పికప్ చేసుకు న్నాను. ఆమె రెడీ అవ్వటానికి గంట పట్టింది. యూనో లేడీస్..' అనబోతున్న శంకర్ మాటలకు అడ్డుపడ్డాడు శరత్.

కొన్ని ఫొటోలు టేబుల్‌మీద పెట్టాడు. 'ఇవి పార్టీ ఫొటోలు. మీ ఆవిడ పెద్దగా మేకప్ వేసు కున్నట్టు లేదు. పైగా, మీరు ఆఫీసునుంచి తిన్నగా పార్టీకి వచ్చారని, అప్పటికే మీ భార్య అక్కడ ఉందని, ఆమెని తీసుకుని మీరు ఎక్కడికో వెళ్ళొ చ్చారని పార్టీలో పాల్గొన్నవారు చెప్పారు. ఎక్కడికి వెళ్ళారు? సుమతి ఇంటికా?'

'ఏమిటిది? నన్ను అనుమానిస్తున్నారా?' అరి చాడు శంకర్.

'ఏమవుతోంది డార్లింగ్' అంటూ మద్యం గ్లాసు పట్టుకున్న అమ్మాయి వచ్చింది. వీళ్ళనిచూసి ఆగిపోయింది. అప్పటికే ఆమె బాగా మత్తులో ఉంది.

'నువ్వు లోపలకు వెళ్ళు' అరిచాడు శంకర్.

'మీరేనా సుందరి?' అడిగాడు శరత్.

'సో వాట్?' అందామె మత్తుగా.

'మీరు సుమతిని ఎందుకు చంపారు?' అడి గాడు శంకర్.

'సుమతి.. దట్ బిచ్.. షి డిజర్వ్డ్ ఇట్. పెళ్ళికి ముందు ఎంజాయ్ చేసింది. పెళ్ళవగానే పతివ్రత ఫోజులు.. వాడు భార్గవ్... పెళ్ళికి ముందు, పెళ్ళి తరువాత కూడా నలుగురం ఎంజాయ్ చేద్దాం అంటూ నాతో శంకర్‌తో ఫుల్ ఎంజాయ్ చేశాడు. పెళ్ళయ్యాక ముఖం చాటేశాడు. భార్యతో కలిసి స్వింగ్‌పార్టీకి రమ్మంటే 'పవిత్రత, అదీ ఇదీ అని డైలాగులు కొట్టాడు. మరి నాతో ఎంజాయ్ చేసి నప్పుడు ఫ్రెండు భార్య పవిత్రమైనది కాదా? ఐ హేట్ దిస్ హిపోక్రసీ'

'షటప్ సుందరీ'

శంకర్ అరుస్తున్నా పట్టించుకోలేదు సుందరి.

'భార్గవ్ ఊళ్ళోలేడు పార్టీకి రమ్మంటే పతివ్రత డైలాగులు కొట్టింది. అంతకుముందు అది లెస్బి యన్. ఇప్పుడు నేను తాకితే అసహ్యం అంది. శంకర్ ముట్టుకుంటే విసిరికొట్టింది. అంతకు ముందు దాని చరిత్రంతా నాకు తెలుసు'.

'షటప్ సుందరీ' అంటూ ఆమె చెంపమీద కొట్టాడు శంకర్.

'యూ డర్టీ గూస్... నీ ఫ్రెండ్‌కి నన్ను అప్పగిం చిందే కాకుండా నన్ను కొడతావా?' అంటూ చేతి లోని గ్లాసు అతడిమీదకి విసిరింది.

ఇద్దరినీ అరెస్టు చేయటానికి విజయ్ ముందుకు దూకాడు.

**—కస్తూరి మురళీకృష్ణ**

*సెల్: 98496 17392*

# వేసే ప్రతి అడుగు...

-కె.కె.రఘునందన

**"నీకు తెలుసా!... రామచంద్రం పోయాట్ట" అని సీట్లో కూర్చుంటూ చెప్పాడు సుధాకరం.**

**"ఎప్పుడు?" అన్నాను విస్తుబోతూ.**

**"నిన్న గుండెపోటుతో పోయాడని విశాఖనుంచి బ్రాంచి మేనేజరు వసుధారావు ఫోను చేశాడు.. పాపం ఇంకా ఏడాది సర్వీసు ఉంది" అని నిట్టూర్చాడు సుధాకరం.**

రామచంద్రం పోయిన వార్త మా ఆఫీసంతా పాకింది. నేను కొద్దిగా చలించినమాట నిజమే! మా ఇన్స్యూరెన్స్ కంపెనీలో చాలాకాలం పనిచేశాడు. తర్వాత తన సొంతూరు విశాఖ దగ్గర పల్లెటూరికి మకాం మార్చాడు. అక్కడ పిల్లల చదువుల నిమిత్తం స్థిరపడ్డాడు.

రామచంద్రం గురించి పట్టించుకున్న వాళ్ళె వరూ నాకు కనిపించలేదు. ఆపాటి ఈపాటి వివరాలు తెలిసింది నాకే! అతడిగురించి సంతాపం వెలిబుచ్చు దామని ఒత్తిడి తెచ్చింది నేనూ, సుధాకరమే.

"ఎందుకు సంతాపం ప్రకటించాలి, ఏం ఊడ బొడిచాడని? ఎవరికి ఉపయోగపడ్డాడుగనుక, ప్రతీ పైసాకి, పరక్కి కక్కుర్తిపడేవాడు. లెక్కాడొక్కా అడిగే వాడు. అటువంటివాడికి సభలు, సమావేశాలు శుద్ధ దండుగ" అని తెగేసి చెప్పాడు సూపర్నెంటు సుధీర మూర్తి.

నిజానికి అతగాడి మాటల్లో నిజం లేకపోలేదు. రామచంద్రానికీ, డబ్బుకీ లంకె. ఆఫీసులో కూడా తన పిసినారితనం పోగొట్టుకునేవాడు కాదు. క్యారేజీలో కూడా ప్రత్యేక పదార్థాలు తెచ్చేవాడు కాదు. ఒక వేళ ఏమైనా తెచ్చుకున్నా ఒక్కడూ వేరేగా కూర్చుని బుక్కేవాడు. ఎవరైనా చనువుకొద్దీ "మీ ఐటమ్ మాకు రుచి చూపిస్తారా?" అని అడిగి తీసుకోబోతే "నా పదార్థాలు ముట్టుకోవద్దు" అని నిర్మొహమాటంగా చెప్పేసేవాడు.

ఓ రోజున వాళ్ళమ్మాయి పెద్ద మనిషయిందని తెలిసి పార్టీ అడిగారు స్టాఫ్.

"మా ఇంట్లో వాళ్ళతో సింపుల్‌గా చేసుకుంటు న్నాను. మీకెందుకు ఇవ్వాలి" అని ఎదురు తిరిగి జవాబిచ్చాడు.

అయితే ఇవేవీ లెక్కలోకి తీసుకోకుండా ఏ పార్టీ జరిగినా సరే అతన్ని ఆహ్వానించటం మాన లేదు. ఏవైనా కలెక్షన్లు, దసరా మామూళ్ళు వంటివి అందరం డబ్బులు ఎత్తుకుంటే తను మాత్రం పైసా తీసేవాడు కాదు. మామూళ్ళివ్వాల్సిన అవసరం లేదంటూ ఖండించేవాడు. కార్తీకమాసంలో వనభోజ నాలప్పుడు కూడా విరాళమిచ్చేవాడు కాదు. పోనీ అతగాణ్ణి వదిలి వెళ్ళటమెందుకని మాతో తీసుకెళ్ళే వాళ్ళం. రోజూ ఆఫీసుకు ఇంటినుండి నడుచుకుని వచ్చి చెమటలు కక్కేవాడు. మళ్ళా ఇట్నుంచీ అంతే! ఏమని అడిగితే ఆరోగ్యానికి మంచిదంటూ కప్పి పుచ్చుకునేవాడు.

అటువంటి విచిత్రప్రవర్తనగల రామచంద్రానికి నివాళులర్పించకపోవటంలో పెద్దగా ఆశ్చర్యపడ నక్కర్లేదని స్టాఫ్ ఉద్దేశం. అలాంటి మనిషని తెలిసినా, వెళ్ళి చూస్తే తప్పుకాదనిపించింది. ఓరోజు ఉదయాన్నే విశాఖ బయలుదేరాను.

ఆ పల్లెటూర్లో రామచంద్రం ఇల్లు కనుక్కోవటం పెద్దకష్టం కాలేదు. ఊరిచివర పాడుబడిన పెంకు టిల్లే అతగాడిది. వీధివైపు పెంకులు కొన్ని జారి పోతూ కనిపించాయి. గోడకున్న సున్నం పెచ్చులు ఊడుతోంది.

నేను వెళ్ళేసరికి రామచంద్రం బావమరిది నాగ రాజు ఎదురయ్యాడు.

"మీరు నిరుపమరావే కదూ! ఓసారి బావకోసం వచ్చినప్పుడు మీతో పరిచయం. బాగున్నారా? లోప లికి రండి" అని తనతో తీసుకువెళ్ళాడు.

"ఔను, మీ బావగారు పోయినట్టు తెలిసింది" అన్నాను విచారం వ్యక్తం చేస్తూ.

"అవును. మొన్నే! పోతారని అనుకోలేదు. కానీ, ఆ దేవుడు పిలుపునిచ్చాడు. ఎవరు కాదనగలరు. మేం దశాహం ఘనంగా జరుపుదామనుకుంటున్నాం. ఊర్లోవాళ్ళకి అన్న సంతర్పణ ఉంటుంది. ఎవరైనా ఎంత సంపాదించినా వెంట పట్టుకుపోలేరు కదా! బ్రతికినంతకాలం పిసినిగొట్టుగా బతికి జనం దృష్టిలో చెడ్డవటంతప్ప మరేంకాదు" ఆ వాక్యాలు వాళ్ళ బావ గురించేనని నేను పోల్చ కపోలేదు. దశాహంనాడు ఏమేం చేయబో తున్నదీ చెప్పుకొచ్చాడు. భారీ ఖర్చుతో కూడినపని. ఆ రోజు ఎన్ని పనులున్నా సరే తప్పనిసరిగా హాజరవ్వాలన్నాడు.

లోపలికివెళ్ళి కొడుకులిద్దర్నీ, కూతు రినీ, ఆవిడనీ పలకరించాను. వాళ్ళ ముఖాల్లో దీనత్వం ఉన్నా కడవలకొద్దీ కన్నీరు మాత్రం ఒలకడం లేదు. బహుశా ఏడ్చిఏడ్చి అలా అయ్యారేమో అనుకు న్నాను.

"గులాబీని తెంపాలనిచూసిన ప్రతి సారీ ముళ్ళు గీరుకుంటుంటే ఆ ప్రయత్నం ఎవరూ చేయరేమో! చివరికది ఎవరికీ ఉపయోగపడక వాడి రాలిపోతుంది. బంగారుపాత్రలో పాలు తాగే శక్తి ఉన్నా యోగం లేకుంటే మాత్రం మట్టి పిడత లోనే తాగాల్సి వస్తుంది." ప్రతిదానికీ అతని వ్యాఖ్యానాలు విచారగ్రస్థం నుండి విడివడి వేదాంత ధోరణివైపు మరలటం గమనించాను.

ఏమయితేనేం... నేనొచ్చిన పని పూర్తయ్యింది. ఇక వెళతానని లేచాను.

"రామచంద్రం పోవటంతో వాళ్ళింట్లో ఎటు వంటి నిరుత్సాహం, వేదన ఛాయలు లేకపోవటం మీరు గ్రహించారు. నిజానికి అది తప్పే! అతను ఇంటి యజమాని. అతనున్నంత కాలం ఎలా ప్రవ ర్తించినాసరే, పోయాకయినా సానుభూతి చూపక పోవటం ధర్మం కాదు" అన్నది శ్రీమతి భవాని.

"కానీ, రామచంద్రం ఉత్తి పిసినిగొట్టు... భోజనం కూడా సరిగా చేయనిచ్చేవాడు కాదు" అన్నాను తెలిసిన ఉదాహరణలు ఇస్తూ...

"దాన్ని పొదుపు అనుకోవచ్చు కదా!" అంది.

"నువ్వు నేను అనుకోవటం ప్రధానం కాదు. సమాజం మన చుట్టూ ఉందని గ్రహించాలి. పొదుపు చేసినాసరే కుటుంబ సభ్యులకు ఆహ్లాదం కలిగించే పనులు కొన్నైనా చేయాలికదా!" అన్నాను భోజనం దగ్గర కూర్చుంటూ.

అలా మా ఇరువురి నడుమ కొన్ని భిన్నాభి ప్రాయాలు నెలకొన్నాయి.



మర్నాడు ఆఫీసులోకి వెళ్ళగానే కిరీటి అనే గుమస్తా అన్నాడు. "దశాహానికి మీరు వెళ్తున్నారన్న మాట. క్యారేజీలో తిండి కూడా మనకి రుచి చూపించని అతగాడి ఎంగిలి మెతుకులకి పోవటం నాకు నచ్చలేదు".

వాళ్ళ బావమరిది ఒత్తిడిచేసి పిలిచినందువల్ల వెళుతున్నామని చెప్పాను. ఆఫీసులో కౌండిన్య ఒక్కడే నాతో వస్తానన్నాడు.

మేం ఆ ఊరు చేరేసరికి మిట్టమధ్యాహ్నం అయింది. వాళ్ళింటి ముందర షామియానాలు, కుర్చీలు వేశారు. భోజనాలకి బల్లలు సర్దుతున్నారు. మేం సహాయానికి పూనుకోబోతే అంతా క్యాటరింగ్ వాళ్ళే చూసుకుంటున్నారని చెప్పారు. ఊళ్ళో వాళ్ళు గుంపులు గుంపులుగా భోజనాలకు వచ్చి పోతున్నారు.

"ఇదంతా పైనుండి చూస్తున్న రామచంద్రానికి గుండె బద్దలైపోదూ! ఇంతడబ్బు నీళ్ళ ప్రాయంలా ఖర్చుపెడుతుంటే" అన్నాడు కౌండిన్య.

"వీళ్ళలో చదివింపుల సంప్రదాయం ఎలాగూ ఉందిగా! కనీసం సగమైనా వస్తుందిలే! బతికినప్పుడు బాగా సంపాయించాడుగా. ఈ ఖర్చు పెద్ద లెక్కలోకి రాదు. ఈ విధంగా అయినా తండ్రిమీద ఉన్న అపప్రథ చెరిపే ప్రయత్నం చేయడం మంచిదే!" అన్నాను.

రామచంద్రం బావమరిది నాగరాజు మమ్మల్ని భోజనాలకి కూర్చోబెట్టాడు. తరువాత వాళ్ళ ఇంట్లో వారి వివరాలు అడిగాం. కొడుకులిద్దరి చదువుల గురించి రామచంద్రం సమానశ్రద్ధ వహించలేదని, కూతురికి కూడా మంచి సంబంధం చూడకుండా పెళ్ళి చేశాడని, ఇప్పుడు ఆమె నానా బాధలు పడుతోందని చెప్పుకొచ్చాడు.

"మీరు రావటం మాకు గొప్పగా ఉంది. మా బావపై ఆ మాత్రం అభిమానం ఉన్న వాళ్ళింకా ఉన్నారంటే మాకు ఆనందంగా ఉంది. అయితే మీవల్ల మాకు చాలా సహాయం కావాలి" అని మావైపు చూశాడు.

"మా బావకి ఏడాది సర్వీసు ఉందింకా. మా అక్క ఎలాగూ చదువుకోలేదు. పెద్దవాడు పది పాస య్యాడు. చిన్నవాడిది మరీ చిన్న చదువులెండి. చదువులకోసం ఖర్చు పెట్టడమంటే తెగ గింజుకు పోయేవాడు మా బావ. ఆ ఫలితం ఇప్పుడు వాళ్ళ బ్రతుకులపై పడింది. ఆఫీసులో సాదా ఉద్యోగమైనా చాలు. బతుకుతారు. దయచేసి మీరు దానికి సంబంధించిన వివరాలు కనుక్కుని మాకు చెప్పండి చాలు. మీకు పుణ్యం ఉంటుంది. నేను కావలసిన వాటిని సేకరించుకుని వస్తాను. మీ శ్రమ ఉంచుకోం" అని అర్థింపుగా చూశాడు.

రామచంద్రం ఎటువంటి మూర్ఖుడవనీగాక! అతని కుటుంబాన్ని ఏవగించుకొనే మూర్ఖులం మేంకాకూడదని భావించాం. వారికి కావలసిన సహకారం అందజేస్తే మానవత్వం అనిపించుకుంటుంది.

తదాదిగా విషయసేకరణలో నిమగ్నమయ్యాం. కారుణ్య నియామకాల ప్రభుత్వ జి.ఓ. ప్రకారం వారి కుటుంబంలో ఎవరో ఒకరికి ఉద్యోగం ఖాయం. అందుకు సంబంధించిన పత్రాలన్నీ సిద్ధం చేసి నాగరాజుకి ఫోన్‌చేసి పిలిచాం. డెత్ సర్టిఫికేట్, లీగల్ హేర్ సర్టిఫికెట్ కూడా సంపాదించుకోవాలని చెప్పాం. అదే సమయంలో ఉన్నవిషయం



చెప్పడంలో తప్పులేదనిపించింది.

"నాగరాజుగారూ! మీ బావగారి విషయంలో అందరూ వ్యతిరేకించినాసరే మేం ఇందులో కల్పించుకుని ప్రవర్తిస్తున్నాం. కానీ, ఈ రోజుల్లో మంచిగా పోతే పనులవ్వవు. అడ్డదారయినా అది దొడ్డిదారే! మామూలుగా ఉద్యోగాలు దొరకటమే కష్టంగా ఉన్న పరిస్థితి. మా పై ఆఫీసులో కొన్నిగ్రహాలు, ఉపగ్రహాలు ఉన్నాయి. వాటికి కొంత మేత పడేస్తే తప్ప మనపని సవ్యంగా సాగదు. నిజానికి మేం లంచాలు ప్రోత్సహించం. కానీ ఇది ఈరోజుల్లో ఆనవాయితీ అయిపోయింది" అని ఆగి అతని ముఖంలోకి చూసి అంకె చెప్పాం.

"రెండు లక్షలా!" ఒక్కసారిగా తీవ్ర దిగ్భ్రాంతి.

"అసలు లంచం లేకుండా చేసుకోవచ్చు. కాని, మీరుపెట్టే కాగితాలపై ఎప్పటికప్పుడు ఏవో కొర్రీలు వేసి తిరగ్గొడుతుంటారు. కాళ్లు పీక్కుపోతాయితప్ప పని అవదు. రామచంద్రంవంటివారి చావువల్ల ఆ కుటుంబానికి అప్పనంగా ఆస్తులేవో దొరుకుతున్నాయని వారి ఏడుపు" కౌండిన్య వివరంగా చెప్పుకొచ్చాడు.

"గ్యారంటీగా అవుతుందనంటే ఇవ్వటానికి అభ్యంతరం లేదు. ఇంకా మా బావకి రావలసిన అన్ని మొత్తాలు కూడా ఒకేసారి వస్తే కలిసి వస్తుంది" అని సూచించాడు నాగరాజు.

అడ్వాన్సుగా లక్షదాకా ఇవ్వాలని చెప్పాం. నిజానికి అవినీతిని ప్రోత్సహించటం మాకు సుతరామూ ఇష్టంలేదు. అడ్డంకులు లేకుండా పని పూర్తి కావాలంటే అడ్డదారులు తప్పవు. ఈ సమయంలో వాళ్ళ కుటుంబానికి ఎంత త్వరితగతిన మేలయితే అంత మంచిది. అక్కడికి మరో రెండురోజుల్లో రామచంద్రం పెద్దబ్బాయి మౌళిని పిలిపించాం. సంతకాలు చేయించాం. ఓసారి వాళ్ళ ఇంటికివెళ్ళి ఆవిడ చేత కాగితాలమీద సంతకాలు పెట్టించాం. వాళ్ళు అట్టే తిరగకుండా నేను, సుధాకరం, కౌండిన్య పనులు చేసేందుకు నడుం బిగించాం.

ఇదంతా మా ఆఫీసులో కొందరు గిట్టనివర్గం మమ్మల్ని పరిశీలిస్తూ "రామచంద్రానికి ఏనాడూ ఎవరితో పొత్తులేదు. అలాగే ఒంటిపిల్లిలా బ్రతికాడు. వాడి విషయంలో మీకెందుకు దురద?" అన్నారు ఎద్దేవా చేస్తూ.

అయినా పట్టించుకోలేదు. స్థిరత్వంగా చకచక పనులు చేసుకుంటూపోతున్నాం. ఆ కుటుంబానికి సాయపడుతున్నామన్న తృప్తి మాకుంది. అది చాలు.

"మీరీ పని చేయించటంలో పెద్దాఫీసరుతో మీకెంత వాటా గురూ?" అని కొంటె కోణంగి శ్రీశైలం వ్యంగ్యంగా అడిగాడు.

చాచిపెట్టి లెంపకాయ లాగాలనిపించింది. ఏదో

**రామచంద్రం పోయాడని తెలిసిన వెంటనే అతడి ఆఫీసులో ఎవరూ పెద్దగా స్పందించలేదు. ఎందుకంటే జీవితాంతం పిసినారిలా, ఎవరితోనూ కలవకుండా బతికాడతను. అతనికి సంతాపం చెప్పేవాళ్ళు కూడా కరువయ్యారు. కానీ అతని ఆఫీసులో ఓ ముగ్గురు మాత్రం మానవతాదృక్పథంతో ప్రవర్తించారు. అసలింతకీ రామచంద్రం ఎలాంటివాడు? లోకాభిప్రాయంలో నిజం ఎంతుంది?**

మాకు మనసుపుట్టి ఇందులో దూరామేతప్ప కించిత్ స్వార్థంలేదు మాకు. అదేచెప్పి గడ్డిపెట్టాం. ఎవరేమనుకున్నాగానీ, రామచంద్రం కుటుంబానికి అదృష్టం పట్టిందనే చెప్పాలి. రావాల్సిన పి.ఎఫ్. గ్రాట్యుటీ భారీగానే ముట్టాయి. జీవితబీమా బాండ్లద్వారా మరింత డబ్బు చేకూరింది. ఆవిడకు పింఛను ఖరారయింది.

మౌళికి ఉద్యోగం కూడా ఇచ్చారు. విశాఖ ప్రాంతీయ కార్యాలయంలో వేశారని సుధాకరం చెప్పాడు.

ఇంక వాళ్ళకి ఏ లోటులేదు అన్న సంతృప్తి మా హృదయంలో నిలిచిపోయింది. ఆఫీసులో మేం ఒక్కరమే నిలబడి వారి కుటుంబానికి సహకారం చేయటం అందరికీ ఓ చేదు గుళిక మింగినట్టుగా అనిపించింది. వారి వైఖరి అలా కనిపించింది మరి.

"రామచంద్రంగారి పెద్దబ్బాయి మౌళి కనిపించాడు. విశాఖ వస్తే తప్పక రమ్మన్నాడు" అని మధ్యాహ్నం లంచ్‌టైంలో కబుర్ల మధ్య చెప్పాడు సుధాకరం.

ఎందుకో అప్పటికప్పుడే మేం ఓ నిర్ణయానికి వచ్చాం, ఓసారి వెళ్ళి రామచంద్రం కుటుంబాన్ని పలకరించాలని. ఆ వచ్చే ఆదివారం ఉదయమే బయలుదేరాం నేను, సుధాకరం, కౌండిన్య.

ఇదివరకటికీ ఇప్పటికీ ఏ మాత్రం పోలికలేని వాతావరణం. పాడుబడిన పెంకుటింటిస్థానే కళకళలాడే కొత్తభవంతి. విశాలమైన ఆవరణ. చుట్టూతా ప్రహరీ. లోపల అందమైన పూల మొక్కలు. పైన శిల్పాకృతిలో నీళ్ళ కుండీ.

మేం అన్నీ పరిశీలించుకుంటూ లోపలికి వెళుతుంటే మాకు ఎదురువచ్చి ఇంట్లోకి తీసుకెళ్ళింది రామచంద్రం భార్య రమ.

"మీరు ముందుగా మమ్మల్ని క్షమించాలి, మీకు ఇంతదాకా ఫోన్ చేయనందుకు. ఈ మధ్యన ఇల్లు కట్టే హడావుడిలో పడ్డాం. నిజంగా మీరుచేసిన మేలు ఈ జన్మలో మరువలేం. మీరు ఎప్పుడు భోజనం చేశారో... రండి వడ్డిస్తాను" అని తనతో లోపలికి తీసుకెళ్ళింది.

మేం వద్దన్నా వినలేదు. మరి తప్పదని చేతులు, కాళ్లు కడుక్కుని వచ్చి కూర్చున్నాం.

ఆమె వడ్డించిన పదార్థాలు చాలా రుచికరంగా ఉన్నాయి. కొసరి కొసరి వడ్డించింది.

భోజనం పూర్తయ్యేసరికి నాగరాజు వచ్చాడు. మా రాకకు నివ్వెరపోయాడు.

"మీరు పెట్టిన భిక్ష ఇది. మామూలుగా అయితే మౌళికి ఉద్యోగం ఈ జన్మలోరాదు. నేను పల్సర్ బండి కొనుక్కున్నానంటే అది మీ చలవే. మౌళి తర్వాతవాడు భూషణం చేత కొట్టు పెట్టించామన్నా, అక్క కూతురు సుధను అల్లుడి దగ్గరకు పంపే ఏర్పాటుచేశామన్నా మీ ద్వారా మేం పొందిన డబ్బే కారణం" అని ఎంతో ప్రసన్నంగా చెప్పాడు నాగరాజు.

ఇల్లంతా చూస్తుంటే ఎక్కడా విచారానికి స్థానం లేదనిపించింది. ఓ మూలన ఫ్రిజ్, మరో వైపు ఎల్.సి.డి. టీవీ, వాషింగ్ మెషిన్, గోడలకి ఖరీదయిన వర్ణచిత్రాలు... పాలరాతి గచ్చు.. అయితే ఎక్కడా రామచంద్రం ఫొటో జాడలేదు.

అదే సమయంలో ఇల్లంతా కలియతిప్పి ఏయే సౌకర్యాలతో కట్టుకున్నదీ చూపించాడు నాగరాజు. ఒకప్పుడు పాత పెంకుటింటిలో నానా ఇబ్బందులు పడ్డామని చెప్పాడు. పెద్దబ్బాయి మౌళివచ్చి నమస్కరించాడు. మంచి దుస్తులు వేసుకుని కళగా ఉన్నాడు. అత్తరు వాసన గుమ్మెత్తిస్తోంది. అక్కడకి మరోక్షణంలో భూషణం కూడా హాజరయ్యాడు. అప్పటికంటే కొద్దిగా లావయ్యాడు.

"మీరొచ్చారని నేనే పిలిపించాను. ఇప్పుడంతా బాగున్నామనే చెప్పాలి. ఆ దేముడు దయతలిచాడు. మా కుటుంబం ఇలా హాయిగా ఉన్నదంటే దానికి మీరు చేసిన కృషే కారణం" అని మరోసారి కృతజ్ఞతలు తెలిపింది ఆవిడ.

భూషణం మాకు దగ్గరగా వచ్చి నమస్కరించాడు. అతని గురించి వివరాలు అడిగాం. కిరాణా దుకాణంవల్ల తను బాగానే ఆర్జిస్తున్నానని ఆనందంగా చెప్పుకొచ్చాడు. మొత్తం మీద అందరూ సంతోషం నింపుకునే కనిపించారు. గుండెమూలల్లో ఎక్కడా విచారరేఖలు మచ్చుకైనా కానరాలేదు.

వాళ్ళ గురించిన భోగట్టా తెలుసుకుందామని



# అంజలిని చితక్కొట్టారట!

ఇప్పుడు కాదులెండి. చదువుకునే రోజుల్లో జరిగిన సంఘటన ఇది! ఇంతకీ అసలు సంగతేమిటంటే... సాధారణంగా అమ్మాయిలు కాలేజీకి వచ్చేసరికి పెద్దవాళ్ళమైపోయామన్న ఫీలింగ్ వచ్చేస్తుంది. అప్పటి దాకా అమ్మ మాటను జవదాటని అమ్మాయిలు కాలేజీలో చేరేసరికి ఇష్టానుసారంగా వ్యవహరిస్తుంటారు. పై విషయాలకు తానేమీ మినహాయింపు కాదు అంటోంది అంజలి. పదవ తరగతి వరకూ ఇంట్లో వాళ్ళు చెప్పినట్టు వినేదట! ఇంటర్‌లోకొచ్చేసరికి కళ్ళు నెత్తికెక్కాయని చెప్పుకొచ్చింది. ఇంట్లో వాళ్ళకి తెలీకుండా కాలేజీ ఎగ్గొట్టి మరీ సినిమాలు చూసేదట! అలా ఒకసారి చూసి ఇంటికి రాగానే ఇంట్లో విషయం తెలిసిపోయి చితక్కొట్టేశారు అని చెప్పింది. ఆ తరువాత అలాంటి పని మరెప్పుడూ చేయలేదంది. అసలు ఆరోజులు మళ్ళీ రావని బాధపడుతోంది.



వచ్చాం.

ఆ పని అయిపోయింది. ఇక వెళదామని లేచాం.

"ఈ రోజుండి రేపు వెళ్ళండి. సరదాగా గడుపుదాం" అని బలవంతం పెట్టారంతా.

మేమెవరం ఉండడానికి మొగ్గుచూపలేదు. వెంటనే బయలుదేరాం.

"ఛీ! ఇంత స్వార్థపరులనుకోలేదు. అసలు వీళ్ళకి కనీసం ఇంగితజ్ఞానమన్నది లేదే! రామచంద్రం పోయి ఎంతోకాలం కాలేదు. అంతఘోరంగా ప్రవర్తిస్తారా! అసలు వీళ్ళకి మానవత్వం ఉందా?" అని విరుచుకు పడ్డాడు సుధాకరం.

"తాము ప్రస్తుతం అనుభవిస్తున్న సుఖాలనే ఏకరువు పెడుతున్నారుతప్ప రామచంద్రం పోయినందుకు ఆ ప్రస్థావన తెచ్చారా? ఈ వైభోగం అంతా అతగాడు అర్థాంతరంగా కాలం చేయబట్టేకదా అని ఆలోచించారా? అప్పుడే ఎంత త్వరగా మరిచిపోయారు. ఇంతఘోరం ఎక్కడా చూడలేదు. ఇటువంటివాళ్ళని తెలిస్తే సహాయం చేయడానికి నేను ముందుకి రాకపోయి ఉండేవాణ్ణి. వాళ్ళ వైఖరి నన్ను ఎంతగానో కలచివేసింది" తీవ్రంగా స్పందించాడు కౌండిన్య.

"మీరన్నదాంట్లో వాస్తవం లేకపోలేదు. కానీ కాలంమార్పు మనుషుల్లో తప్పకుండా ఉంటుంది. ఇందులో ఎవరినీ తప్పుబట్టలేం" మామూలు ధోరణిలో అన్నాను.

"అందరూ సుఖాల మత్తులో తూగుతున్నారు. ఒకప్పటి గతం మరచి కృతఘ్నుల్లా మారారు. తమకు నీడనిచ్చిన చెట్టునే గుర్తించని మూర్ఖులు" అక్కసు వెలిబుచ్చాడు సుధాకరం.

"బాబూ! మీరంతా ఇలా రండి. ఇందాకట్నించి మీ సంభాషణను వింటున్నాను. మీ ప్రశ్నలకు జవాబులు నా దగ్గర ఉన్నాయి. మీరలా అనుకోవటం తప్పు అని నేను అననుగానీ, నేను చెప్పేది మీరు వింటానంటే చెబుతాను" అని అంటున్న ఆ ఆసామి ఎవరా అని అతనివైపు చిత్రంగా చూశాం.

"నేనెవరో పైవాణ్ణి కాదు. సాక్షాత్తూ రామచంద్రం మామగారు నిత్యానందాన్ని. అసలు వాడుపోయినందుకు వీళ్ళెందుకు విచారించాలి? బ్రతికినంత కాలం గొడ్డులా కష్టపడి తన అవసరాలను సైతం పక్కకినెట్టి పైసా పైసా కూడబెట్టి, ఇప్పుడు వీళ్ళపరం చేశాడు. మా అల్లుడు చేసిన తప్పు మరేం కాదు. ప్రతీపనికి తన హోదామరచి చేసుకునేవాడు. ఉదాహరణకి గ్యాస్‌బండ రిక్షాలో తెచ్చి, ముప్పై రూపాయలు ధారపోసేకంటే, ఇంట్లోఉన్న సైకిల్‌మీద తీసుకువస్తే తప్పేమిటనేవాడు. కుర్రాళ్ళని వెళ్ళమంటే తమకి నామోషీ అని కదిలేవారు కాదు. అప్పుడు తనే సైకిల్‌మీద తెచ్చుకునేవాడు. అది చూసిన వీళ్ళంతా ఇరుగు పొరుగులు పిసినారి అని ముద్ర వేస్తారంటూ అతన్ని దెప్పేవారు. పిల్లల్ని కార్పొరేట్ స్కూల్స్‌లో జాయిన్‌చేసి వేలకువేలు పోయటం అసలిష్టం ఉండేదికాదు. చదివేవాళ్ళు ఎక్కడైనా చదువుతారనేవాడు రామచంద్రం. ఆ మాటలు లెక్క చేయకపోవటంతో వీళ్ళు చదువులు చెట్టెక్కాయి. ఉన్న పెంకుటిల్లు పడగొట్టి మేడ కట్టమంటే, పిల్ల పెళ్ళి ఉందని భయపడ్డాడు. అది వీళ్ళు అర్థం చేసుకోలేదు. సరికదా ఏదో సందర్భంలో నిందిస్తూ ఉండే వారు. పోనీ పిల్ల పెళ్ళి చేయడానికి సిద్ధపడ్డవేళ అది వేరొకణ్ణి ప్రేమించానంటూ ఎదురుతిరిగింది. అదిచూసి గుట్టుచప్పుడు కాకుండా మరో సంబంధం ఖాయం చేసుకొచ్చి ముడేయిస్తే, తనకు ఇష్టంలేని సంబంధం చేశారంటూ అందరికీ చాటిచెప్పి తండ్రి పరువు తీయడానికి సిద్ధపడింది. ఇన్ని వైరుధ్యాల మధ్య, బ్రతికిన రామచంద్రం పిల్లలు స్థిరపడతారో లేదోననే బెంగతో, ముందుచూపు కొద్దీ ప్రతిపైసా కూడా జాగ్రత్తగా ఖర్చుచేసి ఇంత ఆస్తి కూడబెట్టాడు. భార్య బంగారు నగలంటూ, వేధించినా మొగ్గుచూపక, అన్నీ తన తదనంతరం చెందేలాగనే ఫిక్స్‌డ్ డిపాజిట్ చేశాడు" అని చెబుతుంటే మా కళ్ళముందు నగ్న సత్యం కనిపించినట్టే అనిపించింది.

"అంతేకాదు, పేదపిల్లల్లో బాగా చదువుకునే వాళ్ళకి రామచంద్రం సహాయం చేస్తుండేవాడు. తమ తల్లిదండ్రుల స్మారకార్థం అనాథ ఆశ్రమంలో వృద్ధులకు వస్త్రాలు పంచిపెట్టేవాడు. అది వీళ్ళెవళ్ళకీ సుతరామూ నచ్చేదికాదు. కానీ అతనిలో ఇటువంటి సద్గుణాలు చూడనిలోకం రామచంద్రాన్ని పిసినారిగా ముద్రవేసింది. పోనీ ఇంట్లో వాళ్ళయినా అర్థం చేసుకున్నారంటే అదీ లేదు. అతగాడి విషయంలో దేముడికీ జాలి కలగలేదేమో అర్థాంతరంగా తీసుకుపోయాడు. తను చచ్చిపోయినా కుటుంబానికి మేలుచేశాడు. వాడి ఆత్మ మీలో దూరిందేమో నాకు తెలీదుగానీ, వాడిని అర్థం చేసుకున్నది మీరొక్కరేమో అనిపిస్తోంది" అని మొత్తం సంగతులన్నీ పూసగుచ్చినట్లు చెప్పారాయన.

రామచంద్రం ఎంతో ఉన్నతమైన వ్యక్తిత్వం నిండిన మనిషి కిందే లెక్క. ఉన్నదబ్బంతా వ్యసనాలతో ఆర్పేసి, కుటుంబానికి అప్పులు మాత్రమే మిగిల్చి, హఠాత్తుగా హరీమన్న ప్రబుద్ధుల్లా కాక, ఇతరులు తనను ఏమనుకున్నాసరే లెక్కచేయక, ముందుచూపుతో వ్యవహరించిన రామచంద్రం వైఖరి అవగాహన చేసుకోవటంలో ఒక సమయంలో ఆఫీసు స్టాఫ్ అయిన మేం కూడా పొరపాటుపడ్డామేమో!

ఏదైనా సరే, ఎవరెన్ననుకున్నాసరే ఓ విధంగా చెప్పాలంటే మేం రామచంద్రం పోగానే అతని కుటుంబానికి సహాయపడ్డానికి ముందుకు రావటం, మా సేవ, కృషి ఫలించి వారు లబ్ధి పొందటం మాకు ఎనలేని ఆనందం కలిగించింది.

రామచంద్రం జీవితంనుంచి ఎవరైనా నేర్చుకోవాల్సింది ఒక్కటే! ముందయినా, వెనకయినా ఒకరు విసిరే విమర్శనా బాణాలకు గాయపడినా కృంగిపోక, వేసే ప్రతి అడుగు అర్థమంతంగా, స్ఫూర్తివంతంగా ఉండాలని, తర్వాతవారికి ఉపయోగపడాలని, ముందుచూపుతో వ్యవహరించటం అత్యంత ప్రధానమని కూడా!

*సెల్:97054 11897*

# అందం అంటే...







**'బ్యూటీ లైస్ ఇన్ ది ఐస్ ఆఫ్ ద బిహోల్డర్'! గ్రీకు తత్వవేత్త ప్లేటో చెప్పినట్టు మన కళ్ళకు అందంగా కనిపించింది వేరొకరికి కూడా అందంగానే కనిపించాలనే రూలేం లేదు. అందానికి నిర్వచనాలు, కొలమానాలు... ప్రాంతాలు, పెరిగిన సంస్కృతి, మీడియాలను బట్టి మారిపోతూ ఉంటాయి. ఒక దేశంలో అందం అనుకున్నది ఇంకో దేశంలో అందవికారం కావచ్చు. అందుకు ఇవే ఉదాహరణలు.**

## మారిషస్: లావుగా ఉంటేనే అందం

జీరో సైజ్ కోసం ప్రపంచవ్యాప్తంగా అమ్మాయిలు పరితపిస్తుంటే మారిషస్ స్త్రీలు మాత్రం ఎంత వీలైతే అంత లావవ్వాలని ఆశ పడుతూ ఉంటారు. అక్కడ లావుగా ఉన్నవాళ్లే అందగత్తెలు. ధనికులమని గుర్తింపు పొందాలన్నా లావుగా ఉండాల్సిందే! ఇలా లావుగా కనిపించటం కోసం మనం స్లిమ్మింగ్ సెంటర్స్‌కి వెళ్లినట్టే అక్కడి స్త్రీలు 'ఫ్యాటెనింగ్ ఫార్మ్స్'కి వెళ్తూ ఉంటారు.

అక్కడ వాళ్ల చేత బలవంతంగా ఆహారం తినిపిస్తారు. యుక్త వయసులో పీలగా కనిపించే అమ్మాయిలను ఆ కుటుంబాలు ఇక్కడికి పంపి లావయ్యేలా చేస్తుంటాయి. ఈ ఫార్మ్స్‌లో ఆ ఆడపిల్లలకు అధిక కొవ్వుండే ఒంటె పాలు తాగిస్తారు. అలాగే రోజు మొత్తంలో దాదాపు 16,000 కేలరీల ఆహారం తీసుకునేలా చేస్తారు.

## తజకిస్తాన్: కనుబొమలు కలిస్తేనే అందం

మిగతా దేశాల్లో అమ్మాయిలు వ్యాక్సింగ్, త్రెడింగ్, ప్లకింగ్‌లతో కనుబొమలను అందంగా తీర్చిదిద్దుకుంటుంటే... తజకిస్తాన్ అమ్మాయిలు మాత్రం ఏపుగా పెంచుతూ ఉంటారు. కనుబొమలు రెండూ కలిసేలా వెంట్రుకలు పెరగకపోతే 'ఉస్మా' అనే ఓ మూలికను కనుబొమల మధ్య పూసుకుని ఐ బ్రోలు కలిసినట్టు భ్రమ కలిగించే ప్రయత్నం చేస్తారు. ఇలా కనుబొమలు కలిసి ఉండటం అదృష్టానికి సూచన అని వాళ్ల నమ్మకం.

## జపాన్: ఎగుడుదిగుడు పళ్లే అందం

చక్కని పలువరుస అందానికి కొలమానం. ఇందుకోసం ఎగుడు దిగుడు పళ్లను సరిచేయించుకునేవాళ్లని, బ్రేసెస్‌తో ఎత్తుపళ్లని తగ్గించుకునేవాళ్లని చూస్తుంటాం. కానీ జపాన్ స్త్రీలు ఇందుకు పూర్తి విరుద్ధం. అక్కడ ఎగుడుదిగుడు పళ్లు, కోర దంతాలు ఉండటం ఫ్యాషన్. అలాంటి స్త్రీల దంత సౌందర్యానికి మురిసిపోతారక్కడ. ఇలాంటి దంత సౌందర్యానికి ఓ పేరు కూడా ఉంది. అదే...'ఏబా

ఎఫెక్ట్.

ఇలాంటి దంతాల కోసం దంత వైద్యులను కలిసి పళ్లను వంకర టింకరగా తయారు చేయించుకుంటారు కూడా! ఇలాంటి దంతాలు పుట్టుకతోనే మీ సొంతమా! అయితే మీరు అదృష్ట వంతులే! జపాన్‌లో ఇలాంటి దంతాలను సెక్సీగా భావిస్తారు.

## ఫులా: పెద్ద నుదురే అందం

వెంట్రుకలతో విశాలమైన నుదురును దాస్తున్నారా? అలాంటి వెడల్పాటి నుదురును ఆఫ్రికాలోని 'ఫులా' తెగలో అందంగా భావిస్తారు. ఇలాంటి నుదురు ఉండేవాళ్లు సెక్సీగా ఉంటారని అక్కడి వాళ్ల నమ్మకం. అందుకే వెడల్పాటి నుదురున్న ఫులా తెగ స్త్రీలు తెగ గర్వపడిపోతూ ఉంటారు. అలాంటి నుదురు లేని స్త్రీలు రేజర్‌తో తల ముందు భాగంలోని వెంట్రుకలను తొలగించుకుంటూ ఉంటారు కూడా!

## చైనా: పాలిపోయిన చర్మం, పెద్ద కళ్లు మొనదేలిన చుబుకం అందం

చైనా స్త్రీలకు చర్మపు రంగు స్పృహ ఎక్కువ. సన్‌స్క్రీన్స్, ఫేస్ మాస్క్‌లకు చైనాలో మార్కెట్ ఎక్కువ. ఇక పాలిపోయినట్టుండే తెల్లని చర్మం, పెద్ద కళ్లు, మొనదేలిన చుబుకం కోసం అక్కడి స్త్రీలు ప్లాస్టిక్ సర్జరీలను ఆశ్రయిస్తూ ఉంటారు. ఇదే నమ్మకం ఆసియా దేశాలన్నిట్లో ఉంది. తెల్లగా ఉంటే చాలు అందంగా కనిపిస్తామనే నమ్మకానికి మన దేశమూ మినహాయింపేమీ కాదు. మన దేశంలో స్కిన్ వైటెనింగ్ క్రీమ్స్, పౌడర్లు హాట్ కేక్స్‌లా అమ్ముడవుతున్నాయి. ఇలాంటి బ్యూటీ స్టాండర్డ్స్‌కు మీడియా కూడా కొంత దోహదపడుతోంది.

## ఇరాన్: కొనదేలిన ముక్కు అందం

ఇరాన్‌లో కొనదేలిన ముక్కు హోదాకు, అందానికి చిహ్నం. ఇందు కోసం 'రైనోప్లాస్టీ' చేయించుకునే స్త్రీల సంఖ్య అక్కడ చాలా ఎక్కువ. తాము రైనోప్లాస్టీ చేయించుకున్నామని తెలియటం కోసం సర్జరీ చేయించుకున్న తర్వాత కూడా ముక్కు మీద 'పోస్ట్ సర్జికల్ బ్యాండేజీ' వేసుకుని తిరుగుతూ ఉంటారు అక్కడి స్త్రీలు. ఒకవేళ ఆ సర్జరీ చేయించుకోకపోయినా చేయించుకున్నామని గొప్పగా కనిపించటం కోసం కూడా అలాంటి బ్యాండేజీలను వేసుకునే స్త్రీలకూ ఆ దేశంలో కొదవ లేదు.

## మవోరి: పెదవుల మీద టాటూలే అందం

న్యూజిలాండ్‌లోని మవోరి తెగలో పెదవులు, చుబుకాల మీద పచ్చబొట్లు పొడిపించుకోవటం అందానికి చిహ్నం. ఇందుకోసం ఆ తెగ స్త్రీలు అందమైన ముఖాల మీద నల్లని పచ్చబొట్లు పొడిపించుకుని అందవిహీనంగా తయారవుతూ ఉంటారు. పెదవులు, చుబుకాల మీద ఎన్ని ఎక్కువ టాటూలు ఉంటే అంత అందంగా భావిస్తారక్కడ.

## జపాన్: అంటుకునే ేయిట్ హెయిర్

హెయిర్ టెక్చర్ జిడ్డుగా అంటుకుని ఉండాలి...అలా ఉంటేనే జపనీయులు అందంగా భావిస్తారు. ఇందుకోసం రసాయనాలు, ఫ్లాట్ ఐరన్స్‌ను ఆశ్రయించి జుట్టు స్ట్రయిట్‌గా కనిపించేలా చూసుకుంటూ ఉంటారు అక్కడి స్త్రీలు.

బాండ్ బ్రేకింగ్ కెమికల్స్ ఉపయోగించి థర్మల్ రీకండిషనింగ్, స్ట్రయిట్ ఐరనింగ్ టెక్నిక్‌లు ప్రయోగిస్తూ ఉంటారు. ఇవే పద్ధతులను అమెరికాలో ఉండే నల్లజాతి స్త్రీలు కూడా అనుసరిస్తూ ఉండటం మరో విశేషం.

– గోగుమళ్ల కవిత





# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు 22

- కంఠంనేని స్వప్న



**అ వుట్‌డోర్ గేమ్స్ అన్నీ హింసాత్మకంగా పరిణమిస్తున్నాయి. ఇన్‌డోర్ గేమ్స్ ఆడటం మంచిది. మనసులో వ్యూహరచన చేస్తున్నాడు రాజేష్.**

**వెనకనుంచి ఏదో పెద్ద బరువు అతని మీద పడింది.**

**ఆకాశం రాలి మీద పడ్డట్లుగా ఉంది రాజేష్‌కి.**

**విలవిల లాడుతున్నాడతను.**

**అతని మీద పడ్డ ఆకారం లేచి నిలబడింది.**

**ఖోఖోలో రెండో టీమ్‌లో అతను.**

**అతన్ని ఔట్‌చేసే ప్రయత్నంలో గట్టిగా కొట్టిందట సీమ.**

ఎగిరివెళ్ళి రాజేష్‌మీద పడ్డాడట.

పొరబాటున కొట్టివుండదు. కావాలనే తనమీదకి తోసి ఉంటుంది రాక్షసి. తనని చంపేయాలని స్కెచ్‌వేసి మరీ వచ్చినట్లుంది.

"సారీ బాస్" గుర్రుగా చూస్తున్న రాజేష్‌తో అంది సీమ.

మొహంలో ఎక్కడా సారీ ఫీలవుతున్న సూచనలు లేవు. తెల్లటి మొహం ఎండకి కంది, కొద్దిగా చెమటలు పట్టి మరింత మెరిసిపోతోంది.

కావ్య నిలబడి ఆట చూస్తోంది.

ఎదురుగా కనబడుతోంది రాజేష్‌కి.

ఆమె మొహం సంబరంగా ఉంది.

రాజేష్‌కి కావ్య మీద తెలీని కసి. చేతి వరకూ వచ్చిందనుకుంటే ఏదో ఒకరకంగా ప్రతీసారీ తప్పించుకోవటం, ప్రతివాళ్ళూ ఆమెకి సహాయపడటం, ఒకప్పుడు భయంతో వణికిపోయిన మనిషి తలెగరేసుకుని తిరుగుతోంది. పాదరసంలా జారిపోతోంది. నయానో భయానో కావ్యని గుప్పిట్లోకి తెచ్చుకోవాలని అతని పథకం. ఫెయిలయిన ప్రతిసారీ కసి రెండింతలవుతోంది.

"ఇన్‌డోర్ గేమ్స్ ఆడదాం" అన్నాడు రాజేష్. బలహీనంగా ఉందతని గొంతు.

మేనేజర్ కాబట్టి, అక్కడున్న వాళ్ళలో సగం మందికి అతనే బాస్ కాబట్టి సరేననక తప్పలేదు వాళ్ళకు.

లోపలకు నడిచారు.

హాల్ విశాలంగా ఉంది.

అక్కడున్న ప్లాస్టిక్ కుర్చీలలో కూర్చున్నారంతా.

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించ కుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం మేరకు నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్నపిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్‌ను కాంటాక్ట్ చేస్తుంది. నైరాని హర్ష కిడ్నాప్ చేసుండొచ్చని చెబుతాడా డిటెక్టివ్. ఆ విషయం అందరికీ చెబుతుంది. కానీ ఆమె మాటలు ఎవరూ నమ్మరు. ఈలోపు చిన్న పొరబాటు జరిగిందని, నైరాని కిడ్నాప్ చేసింది హర్ష కాదని చెబుతాడా ఆన్‌లైన్ డిటెక్టివ్. ఆఫీసులో వాళ్ళందరూ లియోనియా రిసార్ట్స్‌కి వీకెండ్ టూర్‌కి వెళతారు. రాజేష్ బలవంతంతో తప్పనిసరై వెళుతుంది కావ్య. అక్కడ సీమ రాజేష్‌ని ముప్పతిప్పలు పెడుతుంది. **ఆ తర్వాత...**

మ్యూజికల్ చెయిర్స్ ఆడాలనే ఐడియా వచ్చింది వాళ్ళలో ఒకరికి.

"చిన్నపిల్లలమా? నేనాడను" తప్పించుకుందామని చూశాడు రాజేష్.

"ఇందాక బాగా తగిలింది పాపం" జాలిగా చూస్తూ అంది కావ్య,

భగ్గున మండింది అతనికి.

"ఏమి తగలలేదు. నేను ఆడతాను" లేచి నిలబడ్డాడు రాజేష్.

"నేను చాలా అలసిపోయాను. ఆడలేను" కూర్చుంది సీమ.

ఎదవ పౌరుషాలకు పోయి ఆడతానన్నాడు.



ఒళ్ళంతా ఇప్పటికే హూనం అయింది. నోరు మూసుకుని వాళ్ళను ఆడుకోమంటే పోయేది. తనని తనే తిట్టుకున్నాడు రాజేష్.

అమ్మాయిలు అంతా కూర్చుని చూస్తుండగా ఆట మొదలయింది.

ఏడు మందికి ఆరు కుర్చీలు గుండ్రంగా వేశారు.

తొండి చేసో, అనుకోకుండానో, లక్ వల్లో, పక్కన వాళ్ళ తప్పు వల్లో ప్రతిసారీ కుర్చీ దక్కించు కుంటున్నాడు.

ఒక కుర్చీ మిగిలింది.

రాజేష్, మరొకతను మిగిలి ఉన్నారు.

మ్యూజిక్ వినిపిస్తోంది.

కుర్చీ చుట్టూ తిరుగుతున్నారు.

సడన్‌గా మ్యూజిక్ ఆగింది.

కుర్చీలో కూర్చోవటానికి రాజేష్‌కి అనువుగా ఉన్నప్పుడు ఆగడంతో ఆ కుర్చీ తనదే అని అర్థమైందతనికి. తనీ ఆటలో గెలిచాడు, అదీ ఆడవాళ్ళందరూ చూస్తుండగా..! గర్వంగా అందరి వైపు చూస్తూ కూర్చుంటుండగా జరిగిందది.

ఎవరో కుర్చీ లాగేశారు.

దబ్బున కిందపడ్డాడు రాజేష్.

కాసేపటి వరకూ లేవలేకపోయాడు.

దెబ్బ మీద దెబ్బ.

కుర్చీ మెరుపు వేగంతో ఎవరో లాగేయటం ఒక్క మిల్లీసెకండ్ పాటు చూశానని అతని అనుమానం. ఆ వ్యక్తికి పట్టులాంటి పొడవాటి జుట్టుందని అతనికెందుకో బలంగా అనిపిస్తోంది.

సీమ మీద అనుమానంతో అలా భ్రమపడుతున్నాడా?

ఆమె అంతదూరాన కూర్చుని ఉంది.

అంత ఫాస్ట్‌గా ఎలా రాగలుగుతుంది?

ఏమిటో... అంతా గందరగోళంగా ఉందతనికి.

"అబ్బా! కూర్చుని ఆడే ఆటలు ఆడుకుందాం ఏవయినా? ఇవాళ ప్రతి ఆట వయొలెంట్‌గా ఎండ్ అవుతోందేమిటో! పైగా వింత ఏమిటంటే ప్రతి ఆటలోనూ రాజేష్‌కే దెబ్బలు తగులు తున్నాయి" బుగ్గన వేలేసుకుని రాజేష్‌ని చూస్తూ అంది రోహిణి.

స్కీమ్ వేశారే మీరంతా. మీ సంగతి నాకు తెలుసు. ప్రతి ఆట చివరా థాంక్‌యూ నోట్ లాగా నాకు దెబ్బ తగిలిందనే విషయం మీలో ఒకళ్ళు అందరికీ క్లుప్తంగా వివరించడం. అంతా నాకు అర్థమవుతోంది. పళ్ళు నూరుతూ అనుకున్నాడు రాజేష్.

కారమ్స్ ఆడుతున్నారు. మూడు బోర్డులున్నాయక్కడ.

రాజేష్ గొప్పలకి పోదల్చుకోకుండా ఆడనని చెప్పేసి దూరంగా కుర్చీలో కూర్చుని చూస్తున్నాడు.

పక్కనున్న వాళ్ళతో మాట్లాడుతూ, ఫోన్ చూసుకుంటూ, మధ్యమధ్యలో ఆట గమనిస్తున్నాడు.

ఉన్నట్లుండి స్ట్రయికర్ ఎగిరొచ్చి కన్ను పక్కగా కణతకి దగ్గరగా తగిలింది.

క్షణాల్లో కన్నుచుట్టూ బుసబుస పొంగి వాచిపోయి కన్నంతా ఎర్రబడింది.

సహనం కోల్పోయాడు రాజేష్.

తనొక కార్పొరేట్ సంస్థలో పని చేస్తున్నాననీ, అందులో కొన్ని నియమాలుంటాయనీ, వాటిని అతిక్రమించకూడదనీ తట్టలేదతనికి.

చరచరా సీమ దగ్గరకు నడిచాడు.

(కనీసం అలా నడిచానని అతను భావించాడు. చూసేవాళ్ళకు అతను తడుముకుంటూ, కుంటు కుంటూ రావడం చూసి నవ్వొచ్చింది)

"ఎందుకు కొడుతున్నావు?" అరిచాడు.

"వాట్? ఆర్ యూ ఆల్‌రైట్?" ఆశ్చర్యంగా అంది సీమ.

"పొద్దుటి నుంచీ గమనిస్తున్నాను. నువ్వు నన్ను ప్రతి ఆటలో టార్గెట్ చేస్తున్నావు. ఏదో ఒక రకంగా నాకు దెబ్బ తగిలేలా చేస్తున్నావు?" వేలు చూపిస్తూ అన్నాడు.

సీమ నవ్వింది. అతని వేలు పట్టుకుని మడుస్తూ చెప్పింది.

"కమాన్ రాజేష్... నువ్వు ఏదేదో ఊహించుకుంటున్నావు. నీకు రెస్ట్ అవసరం" నిర్లక్ష్యంగా అనేసి అక్కణ్ణుంచీ వెళ్ళిపోయింది.

వేలు పట్టుకున్నప్పుడు మెత్తటి స్పర్శకీ, అంత

దగ్గరగా రావటంతో ఆమె జుట్టు నుంచి వస్తున్న షాంపూ పరిమళానికి రాజేష్ బుర్ర తిరిగిపోయింది.

తేరుకునేసరికి రూమ్ ఖాళీ అయింది.

అందరూ రూమ్‌లకి వెళ్ళి ఫ్రెష్ అయి డిన్నర్ వద్ద కలిశారు.

డిన్నర్ చేసేప్పుడు ప్రతివాళ్ళూ తను చూడ ట్లేదు అనుకున్నప్పుడు నవ్వుకోవడం, చూశాడని పించగానే ఏదో సీరియస్ విషయం డిస్కస్ చేస్తు న్నట్లుగా ప్రవర్తించడం గమనించాడు రాజేష్.

అందరూ కుమ్మక్కయ్యారన్నమాట. చెప్తా! పర్ ఫార్మెన్స్ అప్రయిజల్ టైమ్‌లో మీ అంతు చూస్తా... మనసులో శపథం చేసుకున్నాడు.

***

రాత్రి పదకొండయింది.

లేచి కూర్చున్నాడు రాజేష్.

రిసెప్షన్‌కి డయల్ చేశాడు.

రూమ్స్ రిజిస్ట్రేషన్ చేస్తున్నప్పుడే కావ్య రూమ్ నంబర్ నోట్ చేసుకున్నాడతను.

అయినా మళ్ళీ ఒకసారి చెక్ చేసుకోదల్చుకున్నాడు.

చాలాసేపు రింగ్ అయ్యాక బలవంతంగా ఫోన్ ఎత్తారు రిసెప్షన్ నుంచీ.

నిద్ర మత్తులో ఉన్న మగగొంతు.

"రూమ్ నంబర్ 1104 కావ్య రూమ్ నంబ రేనా?" అడిగాడు.

అసలే నిద్రమత్తులో, బద్ధకంగా ఉన్నాడేమో, విసుక్కోబోయాడు రిసెప్షనిస్ట్.

"అలా చెప్పకూడదు!"

"మేమంతా ఒకే ఆఫీసు నుంచి వచ్చాము. ఫోన్ చేయాలొక అర్జంట్ పనిమీద" తొందర పెట్టాడు రాజేష్.

"సెల్‌ఫోన్‌కి చేయండి" అన్నాడతను మొండిగా.

రాజేష్‌కి ఒళ్ళు మండింది. అయినా ఓపిగ్గానే అన్నాడు.

"ఆమె సెల్‌ఫోన్ వాడదు".

"మరి రిజిస్ట్రేషన్ చేసినప్పుడు సెల్ నంబర్ ఇచ్చిందే?" ఆశ్చర్యంగా అన్నాడు రిసెప్షనిస్ట్.

"తప్పనిసరిగా ఇవ్వాలంటే ఏదో ఒకటి రాసుం టుందిలే!" అసహనంగా ఉంది రాజేష్‌కి.

రిసెప్షనిస్ట్ నిద్ర ఎగిరి పోయిందప్పటికి.

"సెల్‌ఫోన్ లేకుండా మనుషులు, అదీ ఆడ వాళ్ళు ఉంటున్నారంటే వింతగా ఉంది" సంభాషణ లోకి దిగబోయాడు.

"ఇంతకీ రూమ్ నంబర్ కన్‌ఫర్మ్ చేయనంటావు?" మీ మేనేజర్‌కి కాల్ ఫార్వర్డ్ చేయి" కోపంగా ధ్వనించింది రాజేష్ గొంతు.

"వన్ మినిట్ సర్. రూమ్ నంబర్ కరెక్టే!" విన మ్రంగా అన్నాడు రిసెప్షనిస్ట్.

"ఈ మాత్రానికి మేనేజర్ వరకూ ఎందుకు సర్? అసలే పడుకుని ఉంటాడు. ఈ టైమ్‌లో ఫోన్ చేస్తే నన్ను ఉద్యోగంలో నుంచి పీకేసి, మిమ్మల్ని రూమ్ ఖాళీచేయిస్తాడు" చెప్తూనే ఉన్నాడతను.

> **రూమ్‌లోకి వెళ్ళి గట్టిగా లాక్ చేసుకున్నాడు రాజేష్. మంచం మీద వాలిపోయాడు. ఒళ్ళంతా ఒకటే నొప్పులు. అంత బాధలోనూ ఏదో గుర్తు తెచ్చుకోవ డానికి ప్రయత్నిస్తున్నాడతను. అసలు తనని కొట్టిందెవరు? జరిగినదంతా కాకతాళీయమా? లేక ఎవరయినా కావాలనే చేశారా? పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాడు. అసలేం జరిగింది? అతణ్ణి కొట్టింది ఎవరు?**

ఫోన్ కట్ చేశాడు రాజేష్.

***

కావ్య రూమ్ డోర్ మీద మెల్లిగా కొట్టాడు రాజేష్.

మొహం కనబడకుండా క్యాప్ పెట్టుకున్నాడు. పుల్‌గా మేకప్ వేసుకుని పర్‌ఫ్యూమ్ కొట్టుకున్నాడు. కారిడార్ అంతా పర్‌ఫ్యూమ్ వాసన గుప్పుమంటోంది.

ఎక్కడా అలికిడి లేదు.

మళ్ళీ గట్టిగా తలుపుతట్టాడు.

ఆశ్చర్యం...

తలుపు వేసి ఉన్నట్లు లేదు.

తెరుచుకుంది.

దొంగ.... అమాయకంగా అనిపిస్తుంది కానీ ఈ టైమ్‌లో తలుపులు తెరచి ఉంచింది. ఏదో వ్యవ హారం నడిపిస్తున్నట్లుంది. లేకపోతే తన కోసమేనా?

ఊహకే ఒళ్ళు పులకరించిందతనికి.

లోపలికి నడిచాడు.

మరుక్షణం అతని మీద దుప్పటి కప్పారెవరో.

పిడిగుద్దులు తిన్నాడొక అయిదు నిమిషాలు ఆగకుండా.

దుప్పటితో సహా అతన్ని ఈడ్చుకెళ్ళి అతని రూమ్ ఎదురుగా విసిరేసి వచ్చారు.

అతికష్టం మీద లేచి తన రూమ్ తలుపు తెరవ బోయాడు.

చేయి వణుకుతోంది.

కీ సరిగా స్వయిప్ చేయలేక పోతున్నాడు.

అయిదు నిమిషాలకు డోర్ ఓపెన్ చేసుకోగలి గాడు, అతిప్రయత్నం మీద. రూమ్‌లోకి వెళ్ళగానే గట్టిగా తలుపు లాక్ చేసుకుని వెళ్ళి మంచం మీద వాలిపోయాడు.

అసలేం జరిగింది?

తను వేరే రూమ్‌లోకి వెళ్ళాడా?

పొరబాటున వేరే రూమ్‌లోకి వెళ్తే అరుస్తారు కదా!

అసలు సౌండ్ లేకుండా నీట్‌గా, ప్రీ ప్లాన్డ్‌గా కొట్టినట్టు కొట్టారేమిటి?

ఆ దెబ్బలు తనకు సుపరిచితంగా అనిపిస్తు న్నాయి.

ఏదో గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నా డతను.

తన రూమ్ ఎలా తెలిసింది వాళ్ళకు? తీసు కొచ్చి అక్కడెలా విసిరేశారు? తెలిసే చేశారా? కాక



పట్టువదలని 'రాజూ బేతాళుడి' కథలా
భుజం మీద రోజుని మోసుకుని కదులుతానా
అదీ కొన్ని ప్రశ్నలను నా మీదికి సంధిస్తుంది
జవాబు చెప్పలేక వేయి వక్కలవ్వాల్సిన తల
తలదించుకొని ఏ వంకతోనో
మరో రోజుతో నడకకు సిద్ధపడుతుంది

## అనామకం

ఏది ఎందుకు జరుగుతుందో తెలిసీ
ఎలా జరగాలో తెలిసీ
ప్రమేయం విధి మీద నెట్టి తప్పించుకుంటున్న
నా పాత్ర గురించీ, ప్రమేయం గురించీ
నా చూపు గురించీ, కదలిక గురించీ
నా ఆశ గురించీ అవే ప్రశ్నలు...

నిద్ర నటిస్తూ కళ్ళు మూసుకుని
బతుకును తాగడానికి అలవాటుపడ్డ
నా రొటీన్ దాహం మీద ఓ ప్రశ్న...
నేరాన్ని ఎవరిమీదికోనెట్టి తప్పుకునే
నా ఎత్తుగడల వాలకానికో ప్రశ్న...
పొగచూరిన దృశ్యాల మధ్య
విలువల దహనం కొనసాగుతున్నప్పుడు
వార్తలకు చలికాగుతున్న
నా కాలక్షేపం మీద ఓ ప్రశ్న....

పొగిడే అద్దం ముందు మిడిసిపడి
అలంకారమైన ఆహార్యంతో ఎగసిపడ్డా
రోజుముందు నిలబడ్డప్పుడల్లా



బదులివ్వలేని బలహీనతనే...
తలెత్తుకోలేని దోషినే...

నా కంటే ముందు నాలోని రెండో మనిషిని
తలకెక్కించుకున్న పాపానికి
అంతరాత్మను తొక్కేసుకుంటూ
దాటివచ్చిన ద్రోహానికి
నా జవాబుదారీతనం ప్రశ్నల మధ్య
ఎప్పుడూ ఓడిపోతుంది
ప్రశ్నలకు ఉరేసుకున్న ఉనికి
అనామకంగా కాలగర్భంలో కలిసిపోతుంది

—వర్జుల శివకుమార్

mail:shivakumarvajjala@gmail.com

# ఆ డైరెక్టర్‌తో తమన్నా పెళ్ళి?

ఇప్పుడు ఈ వార్త బాగా హల్‌చల్ చేస్తోంది. ఆ డైరెక్టర్ ఎవరో కాదు ప్రభుదేవా! ప్రభుదేవాతో తమన్నా 'అభినేత్రి' సినిమా చేసింది. అప్పటి నుంచే వీరిద్దరి మధ్య ఎఫైర్ మొద లైందని అంటున్నారు సినీ జనాలు. ప్రస్తుతం బాలీవుడ్, టాలీవుడ్, కోలీవుడ్‌లలో తమన్నా సిని మాలేవీ లేవు. దాదాపు తన మీద ఫ్లాప్ హీరోయిన్ అన్న ముద్ర పడింది. ఇలాంటి సమయంలో ప్రభుదేవా మరోసారి తమన్నాతో జత కట్టడానికి రెడీ అయిపోయాడు. సరిగ్గా ఈ వార్తే పుకార్లకు ఊతం ఇచ్చింది! త్వరలోనే వీరిద్దరూ పెళ్ళి చేసుకోబోతున్నారంటున్నారు. గతంలో చాలా మంది హీరోయిన్లతో ప్రభుదేవా ప్రేమాయణాలు నడిపాడు. ఇప్పుడు తమన్నా వంతు వచ్చింది అంటున్నారు.

తాళీయంగా అక్కడ పడేశారా?

సడన్‌గా స్ట్రయిక్ అయిందతనికి.

మొదటిసారి సీమ, తను రెస్టారెంట్‌కి వెళ్ళినప్పుడు సీమ అన్నలమంటూ ఇద్దరు బౌన్సర్ల లాంటి వాళ్ళు తనను చితక్కొట్టారు. అప్పుడూ ఇలాగే తన రూమ్ దగ్గర వదిలేసి వెళ్ళారు.

ఈ దెబ్బలు కూడా వాళ్ళు కొట్టినవే!

అప్పటిలాగే సలుపుతోంది ఒళ్ళంతా. ఇవికాక ఆటల పేరిట తిన్న దెబ్బలు మరికొన్ని.

ఒకటి క్లియర్‌గా అర్థమవుతోంది రాజేష్‌కి.

అప్పుడూ ఇప్పుడూ కావాలనే తనను తన్నించింది సీమ.

తనే ఆడపిచ్చిలో తెలివితక్కువగా ఆమెను నమ్ముతూ వచ్చాడు.

***

పొద్దున లేచేసరికి రాజేష్ ఎందుకు రూమ్ ఖాళీ చేసి వెళ్ళిపోయాడో ఎవరికీ అర్థం కాలేదు. మిగిలిన రోజంతా సంతోషంగా గడిపి ఇళ్ళ దారి పట్టారందరూ.

***

తల తిరుగుతోంది అక్షయ్‌కి.

నైరాని తను చంపాడంటారేమిటి? ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు ఉన్నట్లుండి వచ్చి. శ్రీకాంత్ మాట మాత్రమైనా ఏమీ చెప్పలేదేమిటి? అసలు నైరా చనిపోవటం ఏమిటి?

ముందు సీట్లో కూర్చున్న శ్రీకాంత్ వైపు చూశాడు అక్షయ్.

అతని మొహం మ్లానంగా ఉంది.

జరుగుతున్నదేదీ అతని చేతుల్లో లేదనీ, అతనికి ఇష్టం లేదనీ అర్థమైపోతోంది.

"శ్రీకాంత్, నైరా దొరికిందా?" ముందుకు వంగి అడిగాడు అక్షయ్.

పక్కనున్న డి.ఎస్.పి అతని చేతిమీద ఒక్కటి కొట్టాడు.

"నోరు మూసుకుని కూర్చో. చంపేసి ఏమీతెలీనట్లు అమాయకంగా ప్రశ్నలు అడుగుతున్నావా?" గద్దించాడు.

"నేను చంపటం ఏమిటి?" అరిచాడు అక్షయ్.

"పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాక అన్నీ అర్థమవుతాయి. మూసుకో!" కఠినంగా ఉందతని గొంతు. వాళ్ళు తనకు సమాధానం ఇవ్వరని అర్థమయిందతనికి.

నైరా చనిపోయిందా? ఇన్నిరోజుల పరిశోధన, వెతకటం అంతా వృథాయేనా? ఇంక తనకెవరూ లేరా? స్పీడ్‌గా వెళ్తున్న జీప్‌లో నుంచీ దూకేసి చనిపోవాలనిపించింది అతనికి.

కానీ ఒకసారి నైరాని చూడాలి. ఆమెని చంపిందెవరో కనుక్కుని ప్రతీకారం తీర్చుకోవాలి. కళ్ళలో నుంచి నీళ్ళు రావటం లేదు. మనసంతా బండబారిపోయినట్లుగా ఉంది.

పోలీస్‌స్టేషన్ ముందు జీప్ ఆగింది.

అక్షయ్‌ని లోపలికి ఈడ్చుకెళ్ళారు వాళ్ళు.

లోపలికి వెళ్ళగానే నిలబెట్టి, కూర్చోబెట్టి, సైడ్ యాంగిల్‌లో రకరకాలుగా ఫోటోలు తీసుకున్నారు. ఆ పని అయ్యేవరకూ అక్షయ్‌ని నోరెత్తనివ్వలేదు వాళ్ళు. అక్షయ్‌లో ఎనర్జీ అంతా పోయినట్లుంది. వాదించటానికి కూడా ఓపిక చాలదనిపిస్తోంది అతనికి. ఓటమిని ఒప్పుకున్నట్లుగా ఉన్నాడతను.

క్రిమినల్స్ లిస్ట్‌లో అక్షయ్‌ని చేర్చడానికి అవసరమైన అన్ని వివరాలు తీసుకున్నాక అతడిని పక్కనున్న రూమ్‌లోకి తీసుకెళ్ళారు.

ఒక పెద్ద సూట్‌కేస్ ఉందక్కడ.

ఏదో వాసన...

దుర్గంధాన్ని కప్పిపెట్టడానికి పైన మరేవో సుగంధ పరిమళాలు చల్లినట్లున్నారు. రెండూ కలిపి ఒక రకమైన వాసన వస్తోంది.

సూట్‌కేస్ తెరిచాడు ఒక పోలీస్.

తొంగి చూశాడు అక్షయ్.

అతని మొహమంతా ఆనందం పరుచుకుంది.

"ఈ పాప నైరా కాదు" అన్నాడు.

కుర్చీలో వెనక్కి జారగిలబడి టేబుల్ మీదకి కాళ్ళు పెట్టుకుని ఊపుతూ అన్నాడు డి.ఎస్.పి.

"సరిగ్గా చూడు"

"పాప నల్లగా ఉంది. మా నైరాది బంగారు రంగు."

"చనిపోయాక అందరూ ఒకటే రంగులోకి మారతారు. సరిగ్గా తిప్పి మొహం చూడు" వెటకారంగా అన్నాడా డి.ఎస్.పి. బోర్లా పడుకున్నట్లుగా ఉందా శవం.

మొహం చేత్తో పట్టుకుని తిప్పబోయాడు అక్షయ్.

చర్మం చేతికి అంటుకుపోతోంది. మొహం నుంచీ పీల్ అవుతోంది. ఒళ్ళు గగుర్పొడిచింది అక్షయ్‌కి. రెండు రోజులు దాటినట్లుగా ఉంది చనిపోయి. అక్కడక్కడా పురుగులు తిరుగుతూ కనబడుతున్నాయి.

చేయి గబాల్న వెనక్కి లాక్కున్నాడు.

"చూశాను. నైరా కాదు" ఖచ్చితంగా చెప్పాడు అక్షయ్. రిలీఫ్ ఫీలవుతున్నాడతను.

"నైరా చనిపోలేదు. తెలుసు!" నిర్లక్ష్యంగా ఉందా డి.ఎస్.పి గొంతు.

అప్పుడొచ్చాడు శ్రీకాంత్.

"సర్, నైరా కాదని ఒప్పుకున్నారు కదా! అతన్ని వదిలేద్దాం" అర్థిస్తున్నట్లుగా, అదే సమయాన హెచ్చరిస్తున్నట్లుగా ఉందతని గొంతు.

శ్రీకాంత్‌ని ఎగాదిగా చూశాడతను.

"ప్రమోషన్ రావాలని లేదా?"

అక్షయ్‌ని కోరగా చూస్తూనే ఏదో నంబర్‌కి ఫోన్ కలిపాడు. శ్రీకాంత్‌కి ఇచ్చాడు.

"యస్ సర్. ఇప్పుడే బయల్దేరుతున్నాను" వెళ్ళిపోయాడు శ్రీకాంత్.

వెళ్తూ అతను నిస్సహాయంగా అక్షయ్ వైపు చూశాడు.

"రూమ్‌కి లాక్ చేసెయ్" కానిస్టేబుల్‌తో అంటూ అక్షయ్ వైపు చూశాడా పోలీస్ ఆఫీసర్.

"పద మాట్లాడుకుందాం, నా ఆఫీస్‌లో కూర్చొని."

కూర్చున్నాక టీ ఆఫర్ చేశాడు అక్షయ్‌కి.

మంచినీళ్ళు కావాలన్నాడతను.

తెప్పించి ఇచ్చాక చెప్పటం మొదలెట్టాడతను.

వింటున్న అక్షయ్ షాక్‌కి లోనయ్యాడు. రక్తం మరుగుతోందతనికి.

అంతకు ముందురోజు సంఘటన అతని మెదడులో రీప్లే అవుతోంది.

***

తను నైరా కోసం వెతుకుతూ, ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

అప్పుడే ఒక పదేళ్ళ పాప పరిగెత్తుతూ వచ్చి, తనను చుట్టుకుపోయింది.

ఆమె ఎవరో తెలీదు.

కానీ వెనక తరుముకొస్తున్న వాళ్ళను చూస్తే ఏదో ఆపదలో ఉందని అర్థమైంది.

"అంకుల్, ప్లీజ్ హెల్ప్" అడుగుతోంది.

పాపని వీపు మీద ఎక్కించుకున్నాడు అక్షయ్.

పాపని వెంటాడుతున్న వాళ్ళు చూడకుండా చెట్ల చాటునుంచి వెళ్తూ అక్కడున్న గోడపైకి ఎక్కాడు. ఆ ఇంటికి రెండో వైపు గోడ దూకితే ఇంకో వీధిలోకి వెళ్తాడు. అక్కడే తన కార్ పార్క్ చేసి ఉంది.

గోడ ఎక్కుతుండగా ఆ ఇంట్లో కుక్క అరుస్తూ పరుగెత్తుకొస్తోంది.




అతి భయంకరమైన పిట్‌బుల్ జాతికి చెందిన కుక్క అది.

దొరికితే చీల్చి చెండాడుతుంది.

అక్షయ్ గోడ ఎక్కుతుండగా ఆఖరి క్షణంలో చేతులు వదిలేసింది పాప.

వెనక్కి చూశాడు అక్షయ్.

వణికిపోతూ కుక్కవైపు చూస్తోంది.

కుక్క దగ్గరికొస్తోంది.

ఒక్క సెకన్‌లో నోట కరుస్తుందనగా మెరుపు వేగంతో పైకి లాగేశాడు అక్షయ్.

వీధి చివర కార్ పార్క్ చేసి కనబడుతోంది.

కార్‌లో ఎక్కాక కాస్త దూరం వెళ్ళేసరికి తేరుకున్నామనుకున్నాక అడిగాడు అక్షయ్.

"ఎవరు వాళ్ళు నిన్ను వెంటాడుతున్నది?"

"పోలీసులు" భయంగా అంది పాప.

ఉలికిపడ్డాడు అక్షయ్.

"దొంగతనం చేశావా?" అడిగాడు.

అప్పుడు చెప్పుకొచ్చిందామె.

ఆమె, పద్నాలుగేళ్ళ ఆమె అక్క లాన్‌టెన్నిస్ ఆడటానికి వెళ్తుంటారు. వాళ్ళు ఆడే గ్రౌండ్‌కి దగ్గర్లోనే పోలీస్ అధికారి ఇల్లుంది. బాల్కనీలో నిలబడితే వీళ్ళు ఆడటం కనిపిస్తుంటుంది. అతనికి స్పోర్ట్స్ అసోసియేషన్‌లో ఎగ్జిక్యూటివ్ మెంబర్‌షిప్ ఉంది.

ఆ అమ్మాయి అక్క బాగా ఆడుతుందనీ, టోర్నమెంట్స్‌కి రికమెండ్ చేస్తాను, మాట్లాడదాము రమ్మనీ కబురు పెట్టాడతను.

అక్కాచెల్లెళ్ళు ఇద్దరూ ఆనందంగా అతని దగ్గరికి వెళ్ళారు.

చెల్లెలిని బయట కూర్చోమన్నాడు. ఆమె బయట వెయిట్ చేస్తుండగా అక్క అరుపులు వినపడ్డాయి. పరిగెత్తుకుని లోపలికి వెళ్ళేసరికి ఏడుస్తోంది. ఆమెతో అసభ్యంగా ప్రవర్తించాడట. అదే టైమ్‌కి వాళ్ళ అదృష్టం బాగుండి ఎవరో విజిటర్స్ వచ్చారు.

ఇద్దరినీ వెళ్ళిపోనిచ్చాడతను.

తర్వాత వాళ్ళ తల్లికీ, తండ్రికీ చెప్పారు.

ఆ పోలీస్ అధికారి మీద వాళ్ళు కంప్లయింట్ ఫైల్ చేశారు.

అక్కణ్ణుంచీ మొదలయింది నరకం వాళ్ళకు.

ఆమె తండ్రి మీద లంచం తీసుకున్నాడని నెపం మోపబడింది. ఉద్యోగం ఊడిందతనికి. తల్లి కార్ నడుపుతూ ఎవరినో గుద్దిందన్న అభియోగంతో కోర్టుల చుట్టూ తిరుగుతోంది. ఆ పాప అక్కకు ప్రవర్తన సరిగా లేదన్న నిందవేసి స్కూల్లో టీసి ఇచ్చారు. అప్పుడప్పుడూ పాపను తీసుకెళ్ళి చిత్రహింసలకు గురిచేస్తారు. ఇదివరకొకసారి స్కూల్ నుంచి వస్తుంటే పట్టుకెళ్ళి సన్నటి రాడ్‌తో కాళ్ళమీద కొట్టారు. కేస్ వెనక్కి తీసుకుని అందరిముందు పోలీస్ అధికారి కాళ్ళు పట్టుకోవాలని అడిగారట.

ఆరోజు వాళ్ళు మళ్ళీ జీప్ ఎక్కించబోతుంటే తప్పించుకుని పారిపోతూ అక్షయ్ కంట పడిందామె. ఆ రోజు రాత్రి పాపనీ, ఆమె కుటుంబాన్నీ సురక్షితమైన ప్రదేశానికి చేర్చాడతను.

***

"చెప్పు. ఎక్కడ దాచావు ఆ పాపని?" అడిగాడతను.

"ఏ పాప? నేను దాయటమేమిటి?" అమాయకంగా అడిగాడు అక్షయ్.

అతని చేతిలో సెల్‌ఫోన్ ఆన్ అయింది. ఫోన్ కెమెరాలో పోలీస్ అధికారి కనబడేలా జేబులో పెట్టుకున్నాడు.

లైవ్ స్ట్రీమింగ్ మొదలైంది. అక్కణ్ణుంచి అతని యూట్యూబ్ అకౌంట్‌లో వీడియో లైవ్‌గా ప్రసారం అవుతోంది. యూట్యూబ్, ఫేస్‌బుక్ అకౌంట్‌కే, ట్విటర్‌కే కనెక్ట్ చేయబడింది. అతని అకౌంట్స్‌లో లైవ్ ప్రసారం మొదలయింది. దాన్ని వెంట వెంటనే షేర్ చేయటం మొదలెట్టారు సోషల్ మీడియా పక్షులు.

"నీకంతా తెలుసని నాకు తెలుసు. నాటకాలు ఆడకు" అన్నాడతను.

"అంకిత చెల్లెల్ని నువ్వు దాచావని నాకు తెలుసు" మళ్ళీ అన్నాడు.

"అంకిత ఎవరు? ఆమె చెల్లెల్ని నేను దాయటమేమిటి?" అడిగాడు అక్షయ్.

అతను లేచాడు. పేపర్ వెయిట్ తిప్పుతూ టేబుల్‌మీద కూర్చున్నాడు. అక్షయ్‌తో అన్నాడు.

"సరదాగా ముట్టుకుంటే తప్పా? చిన్నచిన్న స్కర్టులేసుకుని ఆటలు ఆడటానికి వస్తారు. అంత పతివ్రతలయితే ఇళ్ళలో కూర్చోవచ్చుగా! సరే పోనీ, ఇష్టం లేకపోతే లేదని చెప్తే సరిపోతుంది. నా మీద కేస్ ఫైల్ చేయటమేమిటి? డిపార్ట్‌మెంట్ అంటే ఆటలుగా ఉందా వాళ్ళకు?"

"తప్పు కదా సర్? చిన్నపిల్ల" జాలిగా అన్నాడు అక్షయ్.

"తప్పేంటి? నేను పెద్దవాడిని కదా! నా మీద కేసులు పెట్టొచ్చా?" కోపంగా ఉందతని గొంతు.

"ఆడపిల్లలకి ఈ ఏజ్ నుంచే స్కర్టులు, ఆటలు తప్పుకదా?" మళ్ళీ అన్నాడతను.

ఫేస్‌బుక్‌ల నుంచి అప్పటికి టీవీల్లో లైవ్ స్ట్రీమింగ్ మొదలయింది.

"ఇప్పుడేం చేస్తారు? పాపం వదిలేయండి సర్?" అన్నాడు అక్షయ్.

"సమస్యే లేదు. అంకితని నాకు అప్పగించాలి. దాని బాబు నా మీద పెట్టిన కేస్ వెనక్కి తీసుకోవాలి" చెప్పాడతను.

"మీ మనవరాలి వయస్సుంటుంది" గొణిగాడు అక్షయ్.

"నా పిల్లలకీ, వాళ్ళకీ పోలికా?" ఎక్కడ దాచావు చెప్పు" అరుస్తున్నాడతను.

అప్పుడే టీవీల్లో ప్రతిపక్ష నాయకుడి ప్రెస్‌మీట్ మొదలయింది.

అంకిత కుటుంబం అంతా అతనితో కూర్చుని ఉంది.

పోలీస్ ఆఫీసర్ తమ కుటుంబాన్ని ఎంతలా వేధించాడో కళ్ళనీళ్ళ పర్యంతం అవుతూ చెప్తున్నారు వాళ్ళు.

'అధికార పక్షం అండదండలతో రెచ్చిపోతున్న పోలీస్ వ్యవస్థ' అన్ని ఛానల్స్‌లో ఫ్లాష్ న్యూస్ వస్తోంది.

హోమ్ మినిస్టర్ నుండీ పోలీస్ ఉన్నతాధికారులకి ఫోన్లు వెళ్ళాయి.

ఎస్పీ స్వయంగా అక్షయ్ ఉన్న పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు.

అతన్ని విడిపించటం, పోలీస్ ఆఫీసర్‌ని సస్పెండ్ చేయటం, అంకిత కుటుంబం మీదున్న కేసులన్నీ ఎత్తివేయటం... ఒక గంటలో జరిగిపోయాయి.

అధికార పక్షం తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకునే ప్రయత్నంలో పడింది.

***(ఇంకావుంది)***

# జీవన మహోదధిలో విజయ తరంగం సి.వి.ఆర్




**సివిఆర్ జీవన తరంగాలు**

**రచన:** సి.వెంకటకృష్ణ, **సహ రచయిత:** డాక్టర్ కె.బాబూరావు
**ధర:** 150 రూపాయలు, **పేజీలు:** 120
**ప్రతులకు:** కోట్‌లక్ బుక్స్, 73, మిథిలానగర్ కాలనీ, రోడ్ నెం 12, బంజారాహిల్స్ , హైదరాబాద్ –34, సెల్: 9849066789




**నిరుపేదగా పుట్టడం తప్పుకాదు, నిరుపేదగా మరణించడం తప్పు అన్నాడు ఒక మహనీయుడు. మన పుట్టుక మనల్ని మహనీయులుగా మార్చదు. మన ఆలోచనా విధానం, పెంపకం, స్థిరసంకల్పమే మనల్ని ఆ స్థాయికి ఎదిగేలా చేస్తాయి. మహనీయుడంటే ప్రవచనాలు వల్లించడమో, పరస్పర విరుద్ధంగా జీవించడమో కాదు. ఆదర్శవంతులు, సచ్ఛీలురు ఎక్కడినుండో ఊడిపడరు. మన గడ్డమీదే పుడతారు. మనమధ్యే బతుకుతారు. మార్గదర్శకులవుతారు.**

మనం తెలుసుకోదగిన అలాంటి వ్యక్తుల్లో ఒకరు చింతా విశ్వేశ్వరరావు. ప్రముఖ పారిశ్రామికవేత్త, నవయుగ గ్రూప్, కృష్ణపట్నం ఓడరేవుల ఛైర్మన్. సి.వి.ఆర్‌గా ప్రసిద్ధులు. ఆయన షష్టిపూర్తి మహోత్సవం వరకు జరిగిన జీవిత విశేషాలన్నీ 'విశిష్టవ్యక్తిత్వం' పేరిట ఇప్పటికే పుస్తకంగా వెలువడింది. దానికి కొనసాగింపుగా వెలువడిన మరో పుస్తకమే 'సివిఆర్ జీవన తరంగాలు'. ఈ 18 చిరుగాథల్లో ఆయన జీవితంలోని ఆసక్తికర సంఘటనలు, ప్రబోధాత్మకమైన జ్ఞాపకాలు, అనుభవాలు పాఠకులను ప్రభావితుల్ని చేయడమేకాదు, ఎటునుంచి ఏ పేజీ తెరచిచూసినా ఆయన ఉత్తమ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించి స్ఫూర్తినింపుతాయి.

సామాన్య కుటుంబంలో పుట్టి, రాగద్వేషాలు, ఈర్ష్య, అహం వంటి వాటిని ఒక్కొక్కటిగా వదుల్చుకుంటూ తనను తాను మహనీయునిగా తీర్చిదిద్దుకున్నారు సి.వి.ఆర్. పదుగురికీ ఉపాధి కల్పించి దేశ ఆర్థిక వ్యవస్థకు దోహదం చేసే సామాజిక లక్ష్యాన్నే తన లక్ష్యంగా స్వీకరించిన స్థితప్రజ్ఞుడి జీవితాంశాలే ఇవన్నీ.

సముద్రమంత విశాల దృక్పథం, లోతైన మనస్తత్వంగల సి.వి.ఆర్ అందుకు తగ్గట్టే జలనిర్మాణ రంగాన్ని ఎన్నుకున్నారు. కృష్ణపట్నం ఓడరేవు నిర్మాణం ఆయన జీవితంలో చరిత్రాత్మక ఘట్టం. స్వంత రేవు నిర్మించాలనే ఆయన ఆకాంక్ష ఈ రూపంలో నెరవేరింది. సర్వకాలాలకు అనుగుణమైన లోతైన ఈ రేవు దేశ ప్రగతికి దీటైన సింహద్వారం కాగలదని ఆయన విశ్వాసం. ఎన్నో బెర్తుల నిర్మాణాలకు వీలైన తీర భూమి ఉన్న రేవు ఇది. దీని రూపకల్పన, నిర్మాణం, వినియోగం ఆయన భవిష్యద్దర్శనానికి నిదర్శనం. 'తూర్పుకోస్తా తీరంలో రాబోయే మా రేవులహారంలో ఈ రేవు నాయకమణిగా వెలుగొందుతుంది' అంటారు సి.వి.ఆర్. నవయుగ గ్రూప్ కిరీటంలో ఇదో కలికితురాయి. బ్రిటీష్‌వారి హయాంలోని మచిలీపట్నం ఓడరేవును నూరు సంవత్సరాల విరామం తర్వాత తిరిగి ఉపయుక్తం చేయబోతున్నారాయన. తెలుగురాష్ట్రంలో నవశకానికి ఇది నాంది. అతి తక్కువ ఖర్చుతో, పర్యావరణాన్ని విషమయం చేయకుండా మనుష్యులకు సరుకులకు, దేశీయ, అంతర్జాతీయ జలరవాణాకు ఉపయుక్తమైనది. ఒడిషా తూర్పుతీరంలో మరో రేవు పట్టణాన్ని కూడా ఆయన ఆరంభించబోతున్నారు. ఈ విధంగా ఆయన లక్ష్యసాధన సామాజిక సంపదను మరింతగా పెంచి తరువాతితరం అభ్యున్నతికి తోడ్పడుతుందని దృఢంగా విశ్వసిస్తున్నారు సి.వి.ఆర్.

వ్యాపారజీవితంలో అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోయి ఎన్నో గడ్డు పరిస్థితులకు, కష్టనష్టాలకు ఎదురొడ్డినిలిచారు. వ్యాపారంలో రాజకీయ సంబంధాలు అనివార్యం. కానీ వాటిమధ్య ఉన్న లక్ష్మణరేఖను ఎప్పుడూ దాటలేదు సి.వి.ఆర్. తన నిర్దోషిత్వాన్ని రుజువుచేసుకోవడమే అందుకు నిదర్శనం. వ్యాపార నైతికత, చట్టంపట్ల గౌరవం, దురాశలేమి, సూటిగా సరళంగా ఉండే మాటతీరు, అణకువ, మితిమీరకపోవడం, సర్వసన్నద్ధత, స్నేహితులకు సహాయం చేయడం...వంటి లక్షణాలు ఆయనను అనువైన స్థానంలో నిలబెట్టాయి.

ఆయన నామాంకిత నివాసస్థలం కృష్ణాతీరంలోని చింతావారిలంక. ఆ పరీవాహక ప్రాంతంలో చికినాల గ్రామ సంస్థాపకులు వారి పూర్వీకులు. విశాఖపట్నంలో విడిభాగాల షాపుతో ఆరంభమై శాఖోపశాఖలుగా విస్తరించి వసుధైక కుటుంబమనే ఉపనిషద్వాక్యాన్ని జీర్ణించుకున్న పరిమిత తత్వాతీతుడు సి.వి.ఆర్.

శ్రీకాళహస్తి ముఖద్వారం వద్ద కృష్ణదేవరాయలు నిర్మించిన 143 అడుగుల ఎత్తు, 92 X 65 అడుగుల వైశాల్యం గల పురాతన కట్టడ పునర్నిర్మాణం చేపట్టింది వీరి సంస్థే. కృష్ణపట్నం తీరంలో సివిఆర్ లింక్స్ గోల్ఫ్ మైదానం, నిరుపేదలకు పూర్తి ఉచితంగా యూరోపియన్ స్టైల్‌లో నిర్మించిన రెసిడెన్షియల్ స్కూలు, నవనీత పబ్లిక్ స్కూలు, సివిఆర్ ఇంగ్లీష్ మీడియం స్కూళ్ళు, తక్షణ వైద్య అవసరాలకు మాధవ చికిత్సాలయం, పోర్టు ఉద్యోగులకు ఆధునాతన డెంటల్ క్లినిక్, విద్యార్థులకు ఉపకార వేతనాలు... ఇలా ఫౌండేషన్ స్థానికులకు సర్వజన హిత కార్యక్రమాలు నిర్వహిస్తోంది.

సి.వి.ఆర్ పొడగరి. హుందాతనం, మంచి ముఖకవళికలుండే ఆయన వ్యవహారతీరులో తాత్వికత ఉట్టిపడుతుంది. చిన్న వయసులోనే జీవితభాగస్వామిని కోల్పోయినప్పటికీ ఏకపత్నీవ్రతుడుగానే మిగిలిపోయారు. శృతిమించి వ్యవహరించిన ఒక స్త్రీని సన్మార్గంలో నడిపించే ప్రయత్నం చేసి పరస్త్రీ వ్యామోహ పరీక్షలో లొంగకుండా మంచి మార్కులతో ఉత్తీర్ణుడైన మనీషి. తన ఇద్దరు కుమారులు శ్రీధర్, శశిధర్‌లను దక్షతగల వ్యాపారులుగా తీర్చిదిద్దారు.

ఒక చేతికి తెలియకుండా మరోచేత్తో దానం చేసే దయాస్వభావుడు సి.వి.ఆర్. సరైనదని భావిస్తే అడగకుండానే సాయం చేసే మనస్తత్వం. విలువలకూ, సంప్రదాయానికీ ఖచ్చితంగా కట్టుబడే మనిషి మాత్రమే కాదు, న్యాయం కోసం ప్రాణాలైనా పణం పెట్టే వ్యక్తి. మితభాషి, మౌనప్రియుడు, ఏకాంత జీవి. 'నేను' తత్వాన్ని తాత్వికంగా అర్థంచేసుకున్న ధర్మబద్ధ కార్యాచరణశీలి. విద్య, వైద్యం రెండూ సి.వి.ఆర్ సేవా ప్రాథమికతలు. అందుకు అనుగుణంగా ప్రభుత్వ పథకాలకు తోడుగా, నిజాయితీగా వ్యవహరించే స్వచ్ఛంద సంస్థల ద్వారా, ఉద్యోగావకాశాల కల్పన, నూతన పారిశ్రామికులకు ప్రోత్సాహం అందించాలనేదే ఆయన భావన. వైద్య బీమా ఎక్కువ మందికి చేరాలనేదే ఆయన ఆకాంక్ష. చికిత్సకంటే ముందస్తు నివారణే ఎంతో మేలు అంటారాయన. దీనికి అనుగుణమైన సంస్థలకు సంస్థాపకునిగా, సహాయకునిగా ఉండేందుకు ఆయన సదా సంసిద్ధం.

'జీవిత చరిత్రలు వ్యక్తిత్వ వికాస గ్రంథాలే' అనే విజ్ఞులమాటను రుజువు చేసే పుస్తకమిది.

నైతిక విలువలు, స్వీయ నియంత్రణ, మనో నిశ్చయం, చెక్కుచెదరని విశ్వాసం, అణకువ, స్థిర సంకల్పం ఒక వ్యక్తిని ఎంతటి ఉన్నతస్థాయిలో నిలబెడుతుందో తెలుసుకోగోరే యువతీయువకులు ఈ పుస్తకం చదవాలి. రచయిత సి.వెంకటకృష్ణ, సహరచయిత డాక్టర్ కె.బాబూరావు ఇద్దరూ పరకాయ ప్రవేశ విద్యలో ఆరితేరినవారేమో అనిపించేంతగా మమేకమై రాసిన పుస్తకమిది.

–రామ్మోహన్




మే 3 నుంచి
మే 9 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి ముందడుగు వేయాలి. ఖర్చులు అధికం. చిన్నారులు ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 5, 6 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. విందు, వినోదాల కోసం ఖర్చు చేస్తారు. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం. 7, 8, 9 తేదీల్లో స్పెక్యులేషన్లలో నిదానం పాటించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక విషయాల్లో భాగస్వామి వైఖరి ప్రోత్సాహకరం.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, మార్పులు, ప్రేమానుబంధాలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. బదిలీ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. 5, 6 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాలపై శ్రద్ధ చూపిస్తారు. 7, 8, 9 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. హోటల్, పరిశ్రమల రంగాల వారికి శుభప్రదం.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, విద్యావిషయాలు, సమావేశాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలకు అనుకూలం. 5, 6 తేదీల్లో వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. బదిలీలకు అనుకూలం. మార్పులు, చేర్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 7, 8, 9 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ప్రియతములకు సంబంధించి ఒక సమాచారం కలవరపెడుతుంది.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, బదిలీలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల్లో నష్టం సంభవం. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 5, 6 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. చర్చలు, ప్రయాణాలకు అనుకూలం. విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 7, 8, 9 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. 5, 6 తేదీల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. ఆర్థిక విషయాల్లో పెద్దలు తోడ్పడతారు. ఉద్యోగ, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 7, 8, 9 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. వాగ్వివాదాలకు దూరంగా ఉండాలి. స్టేషనరీ, ఏజెన్సీలు, రవాణా, బోధన రంగాల వారికి అనుకూలం.

**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**



విద్య, పెట్టుబడులు, ప్రయాణాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 5, 6 తేదీల్లో సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. సంకల్పం నెరవేరుతుంది. 7, 8, 9 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రోత్సాహకరం. విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, క్రయవిక్రయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. 5, 6 తేదీల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీరంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఊరటనిస్తాయి. 7, 8, 9 తేదీల్లో సంస్మరణల్లో పాల్గొంటారు. వాయిదా పద్ధతులపై వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో గౌరవ మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 5, 6 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్నేహానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 7, 8, 9 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రత్యర్థులపై ఒక కన్నేసి ఉంచండి. ప్రియతములకు సంబంధించి ఒక సమాచారం కలవరపెడుతుంది.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సంకల్ప సిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. వృత్తిపరమైన ప్రయాణాలు ఫలిస్తాయి. 5, 6 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 7, 8, 9 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. సహోద్యోగులతో విందుల్లో పాల్గొంటారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

చిన్నారులు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు కోల్పోయే ప్రమాదం ఉంది. 5, 6 తేదీల్లో సాంకేతిక విద్యకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. సంకల్పం నెరవేరుతుంది. 7, 8, 9 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

ఇల్లు, విద్య, వేడుకలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో వేడుకల్లో శ్రమాధిక్యం, ఊహించని ఖర్చులు వచ్చే అవకాశం ఉంది. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 5, 6 తేదీల్లో వేడుకలు, ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో మీ వైఖరిని సమీక్షించుకుంటారు. సంస్మరణల్లో పాల్గొంటారు. 7, 8, 9 తేదీల్లో గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లలో కొంత అసౌకర్యం కలుగుతుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

విద్య, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు. 5, 6 తేదీల్లో సమావేశాలు వేడుకల్లో పాల్గొంటారు. ప్రియతములతో చర్చలు ఉల్లాసం కలిగిస్తాయి. భాగస్వామికి సంబంధించిన కీలక సమాచారం అందుకుంటారు. 7, 8, 9 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాల్లో నిదానం అవసరం. విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుతుంది.



## ఒక్క అవకాశం ఇవ్వమంటోంది

కమల్‌హాసన్‌తో విడిపోయిన తరువాత రాజకీయంగా బిజీ కావాలని కలలు కంది గౌతమి. అయితే ఆమె కలలు ఏవీ నెరవేర లేదు. జాతీయస్థాయిలో మోదీని కాకాపట్టినా, తమిళనాట పన్నీరుకు జై కొట్టినా వర్కవుట్ కాలేదు. దాంతో తిరిగి నటన వైపు దృష్టి సారించింది. ఇప్పటికే తమిళనాట కొన్ని ప్రాజెక్టులు అంగీకరించింది. ఇప్పుడు టాలీవుడ్ మీద దృష్టి సారించింది. ఇక్కడ తనకు పరిచయమున్న దర్శకనిర్మాతలను కలిసి ఒక్క అవకాశం ఇవ్వమని అడుగుతోందట!

## వర్మలో ఎంత మార్పు?

సాధారణంగా ఎదుటి వ్యక్తి ఎంతటి వాడైనా సరే ముందూ వెనుకా చూడకుండా సెటైర్లు వేసేస్తుంటాడు వర్మ. అంతేతప్ప వారి మాట వినాలని ఎప్పుడూ అనుకోడు. ఎంత సేపూ తనో మోనార్క్‌లా ఫీలవుతుంటాడు. అలాంటి వర్మ ఓ వ్యక్తి మాటకు తలవంచాడు. ఎలా గంటే... 'సర్కార్ 3' సినిమా అవుట్‌పుట్ చూసిన బిగ్‌బీకి సినిమా లెంగ్త్ మరీ ఎక్కువగా ఉన్నట్టు అనిపించిందట! వెంటనే దాన్ని కొద్దిగా తగ్గిస్తే మంచిదని సలహా ఇచ్చాడట! బిగ్‌బీ మాటను శిరసావహించి వర్మ ఆ సినిమాను కొద్దిగా కుదించాడన్నది బాలీవుడ్ జనాల మాట! ఈ వార్తే కనుక నిజమైతే వర్మలో చాలా మార్పు వచ్చినట్టే అంటున్నారు. వర్మ మారాడా? లేదా? అన్నది తెలియాలంటే సినిమా విడుదల వరకూ వేచి చూడాల్సిందే! అన్నట్టు అసలు ఈ సినిమా విడుదల అవుతుందా? లేదా? అన్నది కొందరి అనుమానం.








## రష్యా సినిమాలో భల్లాలదేవ!

భల్లాలదేవ రానాకు అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు వచ్చిన సంగతి తెలిసిందే! ఆ గుర్తింపే రానాకు అంతర్జాతీయ సినిమాలో నటించే అవకాశం కల్పించింది. ఇంతకీ అసలు విషయం ఏమిటంటే... రానా రష్యా సినిమాలో నటించడానికి ఓకే చెప్పాడట! ఈ సినిమాలో తన పాత్ర బాగా నచ్చడంతో వెంటనే ఓకే చెప్పాడట! ప్రస్తుతం 'బాహుబలి' సక్సెస్‌ను తెగ ఎంజాయ్ చేస్తున్న రానా త్వరలోనే రష్యా సినిమా షూటింగ్‌లో పాల్గొంటాడట!

## శంకర్ చెక్కుడు ఎప్పుడవుతుందో..?



అంటున్నారు సినీ జనాలు. 'రోబో 2' ఇప్పుడొస్తుంది అప్పుడొస్తుంది అంటున్నాడే తప్ప కచ్చితమైన డేటు మాత్రం చెప్పడం లేదు. గతంలో ఈ దీపావళికి విడుదల ఖాయం అన్నాడు. ఇప్పుడేమో వచ్చే సంవత్సరం అంటున్నాడు. శంకర్ తీస్తోంది సినిమాకానీ శిల్పాన్ని చెక్కడం లేదుగా? అన్న అనుమానం వ్యక్తం చేస్తున్నారు కొందరు. ఇప్పటికే ఈ సినిమా బడ్జెట్ అంచనాలను దాటిపోయిందనీ, ఇంకా ఎంత ఖర్చు అవుతుందో అని ఓ పక్క నిర్మాతలు టెన్షన్ పడుతున్నారు. ఇవేమీ శంకర్‌కు వినిపించడం లేదా? అన్నది కొందరి అనుమానం!

## హీరోయిన్‌గా ఇబ్బందులు పడ్డాను

ఈ మాట అంటోంది ఇప్పటి హీరోయిన్ కాదు. ఒకప్పటి హీరోయిన్ సోనాలి బింద్రే. అప్పట్లో బాగా నడుం ఊపుతూ డ్యాన్స్ చేసే వారికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారనీ, కొన్ని సార్లు అలా డ్యాన్సులు చేయడానికి చాలా ఇబ్బంది పడ్డాననీ చెప్పుకొస్తోంది. పెళ్ళి చేసుకున్న తరువాత చాలా మంది సినిమాలు చేయమని అడిగారట! కానీ తనకు రచయిత కావడం ఇష్టమనే ఉద్దేశంతో ఆ రంగం వైపు దృష్టి సారించిందట! రచయితగా ఎదగడానికి కృషి చేస్తోందట! ఎప్పటికైనా ఓ పెద్ద లైబ్రరీ ఏర్పాటు చేయాలన్నది సోనాలి కల అట!



# ఆయన మాట జవదాటను

-కైరా అద్వాని

**కైరా అద్వాని...కొన్ని నెలల క్రితం వరకూ ఈ పేరు టాలీవుడ్ జనాలకు అస్సలు తెలీదు. బాలీవుడ్‌లో కూడా కొందరు ఈ పేరు విని ఉండకపోవచ్చు. అలాంటి అమ్మాయి ఒకే ఒక్క సినిమాతో అందరి దృష్టిని తన వైపు తిప్పుకుంది. ఆ సినిమా 'ఎంఎస్ ధోని'. ఈ సినిమా తనకి మరిన్ని అవకాశాలు తెచ్చిపెడుతుందన్న కైరా నమ్మకం వమ్ము కాలేదు. బాలీవుడ్‌లో వరుస అవకాశాలు ఆమె తలుపు తట్టాయి. ఒక్క బాలీవుడ్‌నే కాకుండా టాలీవుడ్‌ని కూడా తన వైపు తిప్పుకోగలిగింది కైరా. ముందుగా ఆమె మీద కొరటాల శివ చూపు పడింది. దాంతో మొదటిసారే మహేష్‌తో నటించే ఛాన్స్ దక్కించుకుంది. ఆ తరువాత తెలుగులో చాలామందికి కైరా మంచి ఛాయిస్‌గా మారింది. ఇక అప్పటి నుంచీ టాలీవుడ్ దర్శకనిర్మాతలు కూడా ఆమె ఇంటి ముందు క్యూ కట్టడం ప్రారంభించారు. అతి తక్కువ సమయంలోనే ఇంత అభిమానం ఊహించలేదంటున్న కైరాతో....**

### నా గురించి....

బాలీవుడ్ ఐకానిక్ అశోక్‌కుమార్‌గారి ముని మనవరాలిని. అలనాటి అందాల తార జుహీచావ్లా మేనకోడలిని. ఇదీ నా సినీ నేపథ్యం. మా నాన్నగారు జగదీప్ అద్వాని వ్యాపారవేత్త. అమ్మ ఉపాధ్యాయురాలు. మా ముత్తాతగారు, మేనత్త ప్రభావం వల్లనేమో చిన్నతనం నుంచీ నటించడం మొదలెట్టాను. నాకు తొమ్మిది నెలల వయస్సు ఉన్నప్పుడు విప్రోవారి యాడ్‌లో నటించాను. ఆ వీడియో ఇప్పటికీ చూసుకుంటే నవ్వుతో పాటు సంతోషం కలుగుతుంది. పెద్దదాన్ని అవుతున్న కొద్దీ సినిమాలంటే ఇష్టం కూడా పెరుగుతూ వచ్చింది. చాలా చిన్నతనం నుంచే హిందీ పాటలకు డ్యాన్స్ చేసేదాన్ని. పాట చూడగానే కాళ్ళు వాటంతటవి నర్తించేవి. ఇంట్లో మాత్రం సినిమాలంటే పెద్దగా ఇష్టపడేవారు కాదు. నా ఇష్టాన్ని గమనించినా గమనించనట్టు ఉండిపోయేవారు. 2009లో వచ్చిన 'త్రీ ఇడియట్స్' సినిమా మా ఫాదర్ చూశారు. దాన్ని చూసిన తరువాత నేను సినిమాల్లో నటించడానికి ఒప్పుకున్నారు. ఆ సినిమా ఆయన్ని అంత ప్రభావితం చేసింది.

### చదువును నిర్లక్ష్యం చేయలేదు...

సినిమా పిచ్చిలో పడి చదువును నిర్లక్ష్యం చేస్తానని మా మదర్ అప్పుడప్పుడు భయపడేది. నన్ను తన స్టూడెంట్‌లాగే ట్రీట్ చేసేది. ఎప్పటికప్పుడు నా యాక్టివిటీస్ మీద ఓ కన్నేసి ఉంచేది. సినిమా పిచ్చి మరీ ముదురుతోంది అనుకుంటే వెంటనే దానికి చెక్ పెట్టేది. దాంతో చదువులో వెనుకపడడం ఎప్పుడూ జరగలేదు.

### కెమెరా భయం

నెలల వయస్సులోనే కెమెరాని ఫేస్ చేయడం వలనో ఏమో కెమెరా అంటే ఎప్పుడూ భయం వేయదు. ఇక షూటింగ్ అంటే టెన్షన్ పడిందీ లేదు. ఇది నాకు ప్లస్ పాయింట్ అయింది.

### ఈ రంగంలో గుర్తింపు వచ్చింది...

'ఎంఎస్ ధోని' కన్నా ముందు రెండు సినిమాలు చేశాను. అవి నాకు గుర్తింపు తీసుకురాలేదు. ఈ సినిమాతోనే బాగా పాపులర్ అయ్యాను. నన్ను అందరూ సాక్షి

గానే (ఎంఎస్.ధోని సినిమాలో నా క్యారెక్టర్ పేరు అది) గుర్తిస్తున్నారు. కొంద రయితే అదే పేరుతో పిలుస్తున్నారు కూడా! సినిమాల్లోకి వచ్చిన తరువాత ఇంతటి అభిమానాన్ని ఇంతవరకూ పొందలేదు.

**నిజజీవితంలో సాక్షిని కలుసుకున్నారా?**

ఈ పాత్ర చేసేముందు తనని ఒకసారి కలిశాను. చాలా ఫ్రెండ్లీ నేచర్. ఆ సినిమాలో నేను అంత బాగా నటించడానికి తన పరిచయం కూడా ఒక కారణం. ఇప్పటికీ అప్పుడప్పుడు ఫోన్‌లో మాట్లాడుతుంటాను.

**ఈ సినిమా తరువాత వచ్చిన మార్పు అంటే...**

ఇంతకు ముందు ఎలా ఉండేదాన్నో ఇప్పుడూ అలాగే ఉన్నాను. సక్సెస్ ఒక్కటే కొత్తగా వచ్చి చేరింది. అవకాశాలు ఎక్కువ అయ్యాయి.

**ఇష్టపడే వ్యక్తులు...**

మాధురీ దీక్షిత్ అంటే చిన్నతనం నుంచి చాలా ఇష్టం. ముఖ్యంగా ఆమె నవ్వు. కరీనాకపూర్ నా ఆల్‌టైమ్ ఫేవరెట్ హీరోయిన్. శ్రీదేవి గారి అందం చూసి మైమరచిపోతుంటాను. ఈ వయస్సులో కూడా ఆవిడ అంత అందంగా ఎలా ఉండగలుగుతున్నారా? అన్నది ఇప్పటికీ నాకు అర్థం కాదు. అది గాడ్ గిఫ్ట్. అందరికీ అది సాధ్యం కాదు.

**అభిమానించే హీరోలు....**

చాలా పెద్ద లిస్టే ఉంది. ముందు చెప్పాల్సింది నేను సల్మాన్‌గారికి వీరాభిమానిని. అంతే కాదు ఆయన నాకు గైడ్ కూడా! అయితే ఇంతవరకూ నేరుగా ఆయన్ని కలిసే అవకాశం రాలేదు. ఎప్పుడూ ఫోన్‌లోనే మాట్లాడతాను. ఓ సినిమా ఒప్పుకునేముందు ఆయనకి ఫోన్ చేసి నేను విన్న కథ చెబుతాను. ఒప్పుకోవాలా? వద్దా? అని అడుగుతాను. ఆయన ఎలా చెబితే అలా నడుచుకుంటాను. ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన మాట నాకు శిరోధార్యం. ఆయన వద్దన్న సినిమా ఎంత ఇచ్చినా చేయను.

**సల్మాన్‌తో నటించే అవకాశం...**

ఆయనతో నటించే అవకాశం అంటే...నా మటుకు నాకు ఎవరెస్ట్ ఎక్కినంత! ఆయనతో నటించాలనుందన్న విషయం ఆయనతో ఇప్పటి వరకూ చెప్పలేదు. ఈ విషయాన్ని ఇంత వరకూ నా మనసులోనే దాచుకున్నా. ఈ విషయాన్ని సల్మాన్‌తో చెప్పే ధైర్యం నాకు లేదు.

**షూటింగ్ లేకపోతే...**

రొటీన్ వర్కవుట్లను కొద్దిగా ఎక్కువగా చేస్తాను. నాకు షాపింగ్ అంటే పిచ్చి. అప్పటి నా మూడ్‌ని బట్టి డ్రస్సులు కొనేస్తాను. రకరకాల డ్రస్సులతో నా వార్డ్‌రోబ్ ఎప్పుడూ నిండుగా ఉంటుంది. వాటిల్లో కొన్ని అయితే ఇప్పటి వరకూ వేసుకోలేదు కూడా! తేవడం వార్డ్‌రోబ్‌లో నింపడం! డ్రస్సులనే కాదు, కంటికి నచ్చిన ఏ వస్తువు అయినా వెంటనే కొనేస్తాను. షాపింగ్‌కి వెడుతున్నానంటే నా పర్స్ నిండా డబ్బులుంచదు మా మదర్. అలాగే కార్డులన్నీ తీసేసుకుంటుంది. నా షాపింగ్ పిచ్చి తనకు తెలుసు కనుక ముందు జాగ్రత్త అన్నమాట!

**బాగా నిరాశపరిచిన సంఘటనలు..**

ఎంత సినీ బ్యాక్‌గ్రౌండ్ ఉన్నా సినిమా నచ్చకపోతే అందులో నటించిన హీరో హీరోయిన్లను ప్రేక్షకులు అంగీకరించరు. నా మొదటి సినిమా విషయంలో కూడా ఇదే జరిగింది. ఎంతో ఇష్టంగా చేసిన సినిమా బాగా ఆడకపోయే సరికి చాలా నిరాశకు గురయ్యాను. ఈ రంగంలో ఇవన్నీ చాలా సహజమనీ, వీటిని పట్టించుకోకుండా ముందుకు వెళ్ళాలనీ మా ఫ్యామిలీ నచ్చచెప్పింది. ఈ విషయంలో వాళ్ళ సపోర్ట్ ఎప్పటికీ మరిచిపోలేను.

**పుకార్ల గురించి...**

మొదట్లో వీటి గురించి తెగ టెన్షన్ పడేదాన్ని. నాకు ఏమాత్రం సంబంధం లేని వ్యక్తులతో రిలేషన్‌షిప్ ఉందని రాసేవారు. అస్సలు అర్థమయ్యేది కాదు. నేను నా బాయ్‌ఫ్రెండ్‌తో పార్టీలో కనిపించానని రాసేవారు. నిజం చెప్పాలంటే నాకు పార్టీలకు వెళ్ళాలంటే పెద్దగా ఇష్టం ఉండదు. నలుగురితో అంత త్వరగా కలవలేను. అందుకే పార్టీలకూ, ఫంక్షన్లకూ దూరంగా ఉంటాను. మరీ అవసరమైతే మా ఫ్యామిలీతో వెడతాను కానీ, ఒక్కదాన్ని వెళ్ళను. అలాంటిది బాయ్‌ఫ్రెండ్‌తో కనిపించానని ఎలా రాస్తారు అని తెగ కోపం వచ్చేది. ఇప్పుడు కోపం బాగా తగ్గింది. అలాంటి రాతలు పట్టించుకోవడం మానేశాను. లైట్ తీసుకుంటాను. నాతో పాటు మా ఫ్యామిలీ కూడా వాటిని పట్టించుకోదు.

**టాలీవుడ్‌లో అవకాశం....**



'ఎంఎస్.ధోని' సినిమా ద్వారానే టాలీవుడ్‌లో నాకు అవకాశం వచ్చింది. ఇక్కడ నా తొలి సినిమానే స్టార్ హీరోతో చేయడం సంతోషంగా ఉంది. డైరెక్టర్ కొరటాల శివగారు కథ చెప్పగానే ఓకే చెప్పేశాను.

**తెలుగులో అవకాశాలంటే...**

చాలామంది అడుగుతున్నారు. ఇంకా ఎవరికీ ఓకే చెప్పలేదు. మహేష్ సార్ సినిమా అయిన తరువాత ఓకే చెప్పాలని అనుకుంటున్నాను. అలాగే హిందీలో కూడా కథలు వినడం జరిగింది. రెండు సినిమాలకు ఓకే చెప్పాను. వాటి షూటింగ్ మొదలు కాలేదు. బహుశా ఈ ఇయర్ ఎండింగ్‌కి అవి మొదలవుతాయి. ఈ గ్యాప్‌లో తెలుగు సినిమా పూర్తి చేయాలని ఉంది.

–స్పందనా రెడ్డి

# దేనికైనా ఓకే!

**-రాశి**



**ముద్దు ముద్దుగానే ఉంటూ భారీ అందాలతో యూత్‌ని ఒక ఊపు ఊపింది హీరోయిన్ రాశి. పెరిగిన వయస్సుతో, పెరిగిన బరువుతో తల్లి పాత్రలకు షిఫ్టు అయిపోయింది. ఒకప్పుడు అందరు హీరోలతో ఆడిపాడినా, ఇప్పుడు చిన్న చిన్న పాత్రలు వేయడానికి కూడా వెనుకాడడం లేదు.. కాలంతో పాటు పరిశ్రమలోనూ ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయంటున్న రాశితో....**

**రీ ఎంట్రీ ఎలా ఉంది?**

బాగానే ఉంది. మంచి క్యారెక్టర్లే వస్తున్నాయి. నేనే అన్నీ చేయడం లేదు. బాగా నచ్చినవి మాత్రమే చేస్తున్నాను. దానికి ఉదాహరణ 'కల్యాణ వైభోగమే' సినిమా! ఈ సినిమా కోసం నన్ను కొన్ని నెలల ముందే అడిగారు. అప్పటికి మా పాప చాలా చిన్నది కావడంతో ఇప్పుడప్పుడే చేయను అని చెప్పాను. మరికొన్ని నెలల తరువాత తిరిగివచ్చి మళ్ళీ అడిగారు. వాళ్ళు అంత కాలం ఎదురు చూశారని కాదు కానీ, తల్లి పాత్ర బాగా నచ్చింది. అందుకే చేశాను. నందినిరెడ్డిగారితో 'అంతఃపురం' నుంచి పరిచయం ఉంది. అప్పుడే నాతో ఓ సినిమా చేయాలని ఉందని చెప్పేవారు. ఆ తరువాత నేను సినిమాలకు దూరం అయ్యాను. తిరిగి పుష్కరం తరువాత ఆవిడ మళ్ళీ నన్ను అప్రోచ్ అయ్యారు. ఇంత కాలం తరువాత కూడా నన్ను గుర్తు పెట్టుకుని పట్టుపట్టి ఆ పాత్ర నాతో చేయించారు. ఆ పాత్ర చేయడానికి ఆవిడే ప్రధానకారణం.

**'లంక'లో మెయిన్ రోల్ చేశారుకదా? ఇప్పుడు తిరిగి క్యారెక్టర్ రోల్స్ చేస్తారా?**

ఆ సినిమా మా హజ్బెండ్ డైరెక్ట్ చేసిన సంగతి తెలిసిందే! ఆ పాత్రకు నేనైతే బాగుంటానని ఆయన పట్టుపట్టడంతో చేశాను. అన్నీ అలాంటివే చేస్తానని చెప్పను. ఎలాంటిదైనా చేస్తాను. కాకపోతే నాకున్న పేరు పోకూడదు.

**ఈ సినిమా కోసం బరువు బాగా తగ్గినట్టున్నారు?**

పాప పుట్టక ముందు మరీ సన్నగా కాదుకానీ కొద్దిగా బొద్దుగా ఉండేదాన్ని. అప్పట్లో ప్రతిరోజూ ఐదు కిలోమీటర్లు నడిచేదాన్ని. మెడిటేషన్ అవీ చేసేదాన్ని. పాప పుట్టిన తరువాత వాటికి ఫుల్‌స్టాప్ పెట్టాల్సి వచ్చింది. ఈ సినిమా కారణంగా తిరిగి అవన్నీ మొదలుపెట్టి పాత్రకు ఎంత బరువు కావాలో అంత తగ్గి సన్నగా మారాను.

**ఈ సినిమాలో మేకప్ లేకుండా నటించారు కదా? ఎలా అనిపించింది?**

గతంలో ఇలాంటి ప్రయోగాలు చేయలేదు. డీ గ్లామరైజ్ పాత్రలో ప్రేక్షకులు నన్ను ఎలా రిసీవ్ చేసుకుంటారో? అని ముందు భయపడ్డాను. కానీ వారినుంచి వస్తున్న రెస్పాన్స్ చూస్తుంటే ఆనందంగా ఉంది.

**మీ హజ్బెండ్ డైరెక్షన్‌లో మరోసారి నటించే అవకాశం ఉందా?**

అది ఇప్పుడే ఎలా చెప్పగలను. అవకాశం వస్తే నటిస్తానేమో!

**మీ వారు ఇంట్లో కథల గురించి మీతో చర్చిస్తారా?**

అలాంటివి ఏవీ ఇంట్లో చర్చకు రావు. అయినా ఆయన కథల గురించి నేను అడగనుకూడా!

# ఇంటర్వ్యూ



**రీ ఎంట్రీకి సుదీర్ఘ విరామం తీసుకోవడానికి కారణం?**

పెళ్ళి చేసుకున్న తరువాత ఇంటికే పరిమితం కావాలని ముందే నిర్ణయించుకున్నాను. అలాగే ఉండిపోయాను. పాప పుట్టేంత వరకూ కూడా సినిమాల్లో నటించాలన్న ఉద్దేశం లేదు. అనుకోకుండా అవకాశం వచ్చింది. చేశాను.

**హీరోయిన్‌గా చేసి ఇప్పుడు క్యారెక్టర్ ఆర్టిస్టుగా చేయాలంటే బాధగా లేదా?**

కాలంతో పాటు మనం కూడా మారాలి. ఉత్తరాదిలో పెళ్ళయి, పిల్లలున్నా కూడా హీరోయిన్‌గా చేస్తారు. దక్షిణాదిన ఆ పరిస్థితి లేదు. అయినా నటన మీద ఆసక్తి ఉంటే ఎలాంటి పాత్ర చేస్తున్నామన్నది కాదు, ఆ పాత్ర పేరు తెస్తుందా లేదా? అన్నది చూడాలి. ప్రస్తుతం నేను అదే చేస్తున్నాను.

**మధ్యలో కొన్ని రోజులు డబ్బింగ్ కూడా చెప్పినట్టున్నారు?**

'లక్ష్మీ కళ్యాణం' సినిమాలో కాజల్‌కి డబ్బింగ్ చెప్పాను. 'మిర్చి'లో నదియాకి చెప్పాను. ఆ తరువాత ఎవరికీ చెప్పలేదు.

**అవకాశాలు రాలేదా?**

వచ్చాయి. ఎందుకో చెప్పలేదు. తెర వెనుక కన్నా తెర మీద కనిపించడమే నాకు ఇష్టం.

**కొన్ని ప్రత్యేక గీతాల్లో కూడా చేసినట్టున్నారు?**

అప్పుడు కొన్ని కమిట్‌మెంట్ల కారణంగా నటించాల్సి వచ్చింది. ఇప్పుడు వాటి గురించి ఆలోచించడం అనవసరం.

**సినీరంగంలో అప్పటికీ ఇప్పటికీ వచ్చిన, వస్తున్న మార్పుల గురించి...?**

చాలా మార్పులు వచ్చాయి. అప్పటి పరిస్థితులు ఇప్పుడు లేవు. ఒక విధంగా చెప్పాలంటే అప్పుడున్న పరిస్థితులు ఇప్పుడు లేవు. ఇప్పటి హీరోయిన్లు చాలా అదృష్టవంతులు. మేము అనుభవించలేని చాలా సౌకర్యాలు వాళ్ళు అనుభవిస్తున్నారు. టెక్నాలజీ కూడా బాగా డెవలప్ అయింది. నా టైమ్‌లో హీరోయిన్లకు మంచి మంచి క్యారెక్టర్లు దొరికేవి. నేను చేసిన సినిమాల్లో చాలావరకూ కుటుంబ కథా చిత్రాలే ఉన్నాయి. అవి నాకు మంచి పేరునూ, ప్రేక్షకుల్లో అభిమానాన్నీ సంపాదించి పెట్టాయి. ఇప్పటి హీరోయిన్లకి అంత మంచి పాత్రలు రావడం లేదన్నది నా అభిప్రాయం. అక్కడక్కడా కొందరు మంచి మంచి సినిమాలు చేస్తున్నారుతప్ప ఎక్కువగా చేయడం లేదు. ఎంతసేపూ పాటలకూ, డ్యాన్సులకూ ఎక్కువగా పరిమితం అవుతున్నారు. ఇప్పుడిప్పుడు పరిస్థితుల్లో కొద్దిగా మార్పులు వస్తున్నాయి. నా విరామ సమయంలో నేను గుర్తించిన మార్పులు ఇవే! కాకపోతే ఇప్పటి హీరోయిన్లది హ్యాపీ లైఫ్. మా అప్పుడంత టెన్షన్ వీళ్ళు పడడం లేదు. పారితోషికం కూడా ఒక్క రోజులోనే వీళ్ళకి అందుతోంది. గతంలో ఈ విధంగా ఉండేది కాదు. కొద్దిగా ఆలస్యం అయ్యేది. అయినా ఒప్పుకున్నంత కచ్చితంగా ఇచ్చేవారు. గతంలో ఫిల్మ్ వేస్ట్ అవుతుందని భయపడేవాళ్ళం. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. అంతా డిజిటల్ అయిపోయింది కదా! వేస్టేజీ బాగా తగ్గిపోయింది.

**అప్పటి హీరోయిన్లు కొందరు నిర్మాతలుగా మారుతున్నారు కదా? మీరు కూడా నిర్మాణ రంగం వైపు వెళ్ళే ఉద్దేశం ఉందా?**

లేదు. ఎప్పటికీ ఆ రంగం వైపు చూడను. మరో సారి చెబుతున్నా. నాకు సరిపడినవి, నచ్చినవి వస్తేనే చేస్తాను. లేకపోతే ఖాళీగా ఉంటానుతప్ప నిర్మాణ రంగంవైపు కానీ, దర్శకత్వ శాఖలోకి వెళ్ళడం కానీ చేయను.

**మొన్నా మధ్య రెండు రాజకీయ పార్టీల నాయకులను కలిశారు కదా? రాజకీయాల్లోకి వెళ్ళే ఆలోచన ఉందా?**



ఆ రెండు రాజకీయ పార్టీల్లో ఒక పార్టీ అధినేత నాకు బాగా తెలుసు. పవన్‌కల్యాణ్‌గారితో ఓ సినిమా కూడా చేశాను. క్యాజువల్‌గా ఆయన్ని కలిశానుతప్ప రాజకీయాల గురించి మాట్లాడలేదు. మరొక పార్టీ అధినేతను కూడా అలాగే కలిశాను. నాకు రాజకీయాల్లోకి వచ్చే ఆలోచన లేదు నాకు అంత టాలెంట్ కూడా లేదని నా అభిప్రాయం. భవిష్యత్తు గురించి చెప్పలేను.

**పాటలు కూడా పాడుతున్నట్టున్నారు కదా?**

అప్పుడెప్పుడో ఒకసారి పాడాను. నేనేమీ ప్రొఫెషనల్ సింగర్ని కాదు.

**అప్పుడు మీతో చేసిన హీరోలు ఇప్పుడు మీతో ఎలా ఉంటున్నారు?**

వారి అభిమానంలో ఎలాంటి మార్పూ రాలేదు. కలిస్తే ఆప్యాయంగా పలకరిస్తారు. మొన్నామధ్య పవన్‌కల్యాణ్‌గారిని కలవడానికి వెళ్ళాను. గుర్తుపట్టి మాట్లాడతారా? లేదా? అన్న అనుమానంతోనే వెళ్ళాను. కానీ నా అనుమానాలన్నీ పటాపంచలు చేస్తూ పవన్‌గారు చాలా బాగా మాట్లాడారు. నాతో పనిచేసిన హీరోలు ఎలా ఉంటారు? అన్న దానికి ఇదొక ఉదాహరణ.

**ఎలాంటి పాత్రలు చేయాలనుకుంటున్నారు?**

ఏ భాషలోనైనా చేస్తాను. గతంలో దక్షిణాదిలో దాదాపు అన్ని భాషల్లోనూ నటించాను. ఇప్పుడూ అంతే! కథ నచ్చాలి. నాకు సరిపోయే పాత్ర అనిపిస్తే తప్పకుండా నటిస్తాను.

**ప్రస్తుతం చేస్తున్న సినిమాలు?**

రాంచరణ్ సినిమాలో చేస్తున్నాను. సుకుమార్ గారు డైరెక్టర్. తెలుగులో కథలు వింటున్నాను. వేటికీ ఓకే చెప్పలేదు. తమిళంలో కూడా అంతే!

—చిన్ని

# ఇవన్నీ నిజాలే!

## విడదీయరాని బంధం !

- ఇద్దరు కవలల్ని పుట్టిన వెంటనే వేరుచేసి వేర్వేరుచోట్ల పెంచారు. కానీ వారి తల్లిదండ్రులు వారిద్దరికీ జిమ్ అనే పేరే పెట్టారు. వారు ఇద్దరూ లిండా అనే పేరు గల అమ్మాయిల్నే పెళ్ళాడారు. వారిద్దరికీ పుట్టిన కొడుకులకు జేమ్స్ అలన్ అనే పేర్లే పెట్టారు. చివరికి తమ 39 వ ఏట వారిద్దరూ కలుసుకున్నారు.
- హాట్ మెయిల్ సృష్టికర్త సబీర్ భాటియా భారతీయుడే. ప్రపంచంలో వెబ్ ఆధారిత ఈ మెయిల్ ప్రోగ్రామ్స్‌లో నెంబర్ –1 స్థానం హాట్ మెయిల్‌దే.
- ప్లాస్టిక్ కరెన్సీని అస్ట్రేలియా ప్రభుత్వం 1988లోనే అందుబాటులోకి తెచ్చింది.
- మన శరీర మూలపదార్థంలో 90 శాతం నక్షత్ర ధూళికి చెందినదే. హైడ్రోజన్, హీలియం మినహా మిగిలిన శరీర మూల పదార్థమంతా నక్షత్రాలలో సృష్టించబడినదే.
- వాల్టర్ సమ్మర్‌ఫోర్డ్ అనే వ్యక్తి తన జీవితకాలంలో మూడుసార్లు పిడుగుపాటుకు గురయ్యాడు. అతడు మరణించిన తర్వాత కూడా అతడి సమాధి పిడుగుపాటుకు గురై బద్దలైపోయింది!
- సముద్రంలోపల తిరిగే సబ్‌మెరైన్ల సంఖ్య కంటే అక్కడ పడి ఉన్న విమానాల సంఖ్యే ఎక్కువ!! ఆకాశంలో తిరిగే విమానాల సంఖ్య కంటే కూలిపోయిన విమానాలే సముద్రంలో ఎక్కువున్నాయి!
- ప్రపంచవ్యాప్తంగా చికిత్సకోసం ఆసుపత్రులకు వెళ్ళినవారిలో ఏటా రెండు లక్షలమంది ఇన్ఫెక్షన్స్‌కు గురవుతుండగా, వారిలో 80 వేల మంది మరణిస్తున్నారు.
- పోలీసు వ్యవస్థలో పన్నెండు జాతుల కుక్కలను మాత్రమే నేరస్థుల్ని వేటాడేందుకు ఉపయోగిస్తారు.
- భూగోళం మొత్తానికి దాదాపు ఏడాదికాలంపాటు సరిపడేంత ఇంధన శక్తి కేవలం ఒక్క గంట సూర్యకాంతిలో ఉంది.
- థామస్ ఎడిసన్ తన రెండవ భార్యకు మోర్స్‌కోడ్ నేర్పించాడు. ఇక అప్పటినుండీ వారు కుటుంబ సభ్యుల ఎదుటే ఒకరి చేతులు మరొకరు తట్టుకుంటూ రహస్య సంభాషణ చేసేవారు.
- నిద్ర లేచిన పదినిమిషాలకు మనం కన్న 90 శాతం కలలు మరచిపోతాం.
- మందుల చీటీపై డాక్టర్లు అర్థంకాకుండా రాసే చిక్కిరిబిక్కిరి రైటింగ్ వల్ల ప్రతి సంవత్సరం ప్రపంచంలో ఏడువేల మంది మరణిస్తున్నారు.
- ఆఫ్రికా అడవుల్లోనే క్రూరమైన ఏనుగులు రోజుకు రెండు గంటలు మాత్రమే నిద్రపోతాయట. తరచు రెండు రోజులపాటు నిద్రలేకుండానే సంచరిస్తాయట.
- నయాగరా జలపాతం నీటివేగం ఒరిపిడికి గడచిన పదివేల ఏళ్ళ కాలంలో రాళ్ళు ఏడుమైళ్ళ మేరకు కరిగిపోయాయి.
- హంసలు ఒకే భాగస్వామితో జీవితకాలంపాటు శారీరక అనుబంధం కొనసాగిస్తూ బాధ్యతాయుతంగా బతుకుతాయి.

–చిన్నారి

# సుధామ పదగారడి-312

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | 1 | ❖ | 2 | 3 | | ❖ | 4 | ❖ |
| 5 | | | ❖ | | ❖ | 6 | | |
| ❖ | | ❖ | 7 | | 8 | 8 ❖ | | ❖ |
| 9 | | 10 | | ❖ | 11 | 12 | | 13 |
| | 14 ❖ | | ❖ | 14 | ❖ | | ❖ | |
| ❖ | 15 | 15 ❖ | 16 | | | ❖ | 17 | ❖ |
| 18 | | | ❖ | | ❖ | 19 | | |
| ❖ | | ❖ | 20 | | | ❖ | | ❖ |
| 21 | | | ❖ | | ❖ | 22 | | |

### ఆధారాలు

**అడ్డం**

2. క్రీస్తు, బుద్ధుడు, గాంధీ మొదలైనవారు ప్రబోధించింది (3)
5. కమతములో దైవసంబంధి ఒక మార్గం మాత్రమే (3)
6. నూనె (3)
7. ఏడుపులో ఓ తరహా (3)
9. క్షమాభిక్ష లభిస్తే నేరస్థుడికి జైలునుంచి ఇది లభిస్తుంది. (4)
11. దెబ్బలాట, కలహము (4)
16. రణం (3)
18. ఏడుపు లేనిది (3)
19. ఓ కప్పు  కాఫీ, నాలుగు మంచి మాటలు ఇలాగయితేననే అభ్యర్థన (3)
20. విహంగములు (3)
21. చావు (3)
22. ఆవు తల్లి (3)

**నిలువు**

1. బుద్ధుడు కాక మునుపు అతడు (4)
3. హిందూ దేశ పౌరుడు ఎవరైనా ఇదేనన్నారు ఒకరు (3)
4. సుమమాల (4)
7. బావుల – మధ్య లేదు (2)
8. రోగము (2)
9. చాపము (2)
10. కరుణ వంటిదే (2)
12. నడక (2)
13. పంది ముక్కు (2)
14. 'మాంక్' అంటే ఇతడే! (5)
15. గౌతముని భార్య (అహల్య కాదు) (4)
17. టిబెట్ నుండి వస్తూ వుండే ప్రసిద్ధ బౌద్ధ గురువు (4)

### పదగారడి-311 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | పు | ర | స్కా | రం | | జ్ఞా | పి | క |
| ప | | స | | ఔ | జ | న | | |
| స | మా | న | ము | | | ము | సు | రు |
| లే | | | త్యం | స | అ | | రు | |
| ని | వా | ళి | | | | బా | డు | గ |
| | హ | | యో | గ్య | ము | | | రు |
| వై | నం | | చ | | ని | గి | ర్వు | డు |
| | | జ | న | మే | | త్త | | డు |
| ము | క్కి | ర | | కీ | ళా | ర | త్న | |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

